# ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన కేరళ ఆయుర్వేద వైద్యశాల వారి ప్రత్యేక చికిత్సలు!! (ఆపరేషన్‌లు లేకుండా)

## H.I.V / A.I.D.S. H.I.V / A.I.D.S. వ్యాధిగ్రస్థులకు శుభవార్త!!

H.I.V / A.I.D.S లు నయముకాని వ్యాధులని అనుకుంటున్నారా? దక్షిణ కాలిఫోర్నియా యూనివర్శిటీ వారి పరిశోధన ప్రకారం "మానవ శరీరంలోని A.P.O.B.EC-3G అనే ఎంజైము ఉంటుంది. H.I.V శరీరములోనికి ప్రవేశించిన వెంటనే దాన్ని అడ్డుకునే సామర్థ్యం కల్గిన ఎంజైము శరీరములోని ప్రతి కణములోను ఉంటుంది." శరీరములోని ప్రతికణములో ఉన్న బలహీనపడిన A.P.O.B.EC-3G ఎంజైమును శక్తివంతం చేస్తే అది H.I.V ని నాశనం చేస్తుంది. మా మందులు వైరల్ లోడ్‌ని తగ్గించి CD-4 కౌంట్ పెరిగి సాధారణ స్థితికి వస్తుంది. H.I.V సోకిన వ్యక్తిని A.I.D.S నుండి కాపాడవచ్చు. H.I.V /A.I.D.S లు ప్రాణాంతకాలు కావు. CD-4 కౌంట్ (Immunity) ని 90 రోజులలో మన మందుల ద్వారా 800 నుండి 1500వరకు పెంచుకొని పూర్తి జీవితకాలం ఆరోగ్యముగా జీవించవచ్చును. 15 రోజులలో మీకు గుణము కనిపించును.

## కేన్సర్ - CANCER కేన్సర్ - CANCER - వ్యాధిగ్రస్థులకు శుభవార్త!! (ఆపరేషన్‌లు లేకుండా)

* మెదడు * నోరు * థైరాయిడ్ గ్రంథి * స్తనములు * ఊపిరితిత్తులు * అన్నవాహిక * జీర్ణాశయము * పసరుతిత్తి * కాలేయము * పాన్‌క్రియాసిస్ * మూత్రపిండములు * ప్రాస్టేటు గ్రంథి * మూత్రకోశము * జీర్ణ కోశము * ప్రేగులు * గర్భాశయ కంఠము (సెర్విక్స్) * గర్భాశయము * అండములు * పురుషాంగము * వృషణములు * న్యూరోబ్లాస్టోమా * కండరములు * ఎముకలు * చర్మము * లింఫ్ గ్రంథులు ఎంతో మంది క్యాన్సర్ వ్యాధిగ్రస్తులకు చికిత్స చేస్తున్నటువంటి కేరళ ఆయుర్వేద వైద్యశాల. రేడియేషన్ థెరపి. కీమోథెరపి, హార్మోన్ థెరపి, బయోలాజికల్ థెరపి, మరియు ఇతర వైద్యపద్ధతులను తీసుకుంటున్న వారు కూడా మా ఆయుర్వేద మందులు వాడవచ్చును.

## షుగర్ DIABETES MELLITUS అతి మూత్రము DIABETES INSIPIDUS వ్యాధి బాధితులకు శుభవార్త!!

అన్ని వయసుల వారికి ఎన్ని సంవత్సరముల నుండి షుగర్ వ్యాధి ఉన్నా (TYPE - II DIABETES. NON INSULIN DEPENDENT DIABETES MELLITUS. (NIDDM) కొద్ది రోజులలో నియంత్రణలోకి వస్తుంది. (TYPE -1 DIABETES. INSULIN DEPENDENT DIABETES MELLITUS. (IDDM) 60 రోజులలో నియంత్రణలోకి వస్తుంది. కోర్సు అయిన తరువాత ఆహార నియమాలు యోగ, నడక, శరీర, వ్యాయామాలు లేకుండా పంచదార, బెల్లం, తేనె, ఖర్జూరము లాంటివి తీసుకుంటూ వ్యాధిని తగ్గించుట ఈ మందు యొక్క ప్రత్యేకత. షుగర్ పేషంట్లకు మానని పుళ్లు, గాయములు, గాంగ్రీన్ లాంటివి 30 రోజులలో మాన్పించవచ్చును. (PER MONTH Rs.2000/-) TYPE - II COURSE 3 MONTHS. TYPE - 1 COURSE 6 MONTHS.

## త్రాగుడు మానండి! మాన్పించండి !! STOP -ALCOHOL !!

మీరు అనుకోకుండా బానిసలుగా మారిన త్రాగుడును ఆల్కహోల్‌ను(Alcohol), గంజాయి (Bang), నల్లమందు(Opium) (Morphine). బీడి, సిగరెట్, గుట్కా, కల్లు, సారాయి, మైకం మొదలగు మత్తుమందులు మా ఆయుర్వేద మందు ద్వారా మానవచ్చును. లేదా వ్యసనపరుడైన వ్యక్తిని తీసుకురాకుండా మరియు అతనికి తెలియకుండా మాన్పించవచ్చును. (Per Month Rs.1500/-) Course : 2 months.

## బట్టతల!! Baldness! నెరసిన జుట్టు!! Grey Hair!

చుండ్రు, జుట్టు రాలుట, పేను కొరుకుడు, దురద, కళ్ళ మంటలు, దీర్ఘకాల తలపోటు, మాడు పోటు, పార్శ్వపు నొప్పి, మెదడును చల్లబరుచుట, సుఖనిద్రను కలిగించి జ్ఞాపక శక్తిని వృద్ధిపరచి తలలోని పేలను వదలగొట్టి, జుట్టును నల్లగా ఒత్తుగా, పొడువుగా పెంచి బట్టతల నెరసిన జుట్టును నివారించును. Kerala Herbal Hair Tonic (Oil) 100ml Rs.500/-, 250ml Rs.1100/-. Kerala Herbal Shampoo - 100ml Rs.50/-; 250ml Rs.120/-; Herbal Hair Capsules 60 - Rs350/- (Per Month Rs.900) Course : 6 Months.

## సంతానం లేని (Infertility-Sterility) దంపతులకు శుభవార్త!! (ఆపరేషన్‌లు లేకుండా)

సంతానోత్పత్తి కణాలు తక్కువగా ఉన్న మగవారికి కణాలలో కదలిక లేని వారికి కణాలు పూర్తిగా లేనివారికి (Azoosperimia) వెరికోసిలేషన్ (Varicoseviens) (Per month Rs.4000/-) Course : 3 months. స్త్రీలకు అండాశయముల నుండి అండములు విడుదలకాక పోవుట. అండవాహికలు మూసుకొని పోవుట (Fallopian Tubes Block). గర్భాశయ పొరలకు వ్యాధి సోకినా, ప్రొలాక్టిన్ హార్మోన్ ఎక్కువశాతములో ఉన్నా, లోపలి ద్రవాల్లో ఆమ్లగుణము (Acid) ఎక్కువగా ఉన్నా, ఎండోమెట్రియాసిస్. అండములు చాలా చిన్నవిగా ఉన్నా రసాయన చికిత్సల ద్వారా ప్రత్యేక చికిత్స చేయబడును. (Per Month Rs.4000/-) Course : 3 months.

## గర్భిణీ స్త్రీలకు (pregnancy) శుభవార్త!! (సిజేరియన్ ఆపరేషన్ లేకుండా)

సుఖ ప్రసవము కలుగుటకు తల్లి, బిడ్డ ఆరోగ్యముగా బలముగా మంచి రంగు, రూపము, తెలివితేటలు, తేజస్సు కల బిడ్డలు జన్మించుటకు (Per month Rs.2000/-) Course : 6 months.

## ఉబ్బసం (Asthma) ఎలర్జీ (Allergy) వ్యాధులకు ప్రత్యేక చికిత్స!!

జలుబు, దగ్గు, ఆయాసం, తుమ్ములు, పిల్లికూతలు, కఫం, ముక్కునుండి నీరు కారుట, ఊపిరి ఆడకపోవడము, సైనసైటిస్ (Sinusitis) ఇసినోఫీలియా (Eosinophilia) దుమ్ము, ధూళి, ఏసి, కూలర్, మంచు చల్లగాలుల వల్ల కలుగు ఎలర్జీ వ్యాధులకు Asthma Sanjivini 200ml Rs.350/- (Per month Rs 700/-) Course : 9 months.

✓ **నూతన యవ్వన శక్తికి, శీఘ్రస్ఖలనము, హస్తప్రయోగము** (Masturbation) : నపుంసకత్వము (Impotency) అంగస్తంభన సరిగా లేకపోవుట, లైంగిక వాంఛ లేకపోవుట (Libido), రతి మధ్యలో అంగము మెత్తబడి చిన్నగా ముడుచుకొని పోవుట, వృషణములు కుచ్చించి పోవుట (Atrophy of Tests). ✓ ప్రోస్టేటు గ్రంథి వాపు (Enlarge Prostate) per month Rs.3000/- Course : 3 months. ✓ **సుఖవ్యాధులు** (Venereal Diseases) : వ్రణములు, పుండ్లు, సెగ, కొరుకుడు గనేరియా సిఫిలిస్, గ్లీట్, షాంక్రాయిడ్, (per month Rs 1500/-) Course : 3 Months. ✓ **హెర్పిస్ సింప్లెక్స్** (Herpes Simplex) హెర్పిస్ జోస్టర్ (Herpes Zoster) (Per month Rs.3000/-) Course : 3 months. ✓ **స్తనముల ఎదుగుదలకు** : జారిన (వాలిన) స్తనములను చిన్నగా, మెత్తగా ఉన్న స్తనములను సైజును పెంచి, గట్టిగా, గుండ్రముగా చేసి స్త్రీలను అందముగా కనబడునట్లు చేయును, స్తనముల సైజును తగ్గించుటకు (Decrease) (Per month Rs.1000/-) Course : 3 months. ✓ **స్త్రీలకు పొత్తికడుపు మీద గోకిన గీతలు,చారలు పోవుటకు** (Screch Marks) (Per month Rs 1000/-) Course : 3 months. ✓ **మలబద్ధకము** (Constipation) : (Per month Rs.3.00/-) Course : 1 month. ✓ **గ్యాస్ట్రబుల్, ఎసిడిటి, అల్సర్, అజీర్ణము** (Dispepsia), ఆకలి లేకపోవుట, కడుపులో నొప్పి, మంట (Gastritis) జీర్ణాశయములో ఆసిడ్ ఎక్కువై చాతిలో మంట (Acidity), జీర్ణాశయములో పుండు (Peptic Ulcer) అంత్రమూలములో పుండు (Duodenal Ulcer) (Per month Rs.900/-) Course : 3 months. ✓ **రక్తమొలలు, అర్శమొలలు** (Piles) Haemoroids. ఆసనములో చీలిక పుండ్లు (Fissers) (ఆపరేషన్ లేకుండా) (Per month Rs.900/-) Course : 3 months. ✓ **పులిపిర్లు** (Warts), ఆనెలు (Corns) Rs.300/- ✓ **సోరియాసిస్** (Psoriasis) (Per month Rs.3000/-) Course 3 months : ✓ **బొల్లి** (Leucoderma). (Per month Rs.3000/-) Course : 3 months. ✓ **స్థూలకాయము** (Obesity) : అధిక బరువును, లావును తగ్గించుటకు (No Diet, No Exercise) (Per month Rs.3000/-) Course : 3 months ✓ **సన్నగా బలహీనముగా** ఉండు వారు, బరువు పెరిగి, లావుగావుటకు, ఎత్తు పెరుగుటకు, (ఐదుడులోపు వారు) (Per month Rs.3000/-) Course : 3 months ✓ **కీళ్ళ కండరాల నొప్పులకు** : (Rheumatis arthritis) నరముల వాపు (Neuritis) (Backache), నడుము నొప్పి (Lumbago), మెడనొప్పి, వెన్ను నొప్పి (Spinalcord), తుంటి నొప్పి,సయాటిక ఆపరేషన్ లేకుండా (Per month Rs.900/-) Course : 3 months ✓ **పక్షవాతము** (Paralysis) (Per month Rs.6000/-) Course : 3 months. ✓ **మూర్ఛ, అపస్మారకము**,(Fits) (Epilepsy) **పిచ్చి, ఉన్మాదము** (Mania) **హిస్టీరియా** (Hysteria) **జ్ఞాపకశక్తి తగ్గిపోవుట** (Loss of Memory) **నిద్రపట్టకపోవుట** (Insomnia), (Per month Rs.3000/-) Course : 3 months ✓ **చెవిపోటు** (Ear ache) : చెవినుండి చీము కారుట, చెవుడు, చెవిలో హోరు శబ్దము ఆపరేషన్ లేకుండా. (Per month Rs.900/-) Course : 3 months. ✓ **నత్తిని తగ్గించుటకు** (Stammering): (Per month Rs.2000/-) Course : 3 months ✓ **స్త్రీల శరీరంపై వచ్చు అవాంఛిత రోమములు తిరిగి మొలవకుండా చేయుటకు** : (Per month Rs.3,000/-) Course : 1 month FITS / HEPATITIS / HERPES / HERNIA / HYDROCELE / THYROID / LIVER CIRRHOSIS / HEART / KIDNEY / PANCREASIS / GALLBLADER STONES అన్ని రకముల దీర్ఘకాల వ్యాధులకు సంప్రదించండి. మాకు మరెక్కడా బ్రాంచీలు లేవు.




# కేరళ ఆయుర్వేద వైద్యశాల

ఓడియన్ 70 ఎంఎం థియేటర్ ఎదురుగా, రేమాండ్స్ & Fantoosh Showroom ప్రక్కన, TQS Showroom పైన, చిక్కడపల్లి మెయిన్‌రోడ్, హైదారాబాద్-20. ఫోన్ : 65526109. 9392355590, 9866155109




**Note :** పోస్ట్ ద్వారా కూడా చికిత్స కలదు, ఉత్తరాలద్వారా మీ సమస్యలను తెలియచేసి, మీ దగ్గర ఉన్న రిపోర్టు పంపి ఫోన్ ద్వారా సంప్రదించి చికిత్స పొందవచ్చును. మందు ఖరీదు మరియు ఏపీలో పోస్టల్ /కొరియర్ ఛార్జీ రూ. 100/-, ఇతర రాష్ట్రాలవారు రూ.250/- కలిపి మనియార్డర్ లేదా డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా పంపువారు Kerala ayurveda vaidyasala పేరు మీద ఇక్కడ రాసినట్లుగా వ్రాసి పంపవలెయును మీ ఫోన్ నెంబరుతో సహా పంపించండి. ఫోన్ ద్వారా సంప్రదించువారు 10 A.M. - 8 P.M. Sunday 10 A.M to 2 P.M

# చతుర

సంపుటి -33
సంచిక - 6
జులై 2010
390వ సంచిక





కవర్ పేజీ ఫొటో : దిలీప్ బెనర్జీ

ముఖపత్రాలంకరణ : రాజుయాట

ఈయన పేరు ఎలగప్ప. కర్నాటకలో రాజకీయ బలంగల బడా వ్యాపారి. ఈయన పుత్రరత్నం పేరు రుద్రప్ప. సకల దుర్గుణ సంపన్నుడు.. తండ్రీకొడుకులు చేయని నేరాల్లేవు.. ఘోరాల్లేవు. వీరికి సలహాదారు క్రిమినల్ లాయర్ కేశవరెడ్డి. లాయర్‌కంటే క్రిమినల్‌గానే ఆయనగారు ఎక్కువగా ఆలోచిస్తారు.. అలాగే చరిస్తారు.. ఆచరిస్తారు. పుట్టినరోజు సందర్భంగా రుద్రప్ప మైసూరులోని తన హోటల్లో స్నేహితులందరికీ ఘనంగా పార్టీ ఇస్తున్నవేళ అనుకోకుండా ఓ ప్రేమజంట వారిచేతుల్లో దారుణ హత్యకు గురైంది.. అప్పుడే రుద్రప్ప గ్రహస్థితి కూడా తిరగబడిందని తండ్రికి తెలుస్తుంది. అతన్ని కాపాడుకోడానికి ఎలగప్ప ఏంచేశాడు?

అక్షరాక్షరంలో ఉత్కంఠ పెంచే
**శ్రీగంగ** నవల
**మృత్యు రహస్యం** 18 పేజీలో..

బొమ్మలు : **ఆనంద్**



# 1 లక్ష పెట్టుబడితో

# బుకింగ్

# ఐదేళ్ళ తర్వాత

# 10 లక్షలు

## బ్యాంక్ లోను సదుపాయం

**VUDA APPROVED** ఇళ్ళస్థలం






**DHANAVRUDDHI**

**ధనవృద్ధి**



**EARNING THROUGH LEARNING**

**GRANDHI VENKATA NAGESWARARAO,** Financial Advisor

email: grandhivnrao@yahoo.com, lntgrandhivnr@yahoo.in

**Phones : 0884-2375160, 6953689 Mobile : 99480 19839**

ఈనాడు, కాకినాడ, 91771 11375

అపార్ట్‌మెంటాలజీ 30

# పిచ్చికుక్కలకు స్వాగతం



యర్రంశెట్టి శాయి

(గత సంచిక తరువాయి..)

కీమారాణి దగ్గర కెళ్ళాలంటే మాకు భయం వేసింది. ఆమె అసలే పిచ్చిది. పైగా ఆ రోజు అమావాస్య. వ్యవహారం చాలా వయొలెంట్‌గా ఉంటుంది. అయినా గానీ రిస్క్ తీసుకుని వెళ్లి ఆమె ఇంటి తలుపు కొట్టాం!

అరగంట తలుపు బాదాక "ఎవరూ! క్యా హోనా" అంటూ గొంతు వినిపించింది.

గొంతు ఎక్కడినుంచి వినిపించిందా అని వెతుకుతూంటే తలుపు పైనున్న వెంటిలేటర్‌లో కనిపించిందామె తల.

"మేమే అపార్ట్‌మెంట్ కమిటీవాళ్లం"

"సిగ్గు లేదురా మీకు? నా ఇంటికి రావద్దు. నాతో మాట్లాడొద్దు అని ఎన్ని సార్లు చెప్పాల్రా బాడుకవ్? ఈడికెళ్ళిపోతున్నారా లేదా? " అంటూ వేడినీళ్ళు పైన్నుంచి మా మీద విసిరిగొట్టింది.

మా అందరిమీదా ఆ సలసల కాగుతోన్న నీళ్లు పడేసరికి అందరం గావుకేకలు పెట్టుకుంటూ మెట్లవేపు పరుగెత్తాం.

మాతోపాటు వచ్చిన ఎస్.ఐ చెయ్యి అప్పటికప్పుడే బొబ్బలెక్కిపోయింది.

"ఇప్పటికయినా ఆ కీమారాణి పిచ్చిదని ఒప్పుకుంటారా? " ఎస్.ఐ.ని అడిగాం.

"పిచ్చిది కాకపోతే అకారణంగా మనందరిమీదా సలసల కాగే నీళ్లు విసురుతుందా? " చిరాగ్గా అన్నాడు ఎస్.ఐ.

"అవునా! అలాంటప్పుడు పిచ్చివాళ్ళ కంప్లెయింట్ అని తెలిసి కూడా మీరెందుకు పట్టించుకుంటున్నారు" పాయింట్ లాగాడు శంకరమూర్తి.

ఎస్.ఐకి కోపం వచ్చింది.

"ఇదిగో.. మీకేం తెలివుందా లేదా? మనల్ని పరిపాలించేవాళ్లల్లో తొంభయ్ శాతం పిచ్చోళ్లే అని మీకు తెలుసు కదా! అలా అన్జెప్పి మీరు వాళ్లకి ఓట్లు వేసి గెలిపించటం మానారా? మా డిపార్ట్‌మెంట్ ఆ పిచ్చోళ్ళ చేతిలో రాయిలాగా ప్రజలకు తగుల్తోందా లేదా? "

మా వాళ్లు ఏం మాట్లాడాలో తెలీక బుర్రగోక్కున్నారు.

"ఇంతకూ ఇప్పుడేం చేద్దామంటారు? " అడిగాడు జగన్.

కొంతమంది ఆ పిచ్చికుక్క వద్ద కాపలా ఉండండి! మిగతావాళ్లు జీహెచ్ఎమ్‌సీ

ఆఫీస్‌కెళ్లి వెంటనే మీ ఏరియాలో ఎక్కువ యిపోయిన పిచ్చికుక్కల్ని పట్టుకుపోవాలని ధర్నా చేయండి. ఆ ధర్నా న్యూస్ టీవీ చానెల్లో మినిస్టర్లు చూశారంటే వెంటనే జీహెచ్ఎమ్‌సీవాళ్లను యాక్షన్ తీసుకోమని ప్రెజర్ చేస్తారు"

ఆ ఆలోచనేదో బాగానే ఉందనిపించింది. వెంటనే మా కాలనీకి చుట్టుపక్కలున్న లేబర్‌ను వెంటపెట్టుకుని అందరం జీహెచ్ఎమ్‌సీ చేరుకున్నాం!

మేము ఆ కాంపౌండ్‌లోకి అడుగుపెడుతూండగానే ఓ అరడజను కుక్కలు వాటిలో అవే భయంకరంగా ఫైటింగ్ చేసుకుంటూ మా మీదకు దూకినయ్. వాటి ఫోర్స్‌కి మాలో కొంతమంది కింద పడిపోయారు. కొంతమంది గోడ దూకేశారు. ఇంకొంతమంది కాంపౌండ్‌లో ఉన్న జీహెచ్ఎమ్‌సీ కార్లమీదా, లారీల మీదా ఎక్కేశారు. ఒక అయిస్‌క్రీమ్ బండివాడు కర్రతో వాటన్నిటినీ బయటకు తోలేశాడు.

"ఇక్కడే కుక్కల న్యూసెన్స్ ఇలా ఉంటే ఇంక సిటీ గురించి వీళ్లేం పట్టించుకుంటారు? " అన్నాడు బోస్.

అందరం మళ్లీ గుమికూడి కుక్కల సెక్షన్ వెతుక్కుంటూ తిరుగుతూంటే చాలాసేపటి తర్వాత కనిపించిందా ఆఫీస్.

ఒక హాల్లో నాలుగు టేబుల్స్ మీద నాలుగు బోర్డులున్నాయ్.

కోతికాటు విభాగం, కుక్కకాటు విభాగం, పందికాటు విభాగం, దోమకాటు విభాగం.

అందరం డాగ్ బైట్ టేబుల్ దగ్గర కెళ్ళాం. ఆ టేబుల్ మీదా, కిందా, అల్మారాల్లో, ఎటు చూసినా ఫైళ్లే.

ఆ కుర్చీల్లో కూర్చున్న వ్యక్తుల వెనుక కొన్ని స్లోగన్స్ అందమయిన అక్షరాలతో పెయింట్ చేసి వున్నాయ్?

"కుక్కలను ప్రేమించుమన్నా- మక్కువన్నది పెంచుమన్నా"

మనిషికన్నా ఊరు ముఖ్యం- ఊరు




కన్నా దేశం ముఖ్యం- దేశం కన్నా కుక్క ముఖ్యం- కుక్కలను ఆదుకోండి!" ఇంకా అలాంటివి చాలా రాసివున్నాయి.

మేము అక్కడికి చేరుకునేప్పటికే కొంత మంది ఆడామగా ఏడుపులు, పెడబొబ్బలతో ఆ టేబుల్ చుట్టూ గుమికూడి వున్నారు.

"ఓరి దేవుడో! నీలోఫర్ హాస్పిటల్ మట్టి కొట్టుకుపోనూ- ఉస్మానియా దవాఖానా తగలడిపోనూ- అప్పుడే పుట్టిన పసిపిల్లల్ని కుక్కలెత్తుకుపోయినయ్. అంతా చోద్యం చూస్తున్రుగానీ ఒక్క బాడుకవ్ కూడా మా పిల్లల్ని రక్షించలేదు.

ఆడున్నది మనుషులా, బర్రెలా? డాక్టర్లనడిగితే పోలీసుల్తో చెప్పమంటున్రు! పోలీసులకు చెప్తే మున్సిపలోళ్లకు జెప్పమంటుండె! ఈడ కొస్తే గంటలు గంటలవుతున్నది.. గింతవరకూ కుక్కల సమస్య గురించి ఏ కుక్కకు మొక్కాల్నో సమజ్‌కాకున్నది!" అరుస్తోంది ఒకావిడ.

అంతవరకూ నిద్రపోతున్నట్లు ఆమె మాటలు వింటూన్న ఆ కుక్కల ఇన్‌ఛార్జ్

కోపంగా కళ్లు తెరిచాడు.

"ఇదిగో.. మాటలు మంచిగా రానీమ్మా! కుక్కకు మొక్కాల్నా అంటే మేము కుక్కలమా? " అన్నాడు ఫోర్స్‌గా.

ఆ లేడీకి కోపం ముంచుకొచ్చింది.

"థూ, నీ మొఖం పురుగులు తిన! నిన్ను కుక్కఅని ఎందుకంటా? నువ్ ఆ నీలోఫర్ కుక్కకంటే హీనంరా. ఇప్పటికి పాతికసార్లు ఆ నీలోఫర్ దవాఖానాలో కుక్కలు పసిపిల్లగాండ్లను ఎత్తుకపోయి ఛంపి తిన్నయ్. అయినాగానీ ఒక్క మినిస్టరు బాడుకవ్ ఏమీ చేయలే. మున్సిపల్ బాడుకవ్‌లూ కళ్లు మూసుకున్నారు"

ఆ మాటతో ఆ సెక్షన్‌లో ఉన్నాళ్ళందరికీ కోపం వచ్చింది.

"ఇగో..ముసలీ..ఆ గలత్ మాటలే వద్దంటున్నా. మంచిగ మాట్లాడు! లేకుంటే బయటకు నూకిస్తా" అన్నాడొకతను ఆవేశంగా.

"అరే, నేను ఒక్క మాటంటేనే నీకు ఇంత పొడుచుకొచ్చి బయటకు నూకుతానంటున్నావ్! మరి పిల్లగాళ్లను ఛంపుకు తినే ఆ నీలోఫర్ కుక్కలనాడనే ఉంచి మేపుతున్నావేందిరా? నీకు ఇనరాదా? కండ్లు కానరావా? "

మరో క్లర్క్ లేచి ఆమెకి సర్ది చెప్పటానికి ప్రయత్నించారు.

"అదంతా ఎందుకమ్మా! కమిషనర్ సాబ్‌ని కల్సుకుని నీ పరేషానీ ఏందో జెప్పు"

"అగో.. నా పరేషానీ అంటావేంట్రా బాడుకవ్! ఇది పబ్లిక్ అందరికీ పట్టిన పరేషానీరా? "

"అదిగో మళ్లీ తిడుతున్నావ్" అన్నాడతను కోపంగా.

"తిట్టుడేందిరా.. కత్తి ఉంటే నరుకుతా.. నీయవ్వ"

కుక్కల ఇన్‌ఛార్జ్ లేచి నిలబడ్డాడు.

"జరిగిందేదో జరిగింది గదా! మమ్మల్ని తిడితే ఏంది లాభం? కుక్కలు చంపిన మీ బిడ్డ తిరిగొస్తదా? " అన్నాడు చాలా తెలివిగా మాట్లాడుతున్నాననుకుని. దాంతో ఆమె ఒక్కసారిగా పిచ్చిదానిలా మారిపోయింది.

"అరే బాడుకవ్! నా బిడ్డను పోగొట్టుకున్నాననే ఈడికొచ్చినా రా! నాలెక్క ఇంకొకళ్ల బిడ్డక్కూడా కుక్క చావు ఛావొద్దని బుద్దిజెప్పనీ కచ్చినా రా! నాలెక్క ఇంకో తల్లిగూడా ఈ జీహెచ్ఎమ్‌సీకి బలి కావొద్దని అచ్చినా రా! మనుషుల ప్రాణాలు పోనీగానీ కుక్కల్ని మంచిగా జూడాలనే ఈ గవర్నమెంట్ బాడుకవ్‌లను జుట్టు పట్టుకుని చౌరాస్తాలోకి ఈడ్వాలని అచ్చినా రా!" అంటూ ఆక్రోశిస్తూ మాట్లాడుతూంటే మా అందరి కళ్లవెంబడి నీళ్లు తిరిగినయ్.

పెళ్లయి ఇనేళ్ళయినా పిల్లలు లేరని ఎంతోమంది డాక్టర్ల చుట్టూ తిరిగి, ఎందరో దేవుళ్లకి మొక్కి, ఒక్కగానొక్క పాపను కంటే, ఆ పాప పుట్టిన కొద్ది గంటల్లోనే కుక్కలెత్తుకెళ్లి చంపి తినేస్తే.. ఇలాంటి నికృష్ట దేశాన్నే పేరు పెట్టి పిలుస్తారు?

'ఇండియా' అనే పిలుస్తారు!

రేప్‌లు, యాసిడ్ దాడులు, మర్డర్స్, మనుషుల మీదనుంచీ వెళ్లే బస్‌లూ లారీలూ, నిషాతో నడిపే కార్లూ, ఫ్రాడ్‌లూ- వీటన్నిటినుంచీ జనం దృష్టి మళ్ళించడానికి ఇంటింటికీ 'మద్యం' అందే ఏర్పాటు చేసే ఈ నరకాన్ని ఏమంటారు? 'భారత ప్రజాస్వామ్యం!'

జగన్, షైనీ, కృష్ణమూర్తి, శంకరమూర్తి అందరూ కలిసి ఏడుస్తోన్న ఆ స్త్రీని ఓదారుస్తూ బయటున్న బెంచీమీద కూర్చోబెట్టారు.

ఆమె రూమ్‌లోనుంచి వెళ్ళాక అప్పుడు ధైర్యం వచ్చింది కుక్కల ఇన్‌ఛార్జ్‌కి.

"అరెరె.. ఇదేం కిరికిరిరా భయ్? నీలో

ఫర్ హాస్పిటల్ల ఏదో జరుగుతే దానికి బాధ్యత మేమా? నాకు తెల్వకడుగుతా! మనదేశంలో ఏదోక దిక్కు మనుషుల్లేని జాగా కానొస్తదిగానీ కుక్కల్లేని జాగా ఏడున్నదివయ్యా!

ఒక పిల్ల ఛస్తే నెక్ట్స్ ఇయర్‌లో ఇంకో పిల్ల పుడతదిరా! దాన్ని గురించి ఇంత లొల్లేంది? " అని లెక్చరిస్తూ మావేపు తిరిగాడు.

"మేము జెప్పాలనుకున్న ప్రాబ్లెమ్, మిమ్మల్ని మేము తిట్టాలనుకున్న బూతులూ అన్నీ ఆమెవరో గానీ మంచిగ జెప్పింది కదా.. సమజ్ కాకుంటే జెప్పు.. మేమందరం కూడా షురూ జేస్తాం" అన్నాడు విజయ్‌యాదవ్.

దాంతో వాళ్లంతా కంగారుపడ్డారు.

"అంటే మీరు గూడా నీలోఫర్ హాస్పిటల్ కెళ్లి అస్తున్రా? " అడిగాడు ఒకతను గాబరాగా!

"నీలోఫర్ ఒక్కటిగాదురా భయ్! ఆంధ్రప్రదేశంతా నీలోఫర్లతోటే 'హౌస్‌ఫుల్' అయింది. మీరు మూసుకుపోయిన కండ్లు తెరచి చూస్తే సమఝౌతదీ సంగతి" అన్నాడు జగన్.

"గట్ల రౌండ్ ఎబౌట్ మాట్లాడితే మాకు తెల్వదు. ఏం జరిగిందో క్లియర్‌గా జెప్పండి" అన్నాడు ఇన్‌ఛార్జ్.

"మా రామ్‌భరోసా అపార్ట్‌మెంట్స్ చుట్టూ కుక్కలు ఫుల్ అయిపోయినయ్. ఏ రోడ్‌మీద చూసినా పాతిక కుక్కలు ఉంటున్నయ్.

ఇదివరకు చిన్నపిల్లల్ని ఎటాక్ చేసేవి. ఇప్పుడు మా అందర్నీ కూడా కరుస్తున్నాయ్. కార్ల వెనుక, స్కూటర్ల వెనుక పడి కరుస్తున్నాయ్. పైగా ఇప్పుడు వాటిల్లో కొన్నిటికి పిచ్చెక్కింది. ఇప్పటికి మా అపార్ట్‌మెంట్స్‌లో పది మందిని కరచినయ్" చెప్పాడు బోస్.

మా మాటలు విని వాళ్లు డిజపాయింట్ అయ్యారు "అంతేనా? ఇంకా మీ అపార్ట్‌మెంట్స్‌లో పిల్లల్ని కూడా చంపేసిన య్యేమో అనుకుంటి" అన్నాడు ఛీఫ్.

అతని మెడ పిసకాలన్న కోరికతో విజయ్ యాదవ్ చేతులు చాచి ముందుకు వెళ్తుంటే మేము అడ్డుపడ్డాం.

"సరేసరే, ఒక రెప్రజెంటేషన్ రాసి అందరూ సంతకాల్జేసివ్వండి. యాక్షన్ తీసుకుంటాం" అన్నాడతను.

"ఇంకెప్పుడు తీసుకుంటావ్.. తొక్కలో యాక్షన్. ఇప్పటికి అరవై ఎనిమిది సార్లు రాసిచ్చాం" అన్నాడు శంకరమూర్తి.

అతను షాకయినట్లు నటించాడు.

"అలాగా! ఇగో బాలాజీ! ఆ ఫైల్ చూడు ఎక్కడుందో"

"అది ఇరవైమూడో సర్కిల్"

"ఫైల్ ఇమ్మంటే ఇరవై మూడో సర్కిల్ అంటావేంటి? "

"ఆ సీట్ మేడమ్ లీవ్‌లో ఉంది"

"ఓ.. మర్చేపోయా!" అంటూ మావేపు తిరిగాడు.

"ఆ మేడమ్ లీవ్‌లో ఉందండీ! రాగానే ఫైల్ పుటప్ చేయించి యాక్షన్ తీసుకుంటాం"

మాకు మండిపోతోందిగానీ హమీద్ మియా కంట్రోల్ చేస్తుండటం వల్ల సైలెంట్‌గా ఉండిపోయాం.

"ఆ మేడమ్ లీవ్‌లోకెళ్లి ఎప్పుడు వాపస్ వస్తయ్? " అనడిగాడు హమీద్‌మియా.

"ఆరు నెలలు లీవ్. లీవ్‌లో వెళ్ళి రెండు నెలలయిపోయింది గనుక ఇంకో నాలుగు నెలల్లో వచ్చేస్తారు"

ఆ జవాబుతో హమీద్‌మియాకి కంట్రోల్ పోయింది.

"ఏమి? ఆరు నెలలు లీవా? "

"అవును"

"ఆరు నెలలు లీవ్ తీసుకునేంత కష్టప

డతారా ఈ ఆఫీస్‌లో" అడిగింది షైనీ.

"ఆ మేడమ్ ఆరు నెలలు కష్టపడబట్టీ ఆరు నెలల మెటర్నిటీ లీవ్ ఇచ్చారు" చెప్పాడు చీఫ్.

దాంతో షైనీ మాటలు బంద్ అయిపోయాయ్.

"ఇగో! మా ఏరియాకి ఇలాగే మీ స్టాఫ్‌ని పంపించి ఆ కుక్కలన్నింటినీ పట్టిస్తావా లేదా? " అడిగాడు జగన్ కోపంగా.

"అంటే? ఏంది నీ సంగతి? రుబాబ్ జేస్తున్నావా? "

"అవ్. ఇంకో గంటలో నీ స్టాఫ్‌ని పంపకపో! నిన్నూ నీ ఆఫీస్‌నీ తగలబెడతా!"

"తగలబెడితే లోపటవుతావ్"

"లోపటయినా ఫర్వాలే! అన్నిటికీ ప్రిపేరయి వచ్చినా!"

చీఫ్‌కింక ఏం మాట్లాడాలో తెలియ లేదు. అతని అసిస్టెంట్ వెంటనే అతనిని కాపాడ్డానికి ఒక అయిడియా ఇచ్చాడు.

"కమిషనర్ సాబ్ దగ్గరకు పొమ్మను సార్! మనకెందుకీ కిరికిరి? "

ఆ మాటతో ఇన్‌ఛార్జ్ రిలీఫ్ ఫీలయ్యాడు.

"ఇదిగో చూడండి! ఇమ్మీడియెట్ యాక్షన్ కావాలనంటే మా కమిషనర్ సాబ్‌ని కలవండి" చెప్పాడు హేపీగా.

"కమిషనర్‌నేంటి? వాడబ్బని కూడా కలుస్తాం" అన్నాడు బోస్.

అందరం కమిషనర్ చాంబర్ చేరుకున్నాం.

మమ్మల్ని చూడగానే పీఏ మొఖంలో చికాకు కనిపించింది.

"ఏం గావాలె? "

"కమిషనర్‌ని కలవాలె"

"సార్ కియాళ టైమ్ లేదు. రేపు రండ్రి"

"ఇయాళ, గిప్పుడే చూడాలి. చూస్తాం. సమజయినయ్? ఏమైనా డౌట్స్ వస్తయ్? " అడిగాడు హమీద్‌మియా.

"నువ్వెవరసలు? "



"రామ్ భరోసా అపార్ట్‌మెంట్స్ వెల్ఫేర్ కమిటీ ప్రెసిడెంట్‌ని"

"దేన్దిక్కు-కెళ్ళి కమిషనర్ సాబ్ కలవాలనుకుంటున్రు? "

"కుక్కల న్యూసెన్స్ గురించి"

"కుక్కలు, పిల్లుల గురించి డిస్కస్ చేయటమే కమిషనర్ సాబ్ పననుకుంటివా? ఆ డిస్కషనంతా కుక్కల విభాగంలో డిస్కస్ చేయాలి, సమజైందా? "

"అదయ్యాకే ఇక్కడికొచ్చినాం! సమజైందా? " అన్నాడు విజయ్ యాదవ్ బల్ల గుద్ది మాట్లాడుతూ.

దాంతో అక్కడే నిలబడి మా మాటల్ని వింటున్న ప్యూన్‌కీ, పీఏకీ తిక్కరేగింది.

"ఏయ్! మంచిగ జెప్తుంటే మీక్కాదూ? రేపు సాయంత్రం వరకూ కమిషనర్ సాబ్ బిజీగుంటారు. ఇంక పోతారా, సెక్యూరిటీని పిలవాలా? "

"ఇప్పుడే చూస్తామని జెప్తుంటే నీక్కాదూ? నీకేం దమాక్ లేదా? " అరిచాడు మొహిందర్.

"ఆడినడిగేదేంట్రా! కమిషనర్ గదిలోకి



పదండి! ఎవడాపుతాడో చూద్దాం" అన్నాడు విజయ్ యాదవ్.

కమిషనర్ గది ముందు అడ్డంగా నిల బడ్డ ప్యూన్‌ని ఒక్క తోపుతోసి తలుపు తెరుచుకుని అందరం లోపలకు జొర బడ్డాం.

అప్పుడే ఓ బిల్డర్ చేతిలోనుంచి ఒక పెద్ద నోట్ల బండిల్ తీసుకుంటున్న కమీష నర్ షాకయిపోయి, ఆ షాక్‌ని కవర్ చేసు కోడానికి కంగారుపడి, ఆ కంగారును కవర్ చేసుకోవడానికి వెధవ నవ్వొకటి నవ్వాడు. అంతలోనే సడెన్‌గా స్పృహలో కొచ్చి నోట్ల బండిల్ అల్మారాలో ఉంచి డోర్స్ లాక్ చేశాడు.

"వెంటనే- అంటే సాయంత్రం లోపల ఈ డబ్బుంతా బాంక్‌లో డిపాజిట్ చేయించు! డేట్ తేడా వస్తే ఆడిటర్స్ పట్టుకుం టారు. మళ్ళీ.. తెల్సిందా? " ఆ వ్యక్తితో అన్నాడు కమీషనర్.

"అలాగే సార్. అలాగే, అలాగే" అన్నా డతను బయటికెళ్ళిపోతూ. అప్పుడు కోపంగా మావేపు తిరిగాడా ఉన్నతాధికారి.

"ఎవరు మీరు? ఎవర్నడిగి లోపలికొ చ్చారు? "

మా వెనుక నిలబడ్డ ప్యూన్ మమ్మల్ని తోసుకుంటూ ముందుకొచ్చాడు.

"నేను వెళ్ళొద్దని చెప్తున్నా వినకుండా నన్ను తోసేసి లోపలికొచ్చారు సార్"

"మీ స్టాఫ్ పనిచెయ్యకపోతే బరాబర్ వస్తాంబే! కమిషనరేం? మినిస్టర్ చాంబర యినా గిట్లనే నూక్కుపోతాం!" అన్నాడు జగన్ ఆవేశంగా.

అతని ఆవేశం చూసి కమిషనర్ కొంచెం తగ్గాడు.

"ఇంతకూ మీ ప్రాబ్లమేంటి? "

"మా అపార్ట్‌మెంట్స్ చుట్టుపక్కల వీధు లన్నీ కుక్కలతో నిండిపోయాయని సంవ త్సరం నుంచీ కంప్లెయింట్ చేస్తున్నాం! ఇంతవరకూ ఒక్కనాకొడుకు పట్టించుకోలే! ఇప్పుడు వాటిల్లో నాలుగు కుక్కలకు పిచ్చె క్కింది. ఇంతవరకూ తొమ్మిది మందిని కరిచాయ్. పిల్లలు స్కూలుకెళ్తుంటే వెంట బడి కరుస్తున్నాయ్. ఇలాగేనా కార్పొరే షన్ పని చేసేది? ఏనా కొడుక్కీ రెస్పా న్సిబిలిటీ లేదా ఇక్కడ? " అరిచాడు బోస్.

దాంతో కమిషనర్‌కి కోపం వచ్చింది.

"ఏయ్ మిస్టర్. ఏంటి? ఇష్టం వచ్చి నట్లు బూతులు తిడుతున్నావ్? నువ్వె వర్తో మాట్లాడుతున్నావో తెలుసా? "

"నువ్వెవడయితే మాకేంటి? మా ప్రాబ్లెమ్ చెప్పమన్నావ్. చెప్పినా!"

"ఇలా తిక్కగా మాట్లాడేట్లయితే బయట కు పొండి! మీలాంటోళ్లతో మాట్లాడాల్సిన అవసరం నాకు లేదు"

"నీకు లేకపోవచ్చు గానీ అడ్డమైనోడితో మాట్లాడాల్సిన అవసరం మాకుంది" అన్నాడు శంకరమూర్తి.

"ఏయ్.. ఏంటి? ఊరుకుంటున్నకొద్దీ రెచ్చిపోతున్నారు? ముందు నా రూమ్‌లో నుంచి బయటకుపోతారా లేదా? " కోపంగా అన్నాడు కమీషనర్.

"మా ప్రాబ్లెమ్ సాల్వ్ అయ్యేవరకూ

మేమెక్కడికీ పోము సార్. అందరూ ఈడనే బైఠాయించండి! ఈ జీహెచ్ఎమ్సీ ఓళ్ళతో ఎట్లా పనిచేయించాలో మాకు తెలుసు. కూచోండి" అంటూండగానే అందరు సోఫాల మీద, టేబుల్ మీదా, నేలమీద కూర్చుండిపోయాం! కమీషనర్ హడావుడిగా ఫోన్ తీశాడు.

"ఇప్పుడే పోలీస్‌ని పిలుస్తా. ఎట్లా బయటకు పోరో చూస్తా" అంటూండగానే హమీద్‌మియా అతని చేతిలోని ఫోన్ లాక్కున్నాడు.

"అంటే? నామీద రువాబ్ చేస్తున్నారా? "

"ఇది ఆంధ్రప్రదేశ్. ఎవళు రువాబ్ జేస్తే ఆడిపనే అవుతదీడ" అన్నాడు మొహిందర్. ఈలోగా ప్యూన్ నలుగురు పోలీసుల్ని రూమ్‌లోకి తీసుకొచ్చాడు.

"ఇదుగో వీళ్లే సార్" అన్నాడు ఆ కానిస్టేబుల్స్‌కి మమ్మల్ని చూపిస్తూ.

"ఏంటిబాబూ! ఏం జరుగుతోందిక్కడ? " అడిగాడు ఓ సీనియర్.

"మా ఏరియాలో పిచ్చికుక్కలు ఎక్కువయినయ్. యాక్షన్ తీసుకోమంటే ఎవ్వడూ మాట వినటం లేదు"

"అయితే? రువాబ్ జేస్తరా? నడవండ్రి. అందరూ బయటకు నడవండ్రి! కమిషనర్ సాబ్ రూమ్‌లో కూర్చుంటే ఏమన్నట్లు? "

"ఇదిగో కానిస్టేబుల్‌గారూ! మీ ఏరియాలో కుక్కల బాధ లేదా? మీ పిల్లల్ని, దార్నిపోయేవాళ్ళని కుక్కలు కరవడం లేదా? " అడిగాడు శంకరమూర్తి.

"మా ఏరియాలో కుక్కల బాధ లేదు" అన్నాడు కానిస్టేబుల్.

అందరం షాకయ్యాం.

"కుక్కలు లేవా అసలు? "

"లేవా అంటే ఉన్నాయ్‌కానీ అవి కరవవు. మాకు కోతుల బాధ ఎక్కువ. ఇప్పటికి ఇరవై మందిని కరచినయ్"

కమీషనర్‌కి చిరాకేసుకొచ్చింది.

"ఇదిగో ముందు వీళ్ళను బయటకు పంపండయ్యా! ముచ్చట్లు పెట్టుక్కూర్చుంటారేంటి? " అన్నాడు పోలీసులతో.

దాంతో పోలీసులు ఎలర్ట్ అయ్యారు.

"ఇగో ఛలో భయ్. బాహర్ ఛలో. పదండ్రా భయ్. నడు బాబూ.. చూస్తారేంది.. నడు" అంటూ మమ్మల్ని గది బయటకు నెట్టడానికి ప్రయత్నించాడు.

అంతే! ఒక్కసారిగా హమిద్‌మియా నినాదాలు మొదలుపెట్టాడు.

'పోలీస్ జులుమ్ - డౌన్‌డౌన్'

'జీహెచ్ఎమ్సీ జులుమ్ - డౌన్‌డౌన్'

'చేతకాని అధికారులూ - రిజైన్ కరో రిజైన్ కరో'

జీహెచ్ఎమ్సీ కమిషనర్ - రిజైన్ కరో రిజైన్ కరో'

మా అరుపులకు ఆఫీసంతా దద్దరిల్లిపోవడంతో స్టాఫంతా మూగిపోయారు. అందర్నీ తోసుకుంటూ తుగ్లక్ ఛానెల్ కెమెరామెన్, జర్నలిస్ట్ ముందుకొచ్చారు. వస్తూనే తుగ్లక్ రాజు మొదలుపెట్టాడు.

"వెంగమాంబా! రామ్‌భరోసా అపార్ట్‌మెంట్స్‌వాళ్ళు ఆ పిచ్చికుక్కల విషయంలో పోలీసులతో ఘర్షణ పడ్డాక- పోలీస్‌ల సలహా మీద జీహెచ్ఎమ్సీ చేరుకున్నారు వెంగమాంబా! కమీషనర్‌గారి రూమ్‌లో బైఠాయింపు, సమ్మె చేస్తూ నినాదాలు చేస్తున్న దృశ్యం మన చానెల్ ప్రేక్షకులు చూడవచ్చు వెంగమాంబా"

కెమెరా అందరి మీద తిరుగుతోంటే మేము మళ్లీ నినాదాలు ప్రారంభించాం-

"కుక్కల సమస్య - పరిష్కరించాలి!"

"జీహెచ్ఎమ్సీ పరిష్కరించాలి"

"జీహెచ్ఎమ్సీ కమిషనర్- వెంటనే యాక్షన్ తీసుకోవాలి"

కుక్కల సమస్య - పరిష్కరించాలి-

*(మిగతా వచ్చే సంచికలో..)*

# కాప్షన్ మీదే - 19



ఈనాడు కార్టూనిస్ట్, ప్రముఖ చిత్రకారుడు శ్రీధర్ వేసిన పై కార్టూన్‌కు నవ్వొచ్చే కాప్షన్ రాయండి. చక్కని బహుమతి అందుకోండి! బాగున్న మరో నాలుగు ఎంపిక చేసి పంపినవారి పేర్లను ప్రచురిస్తాం.

మీ కాప్షన్లు అందాల్సిన చివరి తేదీ ఈ నెల 17

చిరునామా: సంపాదకులు, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్- 082

e-mail : vipula.chatura@gmail.com

ఉత్తమ వ్యాఖ్య :

పార్టీలోకి యువరక్తం రావాలిట

–రామ సోమయాజులు
కొడిగేహళ్లి, బెంగళూరు





## కాప్షన్ మీదే -18

బాగున్న మరికొన్ని కాప్షన్లు :

రోజుకొక రంగును మార్చే నేతని!
నా బొమ్మకు రంగేసుకోవడం ఎంతపని!!

– జె.తేజస్, బి.వి.నగర్, నెల్లూరు

'శ్రీధర్' వచ్చేదాకా
ఆగలేక పోతే ఎలా?

– నేమాన సుభాష్‌చంద్రబోస్, శ్రీకాకుళం

ఆగండాగండి! అంతా మీరేసుకుంటే ఎలా?
కాస్త బొమ్మగారికి కూడా మిగల్చండి!!

– టి.ధీర, మదీనాగూడ, హైదరాబాద్

వేసేది వేషం!
చేసేది మోసం!!

– వి.వీరభద్రరావు,
నాచారం, హైదరాబాద్

# నాజూకుతనం దేవుడిచ్చిన వరం

ఏడెనిమిది వసంతాలకు మునుపు వెండితెర ప్రవేశం చేసేటప్పుడు ఎలా ఉందో ఇప్పటికీ అంతే సుకుమారంగా కనిపిస్తోంది త్రిష. నాటితో పోలిస్తే అందం నాలుగిందాల పెరిగింది. తెలుగు, తమిళంలో మరిన్ని విజయాలను మూటగట్టుకున్న త్రిష ఇటీవల బాలీవుడ్‌లోనూ కాలుమోపింది. ఆమెను తెరంగేట్రం చేయించిన ప్రియదర్శన్ హిందీలోకీ స్వాగతించారు. 'వృత్తిమీద ధ్యాస, మానసికోల్లాసం ఉంటే వయసు ప్రభావం మనమీద ఉండదు' అనేది త్రిష ఫిలాసఫీ. ఆమె చెప్పే సౌందర్యారోగ్య సూత్రాలు మీరూ పాటించండేం?



★ ఆకు కూరలు, కూరగాయల ముక్కలు, పండ్లు.. అన్నింటినీ రోజూ తీసుకోవాలంటే కష్టమని చాలా మంది అంటుంటారు. అలాంటప్పుడు ఆకుకూరలను కాస్త ఉడకబెట్టి తగినంత పిండిని కలిపి రోటీలు చేసుకోవచ్చు. దీంతో అదనపు పోషకాలను ఆరోగ్యంలోకి చేర్చుకున్నట్టే. పిజ్జాలు, బర్గర్లకు బదులు కూరగాయల ముక్కలను తింటే మంచిది.

★ గోరు వెచ్చటి నీటిని ఉదయాన్నే తాగడం చాలా మంచిది. ప్రతి రోజూ రాత్రి నిద్రకు ముందు గ్లాసు గోరు వెచ్చని పాలు తాగడం తప్పనిసరి. ఇది శరీరంలో కాల్షియం నిల్వలను పెంచుతుంది.

★ ఎప్పుడూ మనకు అందుబాటులో ఉండేది నీరే.. రోజూ బాగా నీరు తాగాలి. నిద్రలేవగానే రాగి చెంబులో ఉంచిన నీళ్ళు తాగితే చాలా మంచిది. ఇక షరబత్‌లో చక్కెరకు బదులు తేనెను ఉపయోగించినా ఫలితం ఉంటుంది.

★ ఖాళీ కడుపుతో ఎక్కువ సేపు ఉండకూడదు. అలాగని భుక్తాయాసం వచ్చేవరకూ తినకూడదు. హద్దుల్లో ఉంటేనే మంచిది.

★ నేను ఏమి తిన్నా అది నా ఆరోగ్యానికి ఎంత వరకు ఉపకరిస్తుందనే విషయాన్ని ఒకటికి పదిసార్లు ఆలోచిస్తాను. నా స్నేహితులతో ఉన్నప్పుడు నేనేం తింటున్నానో ఎప్పుడూ ఆలోచించను. వారి సరసన ఎంత సరదాగా ఉండాల్నో అంతే సరదాగా ఉంటాను.

★ నిమ్మపండు, తేనె, బొప్పాయి ముక్కలు, చపాతీలు.. లావుగా ఉన్నవారు ఒళ్ళు తగ్గడానికి చాలా ఉపయోగపడతాయి.

★ లీటర్ల కొద్దీ నూనెను వాడేయకుండా అతి తక్కువ నూనెతో ఎలా వండుకోవాలో తెలుసుకుంటే నూనె ఆదా కావడంతోపాటు, శరీరంలో కొవ్వు శాతం తగ్గుతుంది.

★ మంచి నూనెతో మసాజ్ చేయించుకోవడం మనసుకు, శరీరానికి కూడా హాయినిస్తుంది.

★ ఎప్పుడూ ఉన్నవీ లేనివీ మాట్లాడకూడదు.

చాలా విషయాల్లో మౌనం మంచిది. ఎదుటివారిది గొడవపడే మనస్తత్వమైనా అలా సంయమనంగా వ్యవహరిస్తే మనల్ని చూసి తగ్గుతారు.

★ మనం పిలిస్తే నలుగురు పలుకుతున్నారన్న భావన మానసిక ధైర్యాన్నిస్తుంది. అందుకే వీలైనంత వరకు పరిధిని పెంచుకోవడానికి ప్రయత్నించాలి. పరిచయస్తులు ఎక్కువగా ఉంటే ఆత్మవిశ్వాసం పెరుగుతుంది. ఆత్మవిశ్వాసంతో వచ్చిన అందం అందరినీ ఆకర్షిస్తుంది.

★ కురుల ఆరోగ్యానికి ప్రతి ఒక్కరూ ప్రత్యేక శ్రద్ధను కనబరచాలి. ఏ మాత్రం వీలున్నా గుడ్డులోని తెల్ల సొనను కురులకు పట్టించి కాస్త ఆరాక కడిగేయాలి. అలాగే పెరుగులో మెంతి పిండిని కలిపి, కొన్నిసార్లు మందార ఆకులు నూరి పెట్టుకుంటే నిగనిగలాడే కురులు సొంతమవుతాయి. వీటన్నింటినీ ఏకధాటిన ఒకేరోజు



చేయాలని తాపత్రయపడకూడదు. నేను ఎక్కువగా మెంతిపిండి కలిపిన పెరుగును పెట్టుకుంటాను.

★ గోళ్లు పొడవుగా ఉంటే నాకు చాలా ఇష్టం. అందుకే నాకు కుదిరినప్పుడు కాస్త గోరువెచ్చటి ఆలివ్ ఆయిల్‌లో కొంతసేపు గోళ్ళను ముంచుతాను. ఆ తర్వాత షేప్ చేస్తే కావలసిన ఆకృతి వస్తుంది.

★ తక్కువ రకం మేకప్ సామగ్రిని ఎప్పుడూ వాడను. క్లీన్సింగ్ చేసుకోవడానికి చాలా వరకు పాలనే ఉపయోగిస్తాను. మేకప్ పూర్తిగా తొలగించిన తర్వాత దూదిని పాలలో ముంచి ముఖాన్ని శుభ్రంగా తుడుచుకుంటాను.

★ వారానికి ఒకసారి శరీరం మొత్తానికి నూనె పట్టించి అభ్యంగనం చేస్తే హాయిగా అనిపిస్తుంది. అదేవిధంగా కాస్త గోరువెచ్చటి నూనెతో తలకు మర్దన చేసుకున్నా ఒత్తిడి దూరమవుతుంది.

★ వ్యాయామాలు తప్పనిసరి. రాత్రి ఆలస్యంగా నిద్రకుపక్రమించేవారు ఉదయాన్నే కాస్త ఆలస్యంగా లేవవచ్చు. లేకుంటే మధ్యాహ్నం చిన్నపాటి కునుకు తీయవచ్చు. ఏదైనా మంచిదే. రాత్రి త్వరగా నిద్రపోయే వారు తెల్లారుజామునే లేచి ప్రణాళిక వేసుకోవచ్చు. ఏదైనా పద్ధతి ప్రకారం జరిగితే మరింత ఆనందం.

★ మ్యాచింగ్స్ విషయంలో మనం ఏం ధరిస్తున్నామన్నది ఎంత ముఖ్యమో దానికి సరిపోయే చెప్పుల నుంచి చెవిదుద్దుల వరకూ అన్నీ ఉన్నాయా అని చూసుకోవడం తప్పనిసరి. వెస్ట్రన్ దుస్తులకు పల్లెటూరి అదనపు ఆకర్షణలు ఎబ్బెట్టుగా ఉంటాయి. ఇది గ్రహిస్తే చాలు.

★ ఏదైనా సరే ధరించడానికి ముందు ఇతరులమెప్పు కోసం కాక నా సౌకర్యాన్ని గురించి ఆలోచిస్తాను. దీనివల్ల నేను అసౌకర్యంగా భావించే సందర్భాలు అరుదుగా ఉంటాయి.

★ ఆరోగ్యాన్నిచ్చే ఆటలు కొన్ని ఉంటాయి. షటిల్, ఫుట్‌బాల్, వాలీబాల్.. స్కూలు దశ నుంచీ నేను వీటన్నింటినీ ఆడేదాన్ని. ఇప్పటికీ స్నేహితులమందరం కలిస్తే ఆటలే.

★ ఏదో లక్ష్యాన్ని సాధించలేకపోయామని దిగులు పడితే ప్రయోజనం ఉండదు. దాన్ని సాధించడానికి ఏమేం మార్గాలున్నాయో, ఎక్కడ ఓడిపోతున్నామో ఆలోచించి సరిదిద్దుకోవాలి.

★ ప్రతిరోజూ వ్యాయామం తప్పనిసరి. ఎవరికి దొరికే సమయాన్ని బట్టి వారు వ్యాయామాలు చేసుకోవచ్చు. నడక, యోగా, అందులోనూ పవర్ యోగా అత్యుత్తమ ఫలితాలనిస్తాయి.

★ ఎండలో తిరిగి వచ్చిన తర్వాత కళ్ళను వెంటనే కడిగేయాలి. ఎక్కువసేపు నలపకూడదు. దీనివల్ల నష్టమే తప్ప లాభముండదు. తీరిక లేకుండా పనిచేయాల్సి వచ్చినప్పుడు కూడా మధ్యమధ్యలో లేచి తిరుగుతూ ఉంటే కాస్త హుషారుగా అనిపిస్తుంది.

★ అతిగా ఫోన్లో మాట్లాడటం తగ్గిస్తే సమయపాలన విలువ తెలుస్తుంది. మనం పనులను హడావిడి లేకుండా నిశ్చింతగా చేసుకోవచ్చు.

–చల్లా భాగ్యలక్ష్మి

# HIV / AIDS వారికి శుభవార్త

మీరు గాని, మీ డాక్టర్‌తో గాని వచ్చి నిజనిర్ధారణ చేసుకొని 15 రోజులలోనే 25శాతం (4వ వంతు) ఖచ్చితంగా లక్షణములు తగ్గించుకొని మంచి ఆకలిని, నిద్రను పొంది, భయము, ఆందోళన మరియు ఆవేదన తగ్గించుకొని క్రమేణా కంట్రోల్, నార్మల్, నెగెటివ్ ఏది కావాలో అంతవరకు మందులు వాడి మీరే పొందండి.

HIV/ ఎయిడ్స్ వైరస్ క్షీణించే మందు ప్రపంచంలో ఇంతవరకు లేకపోవుటచే HIV పెరుగుచుండుట వలన ఎల్లప్పుడూ శరీరం వేడిగా ఉండి క్షీణించుచుండుట, ఆకలి లేకపోవుట ఈ రెండు లక్షణములు ఎన్ని రకముల మందులు వాడినను మనిషి జీవించి ఉండగా తగ్గుట కల్ల. కానీ మా మందులు HIV వైరస్‌ను నిముషములో నశింపచేయు శక్తి కలిగివుండుటవలన 48 గంటలలోనే అతి వేడి తగ్గి మంచి ఆకలి, నిద్రను పొంది శరీరం క్షీణించుట, తగ్గుటవలన 15 రోజులలోనే భయము, ఆందోళన తగ్గి మంచి ధైర్యవంతులు కాగలరు. అందువలన టి.బి. మరియు కేన్సర్ ముదిరిన వారు తప్ప 4 నెలలు మందులు వాడి, మేము చెప్పిన పత్య పానాదులు జీవితాంతం పాటించుచున్నవారు మాత్రమే రక్షించబడుచున్నారు. ఇది సరికాదు అని నిరూపిస్తే 2 లక్షల రూపాయల బహుమతి ఇవ్వబడును. మా మందులు ICMR, CCRAS, NACO, NARI వారిచే ప్రశంసించబడి, GMP సర్టిఫికెట్ పొందిన జి.పి.నేచురల్ హెర్బ్స్ ఫార్మాస్యూటికల్స్ ప్రైవేట్ లిమిటెడ్ వారిచే తయారుచేయబడి సెంట్రల్ గవర్నమెంటు వారిచే పేటెంటు హక్కు పొంది 1500 కేసులు చేసిన ఏకైక సంస్థ. ఫ్రీ కన్సల్టేషన్, హెర్పిస్, హైపటైటిస్-బి, ఆస్తమ, మూర్ఛ, చర్మము, కీళ్ళు, నరములు, స్త్రీ, పిల్లల, లివర్ సంబంధిత దీర్ఘ వ్యాధులకు సంప్రదించండి.



డా॥ పి.యస్.వి.సత్యనారాయణ
Expert Physician
(ఎయిడ్స్ / కేన్సర్)

**డా॥ పి.యస్.వి.సత్యనారాయణ, గారిని ఎయిడ్స్ వైద్యం గురించి వైద్య ఆరోగ్య శాఖ న్యూఢిల్లీ వారి ప్రశంసలు.**

1. నేషనల్ ఎయిడ్స్ కంట్రోల్ ఆర్గనైజేషన్ (NACO) తేదీ: 13 /11/00 మీరు ఆరుగురు ఎయిడ్స్ పేషెంట్లకు వైద్యం చేసి నివారణ (CURE) చేసినందుకు మిమ్మల్ని అభినందిస్తున్నాము. మా సంస్థ మిమ్మల్ని ప్రోత్సహిస్తుంది. ఈ సహస్రాబ్దిలో ఎయిడ్స్ రోగుల (400 మంది) కోసం సల్పిన కృషి ఎంతో ప్రోత్సాహకరముగా ఉంది. ఆ నెగెటివ్ పేషెంట్ల వివరాలు 1) కుమార్ 21 సం॥ 2) కీరవాణి 1 1/2 సం॥ 3) శైలజ 20 సం॥ 4) రమణ 40 సం॥ 5) రవళి 18 సం॥ 6) వెంకట్ 21 సం॥పైన తెలిపిన వివరములతోపాటు 1275 మంది చికిత్స పొందిన వారి వివరములు కూడా తెలుసుకోవచ్చును.

2. ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ మెడికల్ రీసెర్చ్ (ICMR) తేదీ: 28-2-97 నిపుణుల కమిటీచే మీరు పంపిన ఫలితములు ఆమోదించబడి నిజనిర్ధారణ కొరకు నేషనల్ ఎయిడ్స్ రీసర్చ్ ఇనిస్టిట్యూట్ పూనేకు పంపడమైనది. వివరముల ఫలితం ఈ క్రింద పేర్కొనబడినది.

3. నేషనల్ ఎయిడ్స్ రీసెర్చ్ ఇనిస్టిట్యూట్ (NARI)28-9-01 ఈ తేదీన మీరు ఇచ్చుచున్న నాలుగు రకముల మందులు ఎక్కవ మోతాదులో కూడా ఏవిధమైన దుష్ప్రభావములు లేవు మరియు రక్తములో ఉన్న (HIV) వైరస్‌ను క్షీణింపచేయుచు ఇమ్యూనిటీని పెంపొందించు శక్తి కలిగియున్నది.

4. సెంట్రల్ కౌన్సిల్ ఫర్ రీసెర్చ్ ఇన్ ఆయుర్వేద అండ్ సిద్ధా (CCRAS) 29-05-02 ఈ తేదీన ఇప్పటివరకు మీరు దాదాపు 400 మంది HIV/ఎయిడ్స్ రోగులకు చికిత్స చేసారని రికార్డులు రుజువులు, నివేదికలు తెలుపుతున్నాయి. ప్రస్తుత కాలంలో పట్టిపీడిస్తున్న HIV/ఎయిడ్స్ అనే జటిల సమస్యను పరిష్కరించేందుకు శాస్త్రీయ పద్ధతులలో మీరు గణనీయంగా కృషి చేసారని కౌన్సిల్ అభిప్రాయం పడింది మరియు టాక్సీ సిటీ (TOXICITY) స్టాండర్డైజేషన్ & టెస్ట్‌లు చేయించుకొని గుడ్ మెడికల్ ప్రాక్టీసనర్ అనిపించుకోండి అని ప్రసంసించినారు. పై టెస్ట్‌లో (IICT) వారిచే చేయించబడిన వివరములు.

5. ఇండియన్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ కెమికల్ టెక్నాలజి (IICT) 11-07-05 ఈ తేదీన ఒక కేజీ బరువుగల వ్యక్తికి 2000 మిల్లీగ్రాములు (2గ్రాములు) ఇచ్చిననూ ఏ విధమైన దష్ఫలితములు లేవు అంటే 60 కేజీలు బరువుగల మనిషికి 2X60=200 గ్రాములు ఒక్కరోజు మోతాదులో ఇచ్చినను ఏ విధమైన (సైడ్ ఎఫెక్ట్స్) దుష్ఫలితములు లేవని నిర్ధారించబడినది. మేము 4 నెలలు (120 రోజులు) ఇచ్చు పూర్తి మందులకు సమానం.

**కోర్టు తీర్పు తేదీ 26-04-05 సి.సి.నెం.934 ఆఫ్ 2002 డా॥ పి.యస్.వి. సత్యనారాయణ క్వాలిఫైడ్ ఆయుర్వేదిక్ డాక్టర్.** మందుల తయారు చేయుటకు లైసెన్స్ ఉండుటవలన అమ్ముకోవచ్చు. పేషెంట్స్‌కు కూడా ఇవ్వవచ్చు అని కోర్టు నిర్ధారించినది.

గమనిక: యధార్ధ విషయాలు పట్టించుకోకుండా కొంత మంది అసూయ, అవినీతిపరులైన డాక్టర్లు మీడియాల యొక్క దుష్ప్రచారం నమ్మి మీ ఆరోగ్యం, మనసును పాడు చేసుకోకండి. ఏమాత్రం హృదయం ఉన్న వారెవరైనా మాకు ముందుగా తెలియపర్చి అధికార పూర్వకంగా వచ్చి సంప్రదించి రుజువులు చూసుకొని మాట్లాడమనండి.

జి.పి.ఇన్‌స్టిట్యూట్ (హాస్పిటల్)
ఆఫ్ ఆల్టర్‌నేటివ్ థెరపీస్ అండ్ రీసెర్చ్ సెంటర్
నెం. 1-8-499/6, శ్రీ వెంకటేశ్వరస్వామి గుడివీధి,
చిక్కడపల్లి, హైదరాబాద్-20
Ph: 66615411,27605827,
Cell: 98490 07228, 98493 96838



సాఫ్ట్‌వేర్ ఉద్యోగిని గిరిజ మైసూరు లాడ్జిలో హత్యకు గురయింది. తర్వాత ముక్కుపచ్చలారని బాలుడు పండు గోదావరిలో మునిగి చనిపోయాడు. ఈ సంఘటనల నుండి తేరుకోక మునుపే రోడ్డు ప్రమాదంలో యువకుడు రాంబాబు చనిపోతాడు. ఆ వంశంపైన అకాలమృత్యువు కన్నేసిందని, దుష్టశక్తుల వల్లనే అంతా జరుగుతోందని ఓ కోయదొర హెచ్చరిస్తాడు. దానిని ఛేదించాలని వేద పండితుడైన నారాయణ పూనుకుంటాడు. మరోవైపు తన అక్కను చంపినవారి అంతు చూడాలని గిరిజ చెల్లెలు శార్వాణి బయలుదేరుతుంది. ఇంతకీ ఈ మరణాల వెనుక ఉన్న అసలు కారణాలేమిటి?

అక్షరాక్షరంలో ఉత్కంఠ, ఉద్వేగాల్ని పెంచే శ్రీగంగ వెరైటీనవల **మృత్యురహస్యం** ఈ నెల చతుర కానుక!!

ఆకాశం వెలవెలబోతోంది. గాలి స్తంభించి పోయివుంది. గోదావరి ఒడ్డున కూర్చుని ఉన్న నారాయణ నుదుటిపై చెమట బిందువులు నువ్వుగింజల్లా మెరుస్తున్నాయి. కాకులు వచ్చి అక్కడ ఆకుల్లో పెట్టిన పదార్థాలను తింటున్నాయి. అవి 'కావు.. కావు' మంటూ మరిన్ని కాకులను పిలుస్తున్నాయి. కానీ నారాయణకు వాటి అరుపులు 'నీ ప్రాణాలు నీవి కావు కావు, తెలుసుకో' అని హెచ్చరిస్తున్నట్లు ఉన్నాయి.

బంధువుల్లో కొందరు నదిలోకి దిగి స్నానాలు చేస్తున్నారు. కొందరు నవ్వుతున్నారు. కొందరు గంభీరంగా ఉన్నారు. నారాయణ ఉదాసీనంగా ఉన్నాడు. మూర్తి చెయ్యెత్తి నారాయణను పిలుస్తున్నాడు, స్నానానికి రమ్మని. కాకులు వచ్చి ఆకుల్లోని పదార్థాలు ముట్టిన తర్వాత ఆ తంతు ముగుస్తుంది. ఇక స్నానాలు చేసి అక్కడ నుంచి బయలుదేరవచ్చు.

నదివైపు చూస్తున్న నారాయణకు మూర్తి పిలుపుగానీ, ఇతరులు చేసే గోలగానీ కొంచెం కూడా వినిపించటం లేదు. అతని మస్తిష్కంలో కాకుల 'కావు కావు' శబ్దాలే రింగుమంటున్నాయి.

తన మేనల్లుడు 'పండు' ఈ నదిలోనే సుడిలో పడి బయట పడలేక ఎంత ఆక్రోశించాడో... 'ప్రాణాలు కాపాడండి' అని గావు కేకలు పెట్టే ఉంటాడు... ఒంటరిగా వాడు మృత్యువు నోట చిక్కి విలవిలలాడే సమయంలో తామంతా ఉల్లాసంగా ఆ పక్కనే తమ ఇంట్లో ఉన్నారు. 'కావు'మని కాపాడే వారికోసం వాడు నోరు తెరిచినప్పుడల్లా ఈ నీరే వాడి గొంతుకి అడ్డం పడి, వాడి ప్రాణాలు మింగేసింది కదా..

గోదావరి అంటే నారాయణకు అందరి లాగే 'అమ్మ' అనే ఓ కమ్మని భావన. ఇప్పుడా సున్నిత భావం కలుషితమైంది.

గోదావరి మాత్రం అతని భావాలతో పనిలేనట్టు యథావిధిగా ప్రవహిస్తోంది.

తనకు ఇంత బాధ కలుగుతున్నా ఈ ప్రపంచం ఎప్పటిలాగే ఉంది. ఇంటా బయటా ఏమీ జరగనట్లు ప్రవర్తిస్తున్న జనం. మనిషి పోతే అతనికి సంబంధించిన ఆలోచనలు ఎన్ని గంటల్లో ప్రభావం కోల్పోతాయి అని ఎవరన్నా పరిశోధిస్తే వింత విషయాలు బయట పడతాయి.

బాధను తట్టుకోవడానికి భగవంతుడు మనిషి మస్తిష్కంలో ఏదో ఏర్పాటు చేసి ఉంటాడు. అందుకే తన అక్క కూడా కొంతలో కొంత కొడుకు పోయిన బాధను దిగమింగుకుంది. కాని తనెందుకలా ఉండలేకపోతున్నాడు. ఎందుకు ఏదో వెలితి, చేయగలిగినది చేయకుండా ఉన్నట్లు, ప్రమాదాన్ని అరికట్టే శక్తి ఉండికూడా నిర్లక్ష్యం చేసినట్లు, ఏదో అపరాధ భావన తనను నిలవనీయటం లేదెందుకని?

ఎడతెగని ఆలోచనలతో ఉన్న నారాయణను పిలిచి పిలిచి విసిగి పోయిన మూర్తి నదిలో నుంచి బయటకు వచ్చి చెయ్యి పట్టుకుని లేపాడు.

"నారాయణా, ఏమిటీ అలా కూర్చుంటే పోయినవాడు తిరిగొస్తాడా? అందరికీ చెప్పాల్సిన నువ్వే ఇలా ఉంటే ఎలా? నువ్వు చదవని శాస్త్రాలున్నాయా? నీకు తెలియని రహస్యాలు ఉన్నాయా? లే... లేచి స్నానం చేయి. మన 'పండు'కి పుణ్యలోకాలు లభించవద్దా? " అంటూ చనువుగా గద్దిస్తూ లేవదీసి మెట్లమీద నుంచి జాగ్రత్తగా నడిపిస్తూ తీసుకుని వెళ్లాడు.

నది దగ్గరకు రాగానే నారాయణ ప్రమేయం లేకుండానే అతని చేతులు నమస్కార ముద్ర దాల్చాయి. మనసు నదీ ప్రవేశంలో స్మరించాల్సిన మంత్రాలను స్వరదోషం లేకుండా పలికింది. ఒంగి నదిని భక్తి పూర్వకంగా స్పృశించి కాస్త

జలాన్ని తీసుకుని శిరసున జల్లుకుని నది లోకి ప్రవేశించాడు నారాయణ. ముక్కు మూసుకుని నదిలో మునకేస్తున్న అతని చేతిని గట్టిగా పట్టుకున్నాడు మూర్తి.

నదీ గర్భంలో నీరు నులివెచ్చగా ఉంది. మూడు మునకలు వేసి నదిలో నుంచి ఒడ్డున ఉన్న మెట్లవైపు నడవసాగాడు నారాయణ. పక్కనే మూర్తి అతని చేయి పట్టుకుని నడుస్తున్నాడు.

నారాయణ అక్క సుభద్రను మూర్తి అన్నకు ఇచ్చి వివాహం చేయకముందు నుంచే మూర్తికి, నారాయణకు మంచి స్నేహం. బంధుత్వం కూడా కలవడంతో వారిద్దరూ విడదీయలేని జంటగా మారిపో యారు. కొవ్వూరిలోని విశ్వేశ్వరశాస్త్రి వద్ద వారిద్దరూ ఏడేళ్లు వేదం నేర్చుకున్నారు. కృష్ణయజుర్వేదం నేర్పే గురువులు అరుదు. అందులో విశ్వేశ్వరశాస్త్రి ఉద్ధం డులు. వేదంతో పాటు ఉపనిషత్తులు, స్మార్తం, జ్యోతిష్యం కూడా అభ్యసించారు.

మూర్తి 'పండు'కి బాబాయి గనుక అతను శిఖ కూడా తొలిగించుకుని తల నున్నగా చేసుకున్నాడు. నారాయణ మాత్రం గుండు చేయించుకోలేదు.

నదినుంచి బయటకు నడిచివస్తున్న నారాయణ శిఖ ముడి వీడి భుజాలవరకు వేలాడుతోంది. జుట్టు కొసల నుంచి బొట్లుబొట్లుగా నీరు కారుతోంది. సన్నటి నడుము వెడల్పాటి భుజాలు, వైదిక కర్మలు నిరంతరం చేస్తున్న బ్రహ్మచారి గనుక కండలు తిరిగిన దేహంతో చూడ గానే ఆకట్టుకొనే రూపం అతనిది. కోటే రేసిన నాసిక, తీక్ష్ణమైన చిన్ని నేత్రాలు, విశాలమైన ఫాలభాగంతో ముఖం తేజోమ యంగా ఉంటుంది.

కళ్లల్లో గూడు కట్టుకున్న వేదన అతని ప్రతి కదలికలో స్పష్టమవుతోంది. ఎలాంటివాడు ఎలా అయిపోయాడు అను కున్నాడు మూర్తి.

'పండు'ని పొత్తిళ్లలో పసివాడిగా ఉన్న ప్పటి నుంచి నారాయణ ప్రేమగా సాకే వాడు. సుభద్ర అతనికి ఒక్కగానొక్క సోదరి. ఆమెపై ఉన్న ప్రేమాభిమానా లను ఆమెకు పుట్టిన పండుపై చూపించే వాడు. పండుకి బదులుగా సుభద్ర అమ్మా యిని కని ఉంటే తనే పెళ్లి చేసుకునేవా డేమో అనుకునేవారు బంధువులు.

'ఏమో, ఎవరు చూడొచ్చారు? కిందటి జన్మలో వాడు నారాయణకు పెళ్లావేమో అని హాస్యమాడేవారు చనువుకొద్దీ. దానికి తగ్గట్టే పండుకూడా పెరుగుతున్నకొద్దీ నారాయణను విడిచి ఉండేవాడు కాదు. ఆటలు పాటలన్నీ నారాయణతోనే.

అన్నప్రాసన రోజున పండుకి వెండి గిన్నెలో పరవాణ్ణం నారాయణే తినిపిం చాడు సంప్రదాయం ప్రకారం. నారాయణ చేతిని రెండు చేతులతో గట్టిగా పట్టుకుని పండు తన చిన్ని నోటికి తాకించుకుని ఎంత హాయిగా నవ్వాడో?

'చూడండర్రా నారాయణ పెళ్లాం ముద్దులు పెడుతోంది' అని మేలమాడారు అక్కడ చేరిన జనాలు.

చుట్టూ పెట్టిన వస్తువుల్లో రంగు రంగుల బొమ్మలు, పుస్తకాలు, పెన్నులు లాంటివెన్నో ఉన్నా, పండు ముందుకి వెళ్లి నట్టే వెళ్లి మళ్లీవచ్చి నారాయణ ఒళ్లోనే సెటిలైపోతే అంతా గొల్లుమని నవ్వారు.

తనకి ఎంతో ఇష్టమైన 'అచ్యుత' అనే పేరు నారాయణే పండుకి సెలెక్ట్ చేశాడు. విష్ణు సహస్ర నామాల్లో ఆ నామమంటే అతనికి చాలా ఇష్టం. 'జారనివాడు' అని అంతా అర్థం చెప్పినా, నారాయణ మాత్రం 'జారనివ్వనివాడు' అనే అర్థంలో ఆ నామాన్ని వాడుతాడు. ఏ జన్మలోని ఏ భయం అవశేషమో అతన్ని ఆ పేరు పండుకి ఉంచేలా చేసింది. 'జారనివ్వకూ

డదు' అనుకున్నాడు. కాని 'జారిపోయాడు'. ఆ మాట తలపుకి రాగానే మళ్లీ దుఃఖం గుండెల్లోంచి ఎగతన్నింది.

నడుస్తూ ఉన్నవాడు ఒక్కసారిగా మెట్లపై కూలబడి మొఖాన్ని చేతుల్లో దాచుకుంటూ 'అచ్యుతా' అంటూ బిగ్గరగా రోదించసాగాడు.

పండు తనను విడిచి దూరంగా వెళ్లిపోయాడనా, పండును తన చేజారిపోకుండా కాపాడని ఆ విష్ణువుని నిందిస్తూనా? !

శ్రీరామచంద్రమూర్తి గబగబా అక్కడికి వచ్చి నారాయణ పక్కనే కూర్చుని, అతని తల నిమురుతూ "ఊరుకో నారాయణా. మనకి అదృష్టం లేదు. మా పెదనాన్న కూతురు చూడు ఎంత దారుణమో? పాతికేళ్లు పెంచారు. కుందనాల బొమ్మ. అర్థాంతరంగా మట్టిపాలయింది. మన చేతుల్లో ఏమీలేదు నారాయణా! నీకు తెలియంది ఏముంది? లే, ఇంటికి పోదాం పద" అంటూ ఊరడించడానికి ప్రయత్నించాడు.

మనకి కలిగిన దుఃఖం లాంటిది మరో పదిమందికి కూడా కలిగింది అనేది మనిషికి ఊరట కలిగిస్తుందేమో! లేదా మన చేతుల్లో ఏమీ లేదు, మనం నిస్సహాయులం అనే స్ఫురణ బలపడి, ఆత్మీయుల మరణానికి మనమే కారణమేమో అనే అపరాధ భావన తొలిగి, కొంచెం ఉపశమనం కలుగుతుందేమో!

నారాయణ దుఃఖం కొంచెం నెమ్మదించింది. మూర్తి అతని భుజాలు పట్టి లేవదీశాడు. మాటిమాటికీ నారాయణ అలా కుమిలిపోతుంటే అతనికి బాధగా ఉంది. ఏదైనా స్థలమార్పిడి వలన ప్రయోజనం ఉంటుందేమో? పోనీ కాశీ వెళితే, మన శ్శాంతిగా ఉంటుందేమో అనుకున్నాడు.

★ ★ ★

గిరిజ సన్నగా, పొడవుగా ఉంటుంది. కలువ రేకుల్లాంటి కళ్లు, తుమ్మెద రెక్కల్లాంటి నల్లని కురులు రింగులు రింగులుగా నుదుటిపై వాలుతూ.. పద్మంలాంటి ఆమె ముఖాన్ని తుమ్మెదలు ఆశ్రయించి కీర్తిస్తున్నాయా అనిపిస్తుంది. అందానికి పోటీగా చదువులలో కూడా ఆమె రాణించింది. వాళ్ల కుటుంబంలో ఆడపిల్లలు ఉద్యోగం చేయటమనేది ఒక సంచలన వార్తే. ఆమెకు బెంగుళూరులో ఉద్యోగం వచ్చినప్పుడు ఆమెను పంపించడానికి తండ్రి సదాశివం ససేమిరా అన్నాడు.

గిరిజ తన నాయనమ్మ సపోర్టు తీసుకుని తండ్రిని ఒప్పించింది. సదాశివానికి తల్లి కనకమ్మ అంటే భయభక్తులు

## కొత్తగాలి...

**మా అమ్మ నిప్పు**
**మా ఆవిడ ఉప్పు**
**నేను నివురుగప్పిన నిప్పు**

– బలభద్రపాత్రుని ఉమామహేశ్వర శర్మ,
హైదరాబాద్

మెండు. అతను కడుపున పడిన రెండు నెలలకు కనకమహాలక్ష్మికి పసుపు కుంకుమలు చెల్లిపోయాయి. అన్ని కష్టాలను నిబ్బరంగా ఎదుర్కొని ఆమె సదాశివాన్ని కని పెంచింది. ఏ లోటూ రానీయలేదు. అందుకే సదాశివానికి కనకమ్మలోనే తల్లి తండ్రి ఇద్దరూ కనిపిస్తారు. తల్లి ప్రేమ, తండ్రి క్రమశిక్షణ రెండూ ఆమెలోనే.

ఆ తల్లిమాట తోసేయలేక, గిరిజ బెంగుళూరులో పనిచేయడానికి ఒప్పుకున్నాడు. తనే స్వయంగా వెళ్లి వర్కింగ్ విమెన్ హాస్టల్‌లో ఆమె స్నేహితురాళ్ళ దగ్గర

చేర్పించి, అన్నీ సౌకర్యంగా అమరాయని నమ్మకం చిక్కాక జాగ్రత్తలు మరీ మరీ చెప్పి హైదరాబాద్ వచ్చాడు.

ఇంటికొచ్చాక అతను కూతురి గురించి ఇంకా వాపోతుంటే, 'హైదరాబాద్‌లో పెరిగిన పిల్ల, బెంగుళూరులో ఏమీ ఇబ్బంది పడదులేరా' అని సదాశివాన్ని ఓదార్చింది తల్లి కనకమ్మ. పద్మావతి కొంగు అడ్డుపెట్టుకుని నవ్వుకుంది, భర్తని ఆ వయసులో కూడా చంటిపిల్లాడిలా జమ కట్టి అత్తగారు మాట్లాడుతూ ఉంటే.

సదాశివానికి గిరిజ ప్రథమ సంతానం కావడం వల్ల కాస్త ఎక్కువగానే ముద్దు చేశారు. దానికి తగ్గట్టే మగవాళ్లతో సమానంగా పెరిగింది. దేనికీ భయపడదు. గిరిజతో పాటూ శార్వాణి, లలిత, చంద్రం ఉన్నారు. వాళ్లంతా కూడా చదువులలో అక్కను మించిపోతారు.

సదాశివం పెంపకంలో పిల్లలకు పూర్తి స్వేచ్ఛ లభించింది. అయినా వాళ్లెవరూ తమ హద్దులు దాటలేదు. తండ్రికి తలవంపులు తెచ్చే పని ఏనాడూ చేయలేదు. తన పిల్లలు సహజంగా సంస్కారవంతులనీ, ధైర్యవంతులనీ సదాశివానికీ తెలుసు. గిరిజని బెంగుళూరు పంపించడానికి అది కూడా ఒక కారణం.

గిరిజ పనిచేసే సాఫ్ట్‌వేర్ కంపెనీకి యూరోపియన్ దేశాలలో క్లయింట్స్ ఉన్నారు. ఆ మధ్య ప్రపంచమంతా మాంద్యంలోకి నెట్టివేయబడినప్పుడు ఆ యూరోపియన్ క్లయింట్‌లు బాగా దెబ్బతిన్నారు. గిరిజ పనిచేసే కంపెనీకి ఆర్డర్లు తగ్గిపోయాయి. తమ ఖర్చులు తగ్గించుకోవడం కోసం ఉద్యోగుల జీతాలలో కోతలు విధించారు కంపెనీవాళ్లు.

గిరిజకి కూడా ఆ పరిస్థితి వచ్చింది. అయినా ఆమె సంపాదనపై ఆధారపడ్డ వాళ్లు ఎవరూ లేకపోవటం వల్ల ఆమెకు పెద్ద కష్టం ఏమీ కలగలేదు. కాని ఆమెకు ఇప్పుడు చేతినిండా పనిలేకపోవటం వలన ఖాళీ సమయం ఎక్కువైంది.

ఖాళీగా ఉండటం కంటే ఏదైనా కొత్త స్కిల్స్ నేర్చుకుందామని సాయంత్రాలు క్లాసులు చెప్పే ఒక ఇనిస్టిట్యూట్‌లో చేరింది గిరిజ. అక్కడే ఆమెకు ప్రశాంత్ పరిచయం అయ్యాడు.

ప్రశాంత్‌తో పరిచయం ఆమెను కొత్త లోకాలలో విహరింపచేసింది. ఆరడుగుల ఎత్తు, చక్కటి శరీర సౌష్టవంతో ఎవరినైనా ఆకట్టుకొనే ప్రశాంత్ స్వతహాగా సిగ్గరి. ప్రశాంత్ మంగుళూరుకి చెందినవాడు. నీరు తాగితే గొంతులో జాడ కనిపిస్తుందా అన్నట్లుండే సున్నితమైన చర్మం, అందమైన కళ్లు అతనిని ఒక ప్రత్యేకమైన మనిషిగా నిలబెడతాయి.

క్లాస్‌లో ప్రశాంత్ ఎక్కువ మాట్లాడే వాడు కాదు. అమ్మాయిలతో మాట్లాడని అబ్బాయిలంటే అమ్మాయిలకు ప్రత్యేక ఆకర్షణ. అతన్ని ఎలా అయినా మాట్లాడించాలని అంతా ప్రయత్నించేవారు. అతను వాళ్లను తప్పించుకు తిరుగుతుండేవాడు.

క్రాస్‌వర్డ్ పజిల్‌లో అన్ని గడులు నింపి ఒక ఆరు గళ్లున్న నిలువుని పూర్తి చేయలేకపోతే ఎంత తిక్కరేగుతుందో అంత తిక్క రేగేది అమ్మాయిలకు, ఆ ఆరడుగుల అందగాడిని చూస్తే.

ఆ క్లాస్‌లో ఉన్న పదిమందిలో నలుగురు అమ్మాయిలు. గిరిజకాక ఇద్దరు తమిళులు, ఒకరు కన్నడ. తనుతప్ప మిగిలిన ముగ్గురు ప్రశాంత్‌ని దార్లో పెట్టడానికి ప్రయత్నించి విఫలమయ్యారు. అయితే గిరిజకు అటువంటి పైత్యాలు లేకపోవటం వలన ఆమె ప్రశాంత్‌ని మాట్లాడించటం ఒక ఛాలెంజిలా తీసుకోలేదు.

అందుకే ఒకరోజు ప్రశాంత్ తనంతట తానే గిరిజను పలకరించినప్పుడు తక్కిన

ముగ్గురికీ ఆశ్చర్యం కలిగినా ఆమెకు మాత్రం అదేమి వింతగా అనిపించలేదు. అతనితో మామూలుగానే మాట్లాడింది. కాని అతను అలా వెళ్లగానే ఆ ముగ్గురు అమ్మాయిలు గిరిజను చుట్టుముట్టి "కంగ్రాట్స్, మేమెంత ట్రై చేసినా కానిదాన్ని నువ్వు సాధించి లక్కీ ఛాన్స్ కొట్టేసావు" అన్నారు. అది మాత్రం ఆమెకు వింతగా అనిపించింది.

"ఎందుకు? " అంది కాస్త అయోమయంగా, వారి మాటలు అర్ధమవక కొంత, అర్ధం అయిన మేర రుచించక కొంత. అతను మాట్లాడితే లక్కీ ఛాన్స్ ఏమిటి? అతనేమన్నా సెలబ్రిటీనా ఏమిటి? అందరిలాంటి మనిషేగా?

కాని మెల్లమెల్లగా ఆమె అతని పట్ల ఆకర్షితురాలయింది. ప్రశాంత్‌కు కూడా గిరిజ నచ్చింది. వాళ్ళిద్దరూ కలిసి సమయం గడపడం ఎక్కువైంది. గంటలు గంటలు సెల్‌ఫోన్లో కబుర్లు చెప్పుకునేవారు. హాస్టల్లోను, ఆఫీసులోను అందరికీ వాళ్ల ప్రేమ విషయం తెలిసిపోయింది.

ప్రశాంత్ తల్లిదండ్రులు బెంగుళూరులోనే వుంటారు. అతని తండ్రి కేంద్రీయ విద్యాలయ ప్రిన్సిపాల్. గిరిజతో తమ కొడుకు ప్రేమవ్యవహారం నడుపుతున్నట్లు వారికి తెలియదు. తెలిసినా పెద్దగా వారి నుంచి అభ్యంతరం ఉండేది కాదు.

★ ★ ★

మూర్తి బలవంతంమీద నారాయణ వారణాసికి ప్రయాణమవటానికి ఒప్పుకున్నాడు. లేదంటే రోజూ గోదావరి ఒడ్డున కూర్చుని అటే చూస్తూ ఏవేవో ఆలోచించుకుంటూ ఉండేవాడు.

గోదావరికి దగ్గరలోనే నారాయణవాళ్ల ఇల్లు. రెండు వీధుల అవతల శ్రీరామచంద్రమూర్తి ఇల్లు. నారాయణ తండ్రి పురుషోత్తమ శర్మ, తల్లి శారదాదేవి. నారా

యణ, సుభద్రలు ఇద్దరే వాళ్ల సంతానం. వాళ్ల ముత్తాతలెవరో నిర్మించిన శివాలయంలో అర్చకులూ వారే, ధర్మకర్తలూ వారే. కొవ్వూరులో పచ్చని పంటపొలాలు యాభై ఎకరాలు ఉన్నాయి. కడియంలో పాతిక ఎకరాల పండ్ల తోట కూడా ఉంది. దేనికీ లోటుండదు వారింట.

పండు రోజులో ఎక్కువ భాగం నారాయణతోనే గడిపేవాడు. అతను గుడిలో ఉంటే గుడిలో, ఇంట్లో ఉంటే ఇంట్లో, ఏదో మాట్లాడుతూ తోకలా వెంటే తిరిగేవాడు.

ఇంట్లో గడిపినా, గుడిలో గడిపినా పండు తన పక్కనే ఉన్నట్లు తనతో ఏదో చెప్తున్నట్లు అనిపించేది నారాయణకు. ఆ విషయం మూర్తికి చెబితే 'అంతా నీ భ్రమ. బాగా అలవాటయిపోయి అలా ఉంది. అందుకే కాశీవెళ్తే నువ్వు కుదుట పడతావని అనుకుంటున్నాను' అన్నాడు.

చివరికి మిత్రులిద్దరూ తమకు కావలసిన సామాన్లు తీసుకుని వారణాసికి బయలుదేరారు. అందరూ వీడ్కోలు ఇచ్చారు. స్టేషన్ వరకు వస్తానని బావ శ్రీరామచంద్రమూర్తి అంటే నారాయణ సున్నితంగా వారించాడు. తమ ప్రయాణం ఆర్భాటంగా మొదలుపెట్టడం అతనికిష్టం లేదు. ఆటో ఎక్కారు ఇద్దరూ. మూర్తి దారి పొడవునా ఏవో కబుర్లు చెప్తున్నాడు.

మూర్తి మాటలు అన్యమనస్కంగా వింటూ తన ఆలోచనల సుడిలో కొట్టుకుంటున్నాడు నారాయణ.

స్టేషన్ దగ్గర ఆటో దిగిన తర్వాత వాచ్ చూసి "ఇంకా గంట టైమ్ ఉంది నారాయణా" అన్నాడు మూర్తి.

నారాయణ పలకలేదు. స్టేషన్ దగ్గర రద్దీని చూస్తూ అక్కడ నిలబడిపోయాడు.

"పద ప్లాట్‌ఫారంపై పచార్లు చేద్దాం" అంటూ నారాయణ చేయి పట్టుకుని ముందుకి లాగాడు మూర్తి.

నాలుగడుగులు వేశారో లేదో నుదుటిపై గంధం మధ్యలో పెద్ద కుంకుమబొట్టు పెట్టుకుని, తలకి రంగురంగుల పాగా చుట్టుకున్న ఓ కోయదొర వారిని అడ్డగించాడు.

"కొండదేవర పలుకు, మీకు శాపం తగిలింది. మా తల్లి కొండదేవత, ఒక మాట మీకు చెప్పమంటోంది. ఆ చెట్టు దగ్గర కూర్చో దొరా" అన్నాడు.

"మాకే భవిష్యత్తు చెబుతావా? ఎలా కనబడుతున్నాం నీకు? " నవ్వుతూ అన్నాడు మూర్తి.

"అకాల మృత్యువు మీ ఇంటిపై కన్నేసింది. తల్లి మాట వినుకో దొరా. డబ్బు కోసం కాదు నీ వెంట పడింది. తల్లి మీకు మాట చెప్పమంది" అన్నాడాదొర మళ్ళీ గంభీరంగా.

ఆ గొంతు వినగానే నారాయణ ఒళ్లు ఒక్కసారిగా పులకరించింది. తను ఏదో దివ్యశక్తి సన్నిధిలో ఉన్నట్లు పసిగట్టాడు. మనసులోనే ఆ శక్తికి నమస్కరించి, మౌనంగా కోయదొర చూపించిన చెట్టు దగ్గరకు వెళ్లాడు. మూర్తికి ఆశ్చర్యం కలిగింది. నారాయణ ఎప్పుడూ ఇటువంటి సందర్భాలలో పదో పరకో ఇచ్చి వారిని సంతృప్తిపరచి వెళ్లేవాడుగాని ఎప్పుడూ వాళ్ళు చెప్పే మాటలు వినాలనుకోలేదు. దుఃఖం మనిషిని బలహీనపరుస్తుంది అనుకున్నాడు మనసులో. నిట్టూరుస్తూ తను కూడా మిత్రుణ్ణి అనుసరించాడు.

చెట్టు మొదలు చుట్టూ ఉన్న అరుగుపై బాసింపట్టు వేసుకుని కూర్చున్నాడు కోయదొర. ఎదురుగా నారాయణ కూర్చున్నాడు. మూర్తి పక్కన నిలబడ్డాడు.

"శాంతి లేదు. గ్రహాలు ఆగ్రహించాయి. ఎవరో చేసిన తప్పుకి మీకు శిక్ష పడింది. ఉజ్జయిని మహంకాళిని నమ్ముకో దొరా.. మీకు రక్ష ఇస్తాది. మీ ఇంట మృత్యువు

పసివాడిని కబళించింది. అది అకాలమృత్యువు" అన్నాడు.

"ఆ విషయం మాకు తెలుసు. చావెందుకు జరిగిందో చెప్పు" అన్నాడు మూర్తి అసహనంగా.

"చెప్పేవోడిని నేను కాదు దొరా. తల్లి మాట మీ చెవిన వేసినా. అర్ధమయ్యేవోరికి అర్ధమవుతుంది" అన్నాడు నవ్వుతూ.

అప్పుడు మొదటిసారిగా నోరు విప్పాడు నారాయణ. "తప్పు చేసినవాడికి దండన ఉండదా? " అన్నాడు.

"కర్మ ఫలం ఊరికే పోదు దొరా. కాలం కలిసివస్తే నీకే ఎరుకవుతుంది దొరా"

నారాయణ మౌనంగా నమస్కరించి లేచి మూర్తివైపు చూసాడు. ఆ చూపుకి అర్థం తెలిసిన మూర్తి కోయదొరకు డబ్బిచ్చి పంపాడు.

**2**



గిరిజ ప్రశాంత్‌ల పరిచయం బాగా గాఢమైంది. ప్రతిరోజూ ఎక్కడెక్కడికో తిరుగుతూ ఉండేవారు. కాని ఎప్పుడూ సిటీ దాటి వెళ్లేవారు కాదు. గిరిజ తమ స్నేహాన్ని హద్దులూ దాటనివ్వలేదు.

కాని ప్రశాంత్ ఎన్నోసార్లు అడుగుతుంటే కాదనలేక సిటీదాటి వెళ్లడానికి ఒప్పుకుంది. ఒక వీకెండ్‌కి ఇద్దరూ మైసూరు వెళ్లాలని ప్రశాంత్ ప్లాన్ చేసాడు. అతని కారులోనే ఇద్దరూ మైసూరు వెళ్లి ముందుగా బుక్ చేసుకున్న హోటల్‌లో దిగారు. రెండు గదులు విడివిడిగా బుక్ చేసాడని తెలిసి గిరిజకి ప్రశాంత్‌పైన గౌరవం మరింత పెరిగింది.

వాళ్లు దిగిన హోటల్, గనుల మాఫియాలో ముఖ్యుడైన ఎలగప్ప కొడుకు రుద్రప్పది. అదేరోజు రుద్రప్ప పుట్టిన రోజు. అతను తన హోటల్‌లో భారీ ఎత్తున పార్టీ ఇస్తున్నాడు.

గిరిజ, ప్రశాంత్‌లు సాయంత్రం చాముండేశ్వరి గుడికి వెళ్లివచ్చి భోజనం చేసి ఎవరి గదిలో వాళ్లు విశ్రాంతి తీసుకుందామనుకున్నారు.

రుద్రప్ప తన స్నేహితులను ఎంటర్‌టైన్ చేయడానికి ప్రొఫెషనల్ డాన్సర్‌లను పిలిపించాడు. రాత్రి పది దాటాక ఎక్కడెక్కడినుంచో రుద్రప్ప స్నేహితులు ఆ హోటల్‌కి రావడం మొదలుపెట్టారు. వాళ్ల గోలకు గిరిజకి నిద్రపట్టలేదు. ప్రశాంత్ గదికివెళ్ళి ఆ గోల గురించి మేనేజర్‌తో మాట్లాడమంది. అసలే బిడియస్తుడైన ప్రశాంత్ గొడవ ఎందుకు? మనమే సర్దుకుపోదాం, వదిలెయ్యమన్నాడు. గిరిజ వినలేదు. ప్రశాంత్‌పై కోపం తెచ్చుకుని తనే వెళ్ళి మాట్లాడతానంది. చేసేది లేక ప్రశాంత్ బయల్దేరాడు. గిరిజ కూడా అతని వెంట వెళ్ళింది.

రిసెప్షన్‌లో ఎవరూ లేరు. ఫోన్ పక్కన పెట్టేసి ఉంది. అప్పుడైనా రూముకి వెళ్ళిపోదామని సజెస్ట్ చేశాడు ప్రశాంత్. గిరిజ వినలేదు. చేసేది లేక పార్టీ జరుగుతున్న హాల్లోకి వెళ్ళి అక్కడ కనబడ్డ మొదటి వ్యక్తికి తమ ఇబ్బంది చెప్పాడు ప్రశాంత్. గిరిజ కూడా గట్టిగా మాట్లాడింది.

వాళ్ళు మాట్లాడుతోంది గనుల మాఫియా ముఖ్య సలహాదారైన లాయరు కేశవరెడ్డితో అని, అతనిది ఆ మాఫియా చేయించే మర్డర్లూ, మానభంగాలకు స్కెచ్

వేసే క్రిమినల్ బ్రైన్ అనీ వాళ్ళకు తెలియదు. కొంచెంసేపటికి ఆ గోల ఆపించేస్తానని, రూముకి వెళ్ళి హాయిగా పడుకోమని సర్దిచెప్పి పంపించాడు కేశవరెడ్డి.

తెల్లవారిన తరువాత గిరిజ రూముకి హౌస్‌కీపింగ్ సిబ్బందిలో ఒకడైన మల్లేశు వెళ్ళాడు. గది తలుపు సగం తెరిచి వుండే సరికి లోపలికి వెళ్ళాడు.

బెడ్ పక్కన గిరిజ శరీరం పడివుంది... ఆమె ఒంటిమీద బట్టలు అస్తవ్యస్తంగా వున్నాయి. మెడ కమిలిపోయి ఉంది.

బెడ్‌పైన సీలింగ్ ఫ్యాన్‌కి ప్రశాంత్ విగతజీవుడై గిరిజ చున్నీ గొంతుకి ఉరిలా బిగుసుకుని వుండగా వేళ్ళాడుతున్నాడు... అతని కాళ్ళు బెడ్‌కి తగులుతూ వున్నాయి.

అరుచుకుంటూ బయటకు పరిగెత్తాడు మల్లేశు. కొద్దిసేపటిలోనే పోలీసులు గదిని సీజ్ చేశారు. ప్రేమికుల శరీరాలను పోస్టుమార్టం కోసం పంపించారు.

గిరిజ మరణవార్త విని సదాశివం షాకయ్యాడు. అతని తమ్ముడు నరసింహం, తన మిత్రులతో కలిసి వెళ్ళి ఆమె మృతదేహాన్ని హైదరాబాద్ తీసుకుని వచ్చాడు.

★ ★ ★

వాళ్ళు ఎక్కాల్సిన రైలు వచ్చింది. కంపార్ట్‌మెంట్‌లో సీటు నెంబర్లు చూసి కూర్చున్నారు. సామాను బెర్త్ కింద సర్ది నారాయణ పక్కనే కూర్చున్నాడు మూర్తి. మాట్లాడాలించాలని చూసాడు కాని, తీవ్రమైన ఆలోచనల్లో ఉన్న నారాయణను డిస్టర్బ్ చేయడానికి సాహసించలేకపోయాడు. ట్రైన్ కదిలింది, వేగం పుంజుకుంది, గోదావరి బ్రిడ్జిపై పరిగెడుతోంది. ఇద్దరి మధ్య నిశ్శబ్దం.

నారాయణ గోదావరివైపు చూస్తూ అడిగాడు. "సదాశివం వాళ్ళమ్మాయి చనిపోయి ఎంతకాలం అయింది? "

హఠాత్తుగా నారాయణ ఆ విషయం అడిగేసరికి ఉలిక్కిపడ్డాడు మూర్తి. కాని వెంటనే తేరుకుని "రెండు నెలలు అయి వుంటుంది" అన్నాడు.

"వాళ్ళు శాంతి చేయించారా? " మరో ప్రశ్న సంధించాడు నారాయణ.

"ఆc, కాని అది శాంతి నక్షత్రం కాదు, పెదనాన్న నన్నే అడిగాడు, ఏమి చేయాల్రా అని. నీకు కూడా ఆ వివరాలు చెప్పాను. ఆమె చనిపోయింది శాంతి నక్షత్రంలో కాకపోయినా, చనిపోయిన పద్ధతికి శాంతి చేయటం మంచిదని నువ్వు చెప్తే అదే చెప్పాను" అన్నాడు మూర్తి.

"శాంతి చేశారో లేదో కనుక్కో... ఇప్పుడే"

సీటుపై పద్మాసనంలో కూర్చుని కళ్ళు మూసుకున్నాడు నారాయణ.

అతనివైపు అయోమయంగా చూసి, తన మొబైల్ తీసాడు మూర్తి.

సదాశివం ఫోన్ రింగవుతోంది.

"హలో, పెదనాన్నా, నేను మూర్తిని" అన్నాడు.

అవతల నుంచి అతన్ని గుర్తుపట్టిన సదాశివం "ఏరా, అంతా క్షేమమేనా? " అన్నాడు.

"క్షేమమే గాని, నాకు ముందు ఈ విషయం చెప్పు, అక్కయ్య పోయిన తర్వాత శాంతి చేయించావా? "

"ఏదిరా.. ఉదక శాంతి చేయించమని నారాయణ చెప్పాడన్నావు. కాని ఇక్కడ మా పెదమావగారు, ఏమీ అక్కరలేదు అంటే పుణ్యాహవచనం మాత్రం చేయించా. ఇంతకూ ఏమిటి సంగతి? విషయం పూర్తిగా చెప్పరా, సగం సగం చెబితే ఎలా అర్థమవుతుందీ" అన్నాడు సదాశివం.

"ఏమీ లేదులే పెదనాన్నా. ఏమైనా ఉంటే నే చెబుతాగా. నువ్వేమీ కంగారుపడకు. నేను ఉంటా" అని ఆయన ఏదో

# హైదరాబాద్‌లో మోక్షగుండం

అప్పటి నిజం

**1908** సెప్టెంబర్ 28న మూసీ నదికి భారీ వరదలు వచ్చి, హైదరాబాదు నగరాన్ని ముంచెత్తాయి. నిజాం ప్రభుత్వం హైదరాబాదుకు వరద తాకిడినుంచి రక్షణ కల్పించి, అధునాతన అండర్‌గ్రౌండ్ డ్రైనేజి వ్యవస్థలను ఏర్పరచడానికి మోక్షగుండం విశ్వేశ్వరయ్యను హైదరాబాదు ప్రభుత్వానికి స్పెషల్ కన్సల్టింగ్ ఇంజనీరుగా నియమించ దలచింది. అప్పటికి ఆయన ముంబై ప్రభుత్వం కింద ఉద్యోగానికి రాజీనామా చేసి యూరోపు, అమెరికాలలో విజ్ఞానయాత్రలో ఉన్నాడు. ఇటలీలో పర్యటిస్తుండగా లండన్‌లోని ఇండియా ఆఫీస్ నుంచి కేబుల్ వచ్చింది. హైదరాబాదుకు వరద రక్షణ వ్యవస్థ, అధునాతన మురుగు కాలువల నిర్మాణ పథకమును తయారుచేసే స్పెషల్ కన్సల్టింగ్ ఇంజనీరుగా పనిచేయమని అందులో వుంది. ఈ కేబుల్‌కు సమాధానం రాసి పంపాడాయన. అందులో తన పర్యటన పూర్తి అయ్యేవరకూ తను ఏ ఉద్యోగంలోనూ చేరనన్నాడు. అందుచేత వేరొక ఇంజనీరును నియమించుకొనవచ్చుని తెలిపాడు. ఆపై ఉద్యోగంలోకి చేరబోయే తనే కావలెనంటే ప్రభుత్వానికి కొన్ని షరతులు పెడతానన్నాడు. తనకు సంపూర్ణాధికారమూ, హైదరాబాదు చీఫ్‌ఇంజనీరుతో సమాన జీతమూ, తన అధికారగణాన్ని తనే ఎంపిక చేసుకొనే స్వాతంత్ర్యమూ ఉండాలన్నాడు. హైదరాబాదు నిజాం ఈ అన్ని షరతులను ఒప్పుకొన్నాడు.



విశ్వేశ్వరయ్య 1909 ఏప్రిల్ నాటికి అమెరికా, కెనడా, ఇతర దేశాల యాత్ర పూర్తిచేసుకొని స్వదేశానికి తిరిగి వచ్చాడు. రాగానే హైదరాబాదు సంస్థానంలో స్పెషల్ ఇంజనీరుగా చేరాడు. అంతటా సర్వే చేసి పరిస్థితిని ఆకళింపు చేసుకొన్నాడు. ముంబైలో తన దగ్గర పనిచేసి నమ్మకం సంపాదించుకొన్న ఇంజనీర్లను పిలిపించుకున్నాడు. వారి సహకారంతో మూసీ, ఈసీ నదుల వరదలను అరికట్టే పథకాల గురించి నివేదికలు తయారుచేసాడు. దానికితోడు హైదరాబాదు నగరానికి మెరుగులు దిద్దేందుకు మరో పథకం సిద్ధం చేసాడు. 1909 ఏప్రిల్ నుంచి అక్టోబర్ వరకు, ఏడు మాసాలు అతను ఈ పని మీద ఉన్నాడు. ఆయన చలవవల్ల హైదరాబాదు, సికిందరాబాదులు అందమైన నగరాలుగా పరివర్తన చెందాయి. రోడ్లు, ఉద్యానవనాలు, మురుగు కాలువలు, విద్యుచ్ఛక్తి తదితర అన్ని విషయాలలో ఆయన తయారుచేసిన ప్రణాళికలు సూపరింటెండింగ్ ఇంజనీరు సి.టి.దలాల్ పర్యవేక్షణలో చక్కగా అమలయ్యాయి. మొదట్లో విశ్వేశ్వరయ్యంటే బిగుసుకు కూర్చున్న హైదరాబాదు చీఫ్ ఇంజనీరు మెకెంజీ దొర, ఆఖరున ఈ జంటనగరాల పునర్నిర్మాణపు కీర్తి పూర్తిగా విశ్వేశ్వరయ్యకే చెందవలసిందని కితాబు ఇచ్చాడు.

మాట్లాడుతున్నా విన్పించుకోకుండా మనసులో మాత్రం "పెదనాన్నా కొంపముంచావు కదా" అనుకున్నాడు.

కనులు తెరిచి మూర్తివైపు చూస్తున్నాడు నారాయణ. అతని చూపులో ప్రశ్నలు లేవు, ఆందోళనలు లేవు, కోపం లేదు, బాధ లేదు, కాని అతని చూపు తాకి మూర్తికి గుండె ఝుల్లుమంది.

"వాళ్ళు శాంతి చేయించలేదు నారాయణా.. ఇప్పుడేం చెయ్యాలి? " ఆందోళనగా అడిగాడు మూర్తి. పెదనాన్న పేల్చిన బాంబు కంటే నారాయణ నిర్లిప్తత అతన్ని ఎక్కువ భయాందోళనలకు గురిచేసింది.

"మూర్తీ, ఈ ట్రైన్ ఉజ్జయిని వెళ్తుందేమో కనుక్కో" ఏదో నిశ్చయానికి వచ్చినట్లు అన్నాడు నారాయణ.

'ఇదంతా ఆ కోయదొర పనే. తిన్నగా కాశీ వెళ్ళి ఆ విశ్వేశ్వరుణ్ణి దర్శించుకుంటే అంతా శుభంగా ఉండేది' మనసులో తిట్టుకుంటూ లేచాడు మూర్తి. నారాయణ బాగా ఆలోచించిగాని ఒక నిర్ణయానికి రాడు. వచ్చేకమరి మార్చుకోడు. 'ముందు కాశీకి వెళ్దాం, తరువాత ఉజ్జయిని సంగతి చూసుకుందాం' అని నారాయణకు చెప్పి ప్రయోజనం లేదని అతనికి తెలుసు.

★ ★ ★

ఉజ్జయినిలో నారాయణ, మూర్తి దిగేటప్పటికి తెల్లవారుతూ ఉంది. అక్కడికి ఎందుకు వచ్చారో తెలియదు. ఎవరిని కలవాలో అంతకన్నా తెలియదు. వాళ్ళకు తెలిసింది ఒకటే ఒకటి. ఉజ్జయిని మహాకాళేశ్వరుణ్ణి దర్శించుకోవటం, తర్వాత ఉజ్జయిని మహాకాళిని దర్శించటం. అటుపై ఏమి జరగనుందో ఇద్దర్లో ఎవరికీ తెలీదు.

రాజమండ్రిలో వాళ్ళెక్కిన ట్రైన్ విజయవాడలో మారి భోపాల్ వెళ్ళి అక్కడ నుంచి ఉజ్జయిని వచ్చారు. ప్రయాణంలో కలిసిన తెలుగువాళ్ళు ఇచ్చిన సమాచారం ప్రకారం ఆంధ్ర భోజనం దొరికేచోటు వివరాలు, అక్కడ చూడవలసిన స్థల విశేషాలు తెలుసుకున్నాడు మూర్తి.

శాస్త్ర విషయాలలో అద్భుత ప్రజ్ఞ ఉన్న నారాయణ లౌకిక విషయాల దగ్గరకొస్తే పసివాడితో సమానం. అందుకే మూర్తి వచ్చీరాని హిందీ మాట్లాడి ఆంధ్రావాళ్ళు ఉండటానికి అనువైన వసతి వివరాలు కనుక్కున్నాడు. రిక్షాని పిలిచి సామాను అందులో పెట్టి మిత్రుడితో పాటు ఎక్కి కూర్చున్నాడు.

మట్టిలో ఆడుకుంటున్న పసివాడిలా ఉంది ఉజ్జయిని. రోడ్డుపై దుమ్ము లేస్తోంది. తీరుబడిగా రోడ్డుపై విశ్రాంతి తీసుకుంటున్న ఆవులు, అప్పుడప్పుడే తమ దుకాణాల ముందు కసువు ఊడ్చి రోడ్డు మధ్యకు నెట్టేసి ప్లాస్టిక్ సీసాలో నీళ్ళు కళ్ళాపి జల్లుతున్న పనివాళ్ళు, అక్కడక్కడా స్కూలు యూనిఫాం వేసుకుని సైకిల్ తొక్కుకుంటూ వెళ్తున్న పిల్లలతో ఉజ్జయిని పుణ్యక్షేత్రం మెల్లమెల్లగా మేల్కొంటోంది.

ఊరికి కొత్తవాళ్ళయినా గాని ఏమి మోసం చేయకుండా, తిన్నగా ఆంధ్రా భోజనం దొరికే వసతి గృహానికి తీసుకుని పోయాడు రిక్షావాడు. మన ప్రాంతంలో ఆటో వచ్చిన తరువాత క్రమేపీ మనం మరిచిపోతూ ఉన్న 'రిక్షా' అనేమాట ఉజ్జయినిలో ఆటోతో సహజీవనం చేస్తూ మనుగడ కొనసాగించడం కాస్త వింతగా, కాస్త ముచ్చటగా అనిపించింది మూర్తికి.

ఆ విషయం ప్రస్తావిస్తూ నారాయణతో అన్నాడు "కాలగతిలో మార్పు సహజం. ఆ మార్పుతోపాటు మారుతూనే, స్వంత తత్వాన్ని కూడ నిలబెట్టుకోవడం నిజంగా ఒక కళే కదా! అందులోనూ ఈ విషయం కాలాతీతుడైన మహాకాళేశ్వరుడు వెలిసిన క్షేత్రంలో ఇలా మనసుకు స్ఫురించడం విశేషంగా లేదూ"

చిన్నగా నవ్వుతూ "నీ వ్యాఖ్యానం అర్థవంతంగా ఉంది" అన్నాడు నారాయణ.

'రంగారావు ఆంధ్రా భోజనశాల'కి అయిదు పది నిముషాలలో చేరుకున్నారు. రిక్షావాడికి డబ్బులిచ్చి సామాను దింపుకున్నారు. రిక్షావాడే లోపల్నుంచి ఒక వాచ్‌మాన్‌ని పిలిచి 'ఆంధ్రాలోగ్' అని పరిచయం చేసి వెళ్ళిపోయాడు. వాళ్ళ సామాను వరండా లోపల పెట్టి అక్కడ ఫైబర్ కుర్చీలలో కూర్చోమని చెప్పి యజమానిని పిలవడానికి వెళ్ళాడు వాచ్‌మాన్.

రిసెప్షన్ గది చాలా మామూలుగా ఉంది. ఒక పక్కన టేబుల్, దాని వెనక కుర్చీ, కుర్చీ వెనక గోడపై మహాకాళి ఫొటో, ఇంకొక పక్కన పాత సోఫా, మరో కవైపు ఫైబర్ కుర్చీలు, ఒక చిన్న టీపాయ్, దానిపైన పాత పేపర్లు ఉన్నాయి. చుట్టూ చూస్తున్నాడు మూర్తి పరిశీలనగా. లోపల ఒకవైపు యజమాని ఇల్లు మరొకవైపు భోజనశాల, మేడమీద అతిథుల కోసం గదులు ఉన్నాయని ఊహించాడు.

నారాయణ కుర్చీలో కూర్చుని మహాకాళి ఫొటోచూస్తూ ఏదో ఆలోచనలో ఉన్నాడు. గోడమీద ఒక ముసలాయన ఫొటో కూడా ఉంది. దానికింద 'పెద్దింటి రంగారావు' అని రాసి ఉంది. కింద ఏవో అంకెలు కూడా ఉన్నాయి. అతని వివరాలేమో!

ఇంతలో లోపలి నుంచి ఒక ఎత్తైన మనిషిని వెంటబెట్టుకుని వచ్చాడు వాచ్‌మాన్. "తెలుగు వాళ్ళా?" అన్నాడు అతను వారిని చూడగానే.

అవునన్నాడు మూర్తి.

టేబుల్ దగ్గరకు వెళ్ళి రిజిష్టరు తెరిచి అందులో వివరాలు రాయమన్నాడు. మూర్తి రాసి సంతకం పెట్టాక ఆ వివరాలు చదువుకుని "రాజమండ్రి నుంచి వచ్చారా?" అని ఆప్తమిత్రుల్ని కలుసుకున్నంత సంతోషంగా అడిగాడు. మళ్ళీ అవునన్నాడు మూర్తి. "సరే, మీరు గదికి వెళ్ళి తయారయి రండి. మాట్లాడుకుందాం" అన్నాడు సూర్యం అనే ఆ యజమాని. వాచ్‌మాన్ సామాను తీసుకుని మేడపైకి వెళ్లాడు. మిత్రులిద్దరూ వెంట వెళ్ళారు.

★ ★ ★

సూర్యం ఉజ్జయిని వచ్చి ఇరవై అయిదేళ్ళు అవుతోంది.

ఇల్లు వదిలి దేశాటనం చేసి ఏదైనా మంత్రోపదేశం పొందుదామనుకున్నాడు. అందుకే పదమూడో ఏట మేనమామ ఇంటినుంచి చెప్పా పెట్టకుండా బయలుదేరాడు. తల్లి, తండ్రి అయిదో ఏట యాక్సిడెంట్‌లో ఒక్కసారే చనిపోతే మేనమామ చేరదీశాడు. బాగానే చూసుకునేవాడు. కాకపోతే ఒకటే ఇబ్బంది.. 'చదవరా, చదివితే బాగుపడతావు' అని పోరు పెట్టేవాడు. ఆ పోరు భరించలేక దేశాలు పట్టేడు సూర్యం. గోదావరి పుష్కరాలకు రాజమండ్రి వచ్చిన కొందరు సాధువులతో సావాసం చేసాడు. వాళ్ళ తిరుగు ప్రయాణంలో వారితో రైలెక్కాడు.

ఆ సాధువులు ఎటు తిరిగితే అటు తిరిగి చివరకు ఉజ్జయినీ చేరాడు. ఎంత తిరిగినా మంత్రోపదేశం మాటే లేదు. వాళ్ళకు అన్ని పనులు చేసిపెడితే తమతో పాటు ఉంచుకుని తినడానికి ఏదన్నా పెట్టేవాళ్ళు. మంత్రోపదేశం చేయమని సతాయిస్తే చివరకు ఒక ముసలి సాధువు కనికరించాడు. ఉదయాన్నే 'క్షిప్ర' నదిలో స్నానం చేసి శుచిగా రమ్మన్నాడు.

ఉదయాన్నే ఉత్సాహంగా తయారై నదికివెళ్ళి స్నానాదికాలు ముగించి ముసలి సాధువు దగ్గరికి భయభక్తులతో వెళ్ళాడు. సూర్యాన్ని చూసి ఆయన మురిసిపోయాడు. ప్రేమతో దగ్గరకు పిలిచి పద్మాసనంలో కూర్చోమని చెప్పి చెవిలో తారక

# హాలీవుడ్ ఛాన్సా.. పాప సంతోషమా!



వాషింగ్టన్‌లోని రెస్టారెంట్‌లో వెయిట్రెస్ అయిన మార్సియా గే హార్డెన్ లక్ష్యం హాలీవుడ్ నటి కావాలని. ఆమె స్క్రీన్ యాక్టర్స్ గిల్డ్ యూనియన్ కార్డుకి అప్లై చేసింది. అది వచ్చాక నటిగా సినిమాల్లోకి వెళ్ళాలనుకుంది. ఈలోగా నాటకాల్లో నటించసాగింది. అలా ఓసారి 'అండ్ దే డాన్స్ రియల్ స్లో ఇన్ జాక్సన్' నాటకంలో నటించింది.

'బార్న్ ఆన్ ది ఫోర్త్ ఆఫ్ జులై' చిత్రానికి నటీనటుల ఎంపిక కోసం హాలీవుడ్ డైరెక్టర్ ఆలివర్ స్టోన్ వాషింగ్టన్‌కి వస్తున్నాడని తెలిసింది. బయోడేటాని తన ఏజెంట్ ద్వారా పంపించింది.

మర్నాడే రెస్టారెంట్‌లో పనిచేస్తుంటే ఆమెను 'రియల్ స్లో ఇన్ జాక్సన్' నాటకంలో చూసిన ఇద్దరు యువతులు ఓ పాత్రలో నటించమని అడిగేందుకు వచ్చారు.



"మేము 'మేక్-ఏ-విష్' ఫౌండేషన్ నుంచి వచ్చాం. కేన్సర్‌తో ఏడేళ్ళ పాప బోనీ హాస్పిటల్‌లో ఉంది. అయిదారు రోజులు మించి బతకదు. ఆమె ఫేవరెట్ సినిమా స్నో వైట్. బోనీకి స్నో వైట్‌ని చూడాలని వుంది పిల్లల ఆఖరి కోరికని తీర్చడం మా ఫౌండేషన్ లక్ష్యం. కనుక మీరు ఆ వేషం వేసి ఆమెను సంతోషపెట్టాలి "అన్నారు వాళ్ళు.

"ఓకే మీరెప్పుడంటే అప్పుడే నేను సిద్ధం" అంది మార్సియా మానవతాదృక్పథంతో.

రెండు రోజుల తర్వాత వారు ఫోన్‌చేసి హాస్పిటల్‌లో బోనీని మర్నాడు కలుసుకొమ్మని చెప్పారు. మార్సియా సరేనంది. అరగంట తర్వాత ఆమెకి తన ఏజెంట్ ఫోన్‌చేసి హాలీవుడ్ డైరెక్టర్‌ని కలిసేందుకు కూడా అదే తేదీ, అదే సమయం ఫిక్స్ అయిందన్నాడు.

ఆరోజు కాకుండా ఇంకో రోజుకి అపాయింట్‌మెంట్‌ను మార్చమని అభ్యర్థించింది మార్సియా. నిరాకరించాడు ఏజెంట్.

తర్వాత ఆ ఫౌండేషన్‌కి ఫోన్‌చేసి ఇంకో రోజు వస్తానని చెప్పింది మార్సియా.

"ఇంకోరోజు ఆలస్యం చేస్తే బోనీ చనిపోతుందేమో! రేపే రండి" చెప్పిందామె.

"మార్సియా! ఇదో గొప్ప ఛాన్స్. రమ్మన్నప్పుడల్లారాదు వదులుకోకు" చెప్పాడు ఏజెంట్ మరోసారి ఫోన్‌చేసి.

ఆ రాత్రి మార్సియాకి నిద్ర పట్టనేలేదు. ఆ ఉదయమే స్నో వైట్ అపాయింట్‌మెంట్ రద్దు చేయాలనుకుంది. కాని ఆమె మనసు ఒప్పుకోలేదు. మరో ఆలోచనకు తావివ్వకుండా స్నోవైట్ కాస్ట్యూమ్‌ని తెచ్చుకుని ఆ సినిమా చూసింది. అందులోని సెవెన్ డ్వార్ఫ్స్ పాత్రల పేర్లని మననం చేసుకుంది. స్నో వైట్‌లా తయారై హాస్పిటల్‌కి చేరుకుంది. కేన్సర్ రోగి బోనీ కార్పెట్ మీద బోర్లా పడుకుని బొమ్మలతో ఆడుకుంటోంది. ఏడేళ్ళ ఆమె చిక్కిపోయి నాలుగేళ్ళ పిల్లలా ఉంది. తలెత్తి మార్సియాని చూడగానే ఆ పాప కళ్ళు విప్పారాయి. "నువ్వు స్నో వైట్‌వా? " అడిగింది కుతూహలంగా.

"అవును. నీకోసమే వచ్చా"

తన వెంట తెచ్చిన బహుమతులు ఇచ్చి మధ్యాహ్నందాకా ఆ పాపతో ఆడి పాడింది. ఎంతో సంతోషపడిన బోనీ ఆ రాత్రే మరణించింది.

నటన అంటే జనంతో సత్సంబంధం కలిగి ఉండటమేతప్ప యూనియన్ కార్డులు, గొప్ప అవకాశాలు కావనేది బోనీవల్ల మార్సియా అర్థం చేసుకుంది.

తర్వాత మార్సియా రెండేళ్లపాటు నటనని అధ్యయనం చేస్తూ, వెయిట్రెస్‌గా పని చేసింది. దర్శకులు జోయెల్, ఇథాన్ కోన్ 'మిల్లర్స్ క్రాసింగ్' సినిమాలో ఆమెకు ఓ పాత్ర ఇచ్చారు. 2001లో 'పోలక్' చిత్రంలోని నటనకు ఆమెకు అకాడమీ అవార్డ్ లభించింది.

మంత్రం ఉపదేశించాడు.

మంత్రం చెవిన పడ్డాక సూర్యం మొఖం తేజోవంతమవుతుందనుకున్న సాధువుకి వెలవెలబోతున్న సూర్యం మొఖం ఆశ్చర్యాన్ని కలిగించింది. చిన్న వయసులోనే సూర్యానికి ఆధ్యాత్మిక దృష్టి ఉందనుకున్నాడాయన. మంత్రం నేర్చుకుంటే ఏదో మానవాతీత శక్తి వస్తుంది, తిని కూర్చుని హాయిగా కాలక్షేపం చేయవచ్చు అని ఆశ పడ్డాడు సూర్యం.

అప్పటికీ ఆశ చావక, "తారక మంత్రం పఠిస్తే ఏమొస్తుంది? " అని అడిగాడు గురువుగారిని.

"ఈ తుచ్ఛ మానవ జన్మ తర్వాత మోక్షం" అన్నాడు ముసలి సాధువు.

ఆయనను నానా మాటలు అని "నాకు ఏదైనా శక్తిని ఇచ్చే మంత్రం చెప్తావా, ఛస్తావా" అని పట్టుపట్టాడు సూర్యం.

చేసేది లేక అతనికి పోయిన వస్తువుల ఆచూకీ తెలుసుకునే మంత్రం నేర్పించి, "నీ చేతుల మీదుగా నిత్యం పదిమందికి అన్నదానం జరిగేలా చూసుకో. లేదంటే భ్రష్టు పట్టిపోతావు" అని చెప్పి హరిద్వార్‌కి వెళ్ళిపోయాడాయన.

మంత్రం సిద్ధించాక సూర్యం కొంతకాలం సంతోషంగానే ఉన్నాడు. కాని జనాలకు సాయపడి డబ్బు సంపాదన మొదలుపెట్టాక ఏవో పీడకలలు రావటం మొదలయింది. రానురాను కళ్ళు మూసుకుని నిద్రపోవాలంటే భయపడే పరిస్థితికి వచ్చేడు. పదిమందిలో కూర్చోలేకపోయేవాడు. తలలో హోరుమని శబ్దం... చెవులలో వికృత శబ్దాలు.. అతన్ని నిలవనిచ్చేవి కావు

అప్పుడు గుర్తుకి వచ్చింది, ముసలి సాధువు ఇచ్చిన సలహా. ఏదైనా పూట కూళ్ల ఇల్లు దొరికితే అక్కడ ఆశ్రయం సంపాదించి ఒకరిద్దరికన్నా అన్నదానం చేద్దామనుకున్నాడు. ఆ ప్రయత్నంలో అతనికి రంగారావు భోజనశాల కనబడింది. మహాకాళి మందిరానికి దగ్గరలోనే చిన్ని సందులో ఉంది అది. అక్కడకు వెళ్ళి ఏదైనా పని ఇప్పించమన్నాడు సూర్యం.

అదే సమయంలో అక్కడ భోజనం చేసిన యాత్రికుడు ఒకడు తనకిచ్చిన వసతి గదిలో తన డబ్బు సంచీ కనిపించటంలేదని, అది అక్కడి పనివాళ్ళే తీసి ఉంటారని గొడవ పడుతున్నాడు. పనివాళ్ళను పిలిచి పంచాయితీ చేస్తున్నాడు రంగారావు. డబ్బు పోగొట్టుకున్న యాత్రికుడికి వత్తాసు పలుకుతూ హడావుడి చేస్తున్నాడు మరొక యాత్రికుడు. అతను మొదటి యాత్రికుడికి ఆ వసతి గృహంలో పరిచయం అయ్యాడు. పనివాళ్ళు 'రామ రామ మాకు ఆ డబ్బు విషయం తెలియదు' అని వాపోతున్నారు. పోలీసులను పిలిస్తే వాళ్ళే నిజం చెప్పిస్తారని రెండో యాత్రికుడు రంగారావుని ఒత్తిడి చేస్తున్నాడు. పోలీసులు వస్తే తన వ్యాపారం దెబ్బతింటుందని రంగారావు సందేహిస్తున్నాడు.

అటువంటి సమయంలో సూర్యం అక్కడికి వెళ్ళాడు. జరుగుతున్న గొడవ త్వరగానే అర్థమయింది. యజమాని తెలుగువాడు. తను సాయంచేస్తే తనకు ఆశ్రయమిస్తాడు. తన సమస్య కూడా తీరుతుందనే ఆలోచనతో "అయ్యా, మీరు సరేనంటే, పోయిన సొమ్ము ఎక్కడ ఉందో ఆచూకి చెప్తాను. ఎవరు తీసారో మీరే నిర్ణయించుకోండి" అన్నాడు.

రంగారావు సమాధానం చెప్పేలోపే, డబ్బు పోగొట్టుకున్న వ్యక్తి "బాబ్బాబు, ఆ పని చేసిపెట్టు. నీకు మంచి బహుమానం ఇస్తాను. ఆ డబ్బు దొరకకపోతే మా ఊరెలా వెళ్ళగలను" అన్నాడు దీనంగా. అతను ప్రాధేయపడుతున్నా సూర్యం

మాత్రం రంగారావు వైపే చూస్తూ నించున్నాడు. రంగారావుకి ఆ వినయం బాగా నచ్చింది. అంత మందిలో, బహుమానానికి కూడా ఆశ పడకుండా, తన మాటకు విలువ ఇస్తున్న సూర్యం అంటే అభిమానం కలిగింది.

"సరే, ప్రయత్నించు" అన్నాడు.

గురువుని తలుచుకుని మంత్రం పఠించి ఉపాసన దేవతను మనసులోనే పోయిన డబ్బు ఆచూకి అడిగాడు. తర్వాత "నాతో రండి" అని రంగారావుని పిలుచుకుని వసతి గృహంలోని ఒక గదిలోకి తీసుకువెళ్ళాడు. సూర్యం అందరినీ ఆ గదిలోకి తీసుకుని వెళ్తుంటే రెండో యాత్రికుడు వెనకకు తిరిగి పారిపోబోయాడు.

అటువంటిది ఏదో జరుగుతుందని ముందుగానే ఊహించి సిద్ధంగా ఉన్న పనివాళ్ళు అతన్ని పోనీయకుండా అడ్డుకున్నారు. గదిలోకి వెళ్ళి డబ్బు దాచినచోటు చూపించాడు సూర్యం. అక్కడ ఉన్నవాళ్ళంతా ఆ విడ్డూరాన్ని చూసి ఆశ్చర్యపోయారు. రెండో యాత్రికుడి పక్కబట్టల్లో నేర్పుగా దాచి ఉంది ఆ డబ్బు. రంగారావు రెండో యాత్రికుడిని నిలదీసాడు "నా సత్రంలో ఇంతవరకు ఎప్పుడూ ఇలా జరగలేదు. నువ్వు దొంగతనం చేసి నా పనివాళ్ళను నిందిస్తావా? నీ కాళ్ళు చేతులు విరిచేయకపోతే నా పేరు రంగారావు కాదు" అని గర్జించాడు. 'తప్పయిపోయింది ఈ సారికి మన్నించమ'ని కాళ్ళపై పడ్డాడు వాడు. కనికరించి వదిలేశాడు రంగారావు. డబ్బు పోగొట్టుకున్న యాత్రికుడు సూర్యానికి బహుమానం ఇవ్వబోయాడు. అది రంగారావుకే ఇచ్చి "మీ సత్రంలో ఎందరికో అన్నదానం చేస్తున్నారు, ఇది ఉడతాభక్తిగా ఇస్తున్నాను, ఉంచండి" అన్నాడు సూర్యం.

సూర్యం అంటే మంచి అభిప్రాయం కలిగిన రంగారావు అతనికి ఎవరూ లేరని తెలుసుకుని తన దగ్గరే ఆశ్రయమిచ్చాడు. భోజనశాలలో డబ్బిచ్చి, గదులలో ఉండే యాత్రికులకు భోజన సదుపాయం ఎలాగూ ఉంటుంది. వారితోపాటు ఇతర యాత్రికులకు కూడా మధ్యాహ్న సమయంలో ఉచిత భోజనం పెట్టేవాడు రంగారావు. సూర్యం భోజనాల సమయంలో అక్కడి పనులలో రంగారావుకి చేదోడు వాదోడుగా ఉండేవాడు.

రంగారావుకి సీత ఒక్కతే కూతురు. ఆమెను కన్న కొద్ది నెలలకే అతని భార్య కన్నుమూసింది. తండ్రి పెంపకంలో సీత

## ఆడుకోవడానికి ఎవరు వస్తారు?

నెహ్రూ తర్వాత భారతప్రధానిగా పనిచేసిన లాల్‌బహదూర్ శాస్త్రి పొట్టివారే అయినా గట్టివారు. ఆయన వివిధ సందర్భాల్లో పేల్చిన కొన్ని చతుర సంభాషణలు..



ఇంట్లో లాల్ బహదూర్ శాస్త్రి ఒకసారి పసిపిల్లలతో ఆడుకుంటున్నారు. ఇంతలో ఒక విలేఖరి ఇంటర్వ్యూ చేయటానికి వచ్చి చూసి 'మీరు పిల్లలతో ఆడుకుంటున్నారేమిటి?' అన్నాడట విపరీతంగా ఆశ్చర్యపోతూ.

'నా గుజ్జు రూపానికి ఆడుకోడానికి పిల్లలు కాక పెద్దవాళ్ళెలా దొరుకుతారయ్యా?' అన్నారట శాస్త్రి నవ్వుతూ.

కొడుకులాగా పెరిగింది. సూర్యం ప్రవర్తన కొన్ని నెలలుగా చూసిన తరువాత రంగా రావుకి సీతని అతనికి ఇచ్చి చేయాలని ఆలోచన వచ్చింది. పనులలో తండ్రికి సాయం చేస్తూ ఉండే సూర్యం అంటే సీతకి ఇష్టం ఏర్పడటంతో ఆమె కూడా 'సరే' అంది. సూర్యం కూడా ఒప్పుకోవడంతో ఇద్దరికీ పెళ్ళి చేసేసాడు రంగారావు. తర్వాత బాధ్యతలు కూతురికి అల్లుడికి అప్పగించి తను ఎప్పటినుంచో చేయాలనుకున్న తీర్థయాత్రలన్నీ చేసి కొన్నేళ్ళకి తృప్తిగా కాలం చేసాడు.

ఆయన పోయాక సూర్యం ఆ వసతి గృహాన్ని నడుపుతున్నాడు. గత పదేళ్ళుగా కొన్ని కొత్త హంగులు కూడా ఏర్పరిచాడు. అతిథులకు వేణ్ణీళ్ళు ఇవ్వటానికి గీజరు పెట్టించాడు. గదులలో చిన్న చిన్న సీలింగ్ ఫ్యాన్‌లు అమర్చాడు.

అతనికి ఇద్దరు కూతుళ్లు. పెదపాపకు పద్నాలుగేళ్ళు. పేరు విశాలాక్షి. చిన పాపకు పదకొండేళ్ళు, పేరు దాక్షాయణి. చదువుకుంటున్నారు. ఇద్దరూ అల్లరివాళ్లే!

★ ★ ★

మూర్తి, నారాయణలు స్నానాదికాలు ముగించుకున్నారు. నారాయణ తన అనుష్ఠానం చేసుకుంటున్నాడు. మూర్తి కిందకు వెళ్ళాడు కాఫీ తాగటానికి.

మూర్తిని చూసి సూర్యం "రండి, రండి. కాఫీ తీసుకుందురు గాని" అని ఆదరంగా పిలిచి దగ్గర కూర్చోబెట్టుకున్నాడు. వాచ్‌మాన్‌కి "ఏక్ కాఫీ" అని చెప్పాడు.

రాజమండ్రి కబుర్లు అడుగుతూ, తనూ కొన్ని చెప్తూ సంతోషపడ్డాడు సూర్యం.

కొంచెం సేపటిలోనే మంచి స్నేహితులయిపోయారు, వయోభేదం మరిచిపోయి.

"ఎన్ని రోజులుంటారు? "

"మాకేమి తొందరలేదు. నిదానంగా చూడవలసినవన్నీ చూసి వెళ్తాం" అన్నాడు మూర్తి, విషయం చెప్పకుండా. చెప్పాలన్నా ముందు తనకి తెలియాలి కదా? "అయినా మా నారాయణ ఇష్టం. రేపు బయలుదేరమంటే రేపు వెళ్ళిపోవాల్సిందే" అని చెప్పాడు.

"ఏం ముందుగా అనుకోలేదా ఇన్ని రోజులు ఉండాలని? " కుతూహలంగా అడిగాడు సూర్యం..

"చూడూ ఈ విషయం వదిలి ఇంకేమన్నా కబుర్లు చెప్పు"

"ఈ రోజు మన దగ్గర పెసరట్టు, ఉప్మా స్పెషల్. ముందు ఆ పని కానిద్దామా? " అన్నాడు సూర్యం సరదాగా నవ్వుతూ.

"ఉండు, నారాయణ రెడీ అయితే, పిలుచుకొస్తా" అంటూ మేడ పైకి వెళ్ళాడు.

అతని వైపే చూస్తున్న సూర్యం చెవిలో 'వాడొకటి వెతుకుతున్నాడు. ఆచూకి చెప్పమంటావా? ' అని పక పక నవ్వింది, అతని మంత్రదేవత.

★ ★ ★

మూర్తి ఫోన్ చేసిన దగ్గరి నుంచి సదాశివానికి మనసు మనసులో లేదు. ఒక వైపు గిరిజ చనిపోయిన బాధ గుండెల్లో గుచ్చుకున్న ముల్లులా ఉంది. ఇప్పుడు ఈ ఫోన్ వచ్చిన తర్వాత లేని పోని భయాలు చుట్టుముట్టి నిద్ర కూడా పట్టటంలేదు. తల్లికి చెప్పి సలహా అడుగుదామంటే ఆవిడ గిరిజపేరు చెప్తేనే 'బంగారం లాంటి బిడ్డను నేనే బెంగుళూరు పంపమని చెప్పాను. నావల్లే దానికి అర్ధాంతరం చావు వచ్చింది' అని కుమిలిపోతుంది.

ఒకవైపు తన పెదమామగారు గొప్ప పండితుడు. ఎంతో అనుభవం ఉన్నవాడు. ఆయనేమో అన్ని గ్రంథాలు తిరగేసి 'శాంతి అవసరం లేదు. పుణ్యాహవచనం చేయండి చాలు' అని తేల్చేసాడు. మరి నారాయణ ఏమైనా తక్కువ వాడా. నిష్ఠాగరిష్ఠుడు. శాస్త్రాన్ని లోతుగా అధ్య

యనం చేసినవాడు. ఎన్నో శాస్త్ర రహస్యాలను శోధించి వెలికితీసి అందరికీ తెలియ చేసినవాడు. అటువంటివాడు తమ కుటుంబంలో ఉన్నందుకు తామంతా గర్విస్తుంటారు. పైగా దుర్గని ఉపాసిస్తాడు. మంచి సిద్ధి కలిగినవాడూనూ. అంచేత అతని మాట తీసేయటానికీ లేదు.

బాగా ఆలోచించి చివరికి శాంతి చేయించాలని నిశ్చయించుకున్నాడు.

ఆ విషయం మూర్తికి చెప్పాలని ప్రయత్నించాడు. కాని మూర్తి ఫోన్ ప్రస్తుతం అందుబాటులో లేదు. ఇంట్లో కనుక్కుంటే నారాయణతో కలిసి కాశీ వెళ్ళాడని చెప్పారు. సరే నాలుగు రోజులు చూసి శాంతి చేయిద్దామని పురోహితుడిని మాట్లాడుకున్నాడు. అన్ని ఏర్పాట్లు చేసుకున్నాడు. ఇంట్లో జపాలు చేయించి, తర్పణాలు ఇచ్చి, హోమం చేయించి, ఉదక శాంతి చేయించడానికి కావలసిన ఏర్పాట్లు అన్నీ జరిగిపోయాయి. అనుకున్న రోజు వచ్చింది. మూర్తిఫోన్ మాత్రం అందుబాటులోకి రాలేదు. సరే చేసేది ఏముంది అని తనపని మొదలుపెట్టాడు.

★ ★ ★

రాంబాబుకి ఆ రోజు తిక్కగా ఉంది.

అతను ఎప్పుడూ బాసు దగ్గర మాట పడనవసరం లేకుండా పని చేస్తాడు. కాని ఆ రోజు అనుకోకుండా ఆ తప్పు జరిగిపోయింది. రోజూ అలారం పెట్టుకుని లేవాలనుకున్న సమయానికి కొంచెం ముందుగానే లేస్తాడు. ఆ రోజు తనతోపాటు రూములో పడుకున్న సిద్ధార్థ సర్వనాశనం చేశాడు. అలారం మోగకుండా చేశాడు. రాంబాబు మామూలు సమయాల్లో అయితే అలారం మోగకముందే నిద్దరలేస్తాడు. ఇదిగో వాడు రాత్రి మందు తాగించకపోతే అసలు సమస్యే ఉండేది కాదు.

గంట ఆలస్యంగా లేచాడు. బాసు చెప్పిన చోటుకి వెళ్ళి క్లయింట్‌ని కలవడానికి ఇంకా అరగంటేవుంది. ఆదరా బాదరాగా తయారయ్యాడు. స్నానంచేసి బట్టలు వేసుకున్నాక గుర్తుకొచ్చింది, బ్రష్ చేయనేలేదని. గబగబా బాత్‌రూమ్‌లోకి దూరి ఆ పని కానిచ్చి బయట పడ్డాడు. క్లయింట్‌కి చూపించవలసిన ప్లాన్ వివరాలు, స్కెచెస్ అన్నీ ఉన్న ఫైల్ తీసుకుని లెదర్ బాగ్‌లో పెట్టుకుని కారు తాళం తీసుకుని బయటకు వెళ్ళబోతూ ఏదో మరిచిపోయిన ఫీలింగ్ మనసులో మెదులుతూ ఉంటే ఒక్క క్షణం తలుపు దగ్గర నిలుచుని ఆలోచించాడు, ఏమిటా అని. చివరకు గుర్తొచ్చింది, పాంట్ లోపల అండర్‌వేర్ మిస్సింగ్ అని. ఒక క్షణం ఊగిసలాడేడు. అలనాటి హామ్లెట్ మీమాంసలా, 'టు బి ఆర్ నాట్ టు బి' అని. తెగించి ముందుకి అడుగేసిన రాంబాబుకి కారు ముందు టైర్ గాలి పోయి ఫ్లాట్‌గా కనిపించింది. 'ఛ ఈ కారు టైర్ ఇప్పుడే పంక్చర్ అవ్వాలా' అని ఒక్కసారిగా నీరసపడిపోయాడు.

'ఇవాళ నా టైమ్ బాగోలేదు' అని గట్టిగా అనుకున్నాడు.

మిత్రుడి హడావుడి అంతా ఒంటి కన్నుతో చూస్తూ నిద్ర డిస్టర్బ్ అయి దొర్లుతున్న సిద్ధార్థ్ లేచి తన బైక్ కీస్ తీసి

## కొత్తగాలి...

**ఫొటో**
**మధుర స్మృతుల హోయి**
**పరిగెత్తే కాలానికి**
**వెనుకబడిన మైలురాయి!**

– పాయసం సుబ్రహ్మణ్య మహర్షి,
నెల్లూరు

రాంబాబుకి ఇచ్చాడు. అసలు వీడివల్లే ఈ లేటు అని తిట్టుకోబోయినవాడు కాస్త కోపాన్ని కంట్రోల్ చేసుకుని 'థాంక్స్' చెప్పాడు రాంబాబు. 'యు ఆర్ వెల్‌కమ్' అని చెప్పి నవ్వేసి వెళ్ళి మంచంపై అడ్డంగా పడ్డాడు సిద్ధార్థ్, నిద్ర వస్తుందేమో అనే ఆశతో.

సిద్ధార్థ్ లేకపోతే తను ముందు లేచినా- క్లయింట్ దగ్గరకు వెళ్ళలేక పోయేవాడిని అనుకుంటూ 'పోన్లే వీడు రాత్రి రూముకి రావడం మంచిదే అయింది' అనుకున్నాడు రాంబాబు.

"అరే, రాం! ఫ్రంట్ బ్రేక్‌తో జాగ్రత్త. చాలా షార్ప్‌గా పడుతుంది" వెనక నుంచి అరిచి చెప్పాడు సిద్ధార్థ్.

## 3



గిరిజ, ప్రశాంత్‌ల మరణాలు ఆత్మహత్యలు కావని, అటువంటి అవసరం వారిద్దరికీ లేదని ఇటు సదాశివానికి, అటు ప్రశాంత్ తండ్రి మంజునాథ్‌కి తెలుసు. పేపర్లలో 'జంట ఆత్మహత్యలతో ముగిసిన సాఫ్ట్‌వేర్ ఇంజనీర్ల ప్రేమకథ' అని కథ నాలు రాసినా, విషయం అది కాదని.. ఆమెను చెరిచి, అడ్డువచ్చిన ప్రశాంత్‌ని కూడా చంపారని అందరికీ అర్థమైంది. వాళ్ళిద్దరూ పనిచేసే కంపెనీలో ఉద్యోగులు ఆఫీసు టైమ్‌లో వాళ్ళ గురించి ఒక్క మాట కూడ మాట్లాడరు. అసలు వాళ్ళక్కడ పనిచేశారు అన్న విషయాన్నే మరిచిపోయినట్లు ఉంటారు. పాపం, వాళ్లు మాత్రం ఏంచేయగలరు? గనుల మాఫియాని కలలోనైనా తప్పుపడితే శాశ్వత నిద్రలోకి పంపుతారని వాళ్ళకు తెలుసు.

డాక్టర్లు ఇచ్చిన పోస్టుమార్టం రిపోర్టుల ప్రకారం గొంతు చుట్టూ ఒత్తిడి ఏర్పడటం వలన ఊపిరి ఆగి మరణించారని రాశారు. గిరిజపై సామూహిక మానభంగం జరిగిందని, ఆమె రెండు చేతులు మోచేతి దగ్గర విరిగి పోయాయని, ప్రశాంత్ తల వెనుక ఇనప రాడ్‌తో కొట్టిన దెబ్బవల్ల అతను చనిపోయాడని రాయలేదు. దానికి బహుమానంగా ఇద్దరు డాక్టర్లకు చెరో పది లక్షలు దొరికాయి. కేసు తాము చెప్పినట్లు రాసుకున్నందుకు పోలీసులను కూడా సత్కరించారు. ఈ ఖర్చు రుద్రప్ప మందు పార్టీలకు పెట్టే ఖర్చుతో పోలిస్తే ఏపాటి?

మంజునాథ్‌కి తన కొడుకు మరణం ఆత్మహత్య కాదని గట్టి అనుమానం ఉంది. కొడుకు ప్రేమను తాము అంగీకరించమనే ప్రసక్తే లేనప్పుడు ఆత్మహత్య చేసుకోవాల్సిన అవసరం ఏముంది? అదీగాక శవం తమకు అప్పగించిన తర్వాత కూడా పోలీసులు తక్కిన కార్యక్రమాలు త్వరగా చేయించమని ఒత్తిడి తెచ్చారు. ఆ పనులకు మనుషుల్ని కూడా వాళ్ళే ఏర్పాటు చేశారు. షాక్‌నుంచి తాము తేరుకునే లోపలే అన్నీ ముగించేసి ప్రశాంత్ డెత్ సర్టిఫికెట్ చేతికిచ్చారు.

మైసూర్ డిసిపి ప్రవీణ్, మంజునాథ్‌కి పూర్వ విద్యార్థి. అతను ఐపిఎస్‌కి సెలెక్ట్ అయిన తర్వాత కూడ మంజునాథ్‌తో టచ్‌లో ఉన్నాడు. అందుకే ప్రశాంత్ చనిపోయిన విషయంలో తనకు వచ్చిన అనుమానాలు ప్రవీణ్‌తో చర్చించాడు మంజు

నాథ్. ప్రవీణ్ ఆ ఇన్సిడెంట్ జరిగినప్పుడు సిటీలో లేడు. ట్రైనింగ్‌పై హైదరాబాద్ వెళ్ళాడు. నాలుగు రోజుల తర్వాత అతను తిరిగి వచ్చాక జరిగిన విషయం తెలిసింది. ఆత్మహత్యలు జరిగింది ఎలగప్ప కొడుకు హోటల్‌లో అనగానే అనుమానం కలిగింది. చేసుకున్నది ప్రశాంత్ అని తెలిశాక ఆ అనుమానం కాస్తా దృఢమైంది. అతనే మంజునాథ్‌కి ఫోన్ చేద్దామని అనుకుంటున్న సమయంలో మంజునాథే ఫోన్‌చేశాడు. జరిగినదానికి తను చాలా బాధ పడుతున్నాడని చెప్పి, కేసు రీ ఓపెన్ చేయించి దోషులను పట్టుకుంటానని మాట ఇచ్చాడు ప్రవీణ్.

★ ★ ★

రాంబాబుకి బైక్ నడపటం చాలా ఇష్టం. కాని సిటీలో బైక్‌పై ప్రయాణంలో చాలా రిస్క్ ఉంటుందని, అతన్ని కారులోనే వెళ్ళమని అతని తండ్రి కేశవమూర్తి పోరు పెడుతుంటాడు. సిద్ధార్థ్ బైక్ ఇచ్చినందుకు రాంబాబుకి లేటయ్యానన్న బాధ పోయి, బైక్ చేతిలో ఉంటే ఎంతసేపు.. రయ్యిన పోవచ్చు అనుకున్నాడు.

రాంబాబు తండ్రి కేశవమూర్తి ఢిల్లీలో ప్లానింగ్ మినిస్ట్రీలో డిప్యూటీ సెక్రటరీగా పనిచేస్తున్నాడు. అదివరకు సెక్రటేరియట్‌లో పనిచేసేవాడు. డిప్యూటేషన్‌పై ఢిల్లీ వెళ్ళాడు. రాంబాబుకి ఒక చెల్లి కూడా ఉంది. శ్రీదుర్గ, అహ్మదాబాద్ ఐఐఎమ్‌లో ఎంబీఏ చేస్తోంది. కేశవమూర్తి హైదరాబాద్ నుంచి ఢిల్లీ వెళ్ళేటప్పుడు ఇంటిలో సామానంతా మేడపైన సర్దించేసి కింద పోర్షన్ ఆనందరావుకి అద్దెకిచ్చేశాడు. అతను ఇండియన్ బాంక్‌లో మేనేజర్‌గా చేస్తుంటాడు. అతని కూతుళ్లిద్దరికీ పెళ్ళిళ్లు అయిపోయి ఒకరు టొరొంటోలో మరొకరు దుబాయిలో ఉంటున్నారు. ఇంట్లో భార్యాభర్తలు మాత్రమే ఉంటారు.

కొడుక్కి బైక్ ఇష్టమని తెలిసినా, రోడ్డు ప్రమాదాలలో ఎక్కువ బలయిపోయేది బైక్ నడిపేవాళ్ళే గనుక కేశవమూర్తి కొనివ్వలేదు. తన కారు కొడుక్కిచ్చి తను ఆఫీసు కారు వాడేవాడు. అలా రాంబాబుకి బైక్ మోజు పూర్తిగా తీరలేదు.

బైక్‌పైన కూర్చుని స్టార్ట్‌చేసి ముందుకి ఉరికించాక రాంబాబుకి గుర్తుకి వచ్చింది. తను హెల్మెట్ పెట్టుకోలేదని, చిరాకుపడుతూ మళ్ళీ అనుకున్నాడు. 'ఈరోజు నా టైమ్ బాగోలేదు' అని.

★ ★ ★

సదాశివం ఉదయాన్నే స్నానం ముగించుకుని ఆరోజు జరగాల్సిన కార్యక్రమానికి కావాల్సినవి చూసుకుంటున్నాడు.

ఆరుగంటలకల్లా బ్రాహ్మలను తీసుకుని వస్తానని చెప్పాడు గోపాలకృష్ణ. ఆరున్నర

## సారీ.. వీలు పడదు

ఉత్తరప్రదేశ్‌కు చెందిన ఓ కాంగ్రెసు నాయకుడు ఒక పెద్దమనిషిని చూసి ముచ్చటపడి, ఆయన్ని కాంగ్రెస్‌లో చేరమని సూచించాడు.

'అబ్బే! ఇప్పుడు ఆ పార్టీలో చేరడం వీలుపడదండీ!' అన్నాడా పెద్దమనిషి.




ఆ నాయకుడు డీలా పడకుండా పార్టీ గొప్పదనం గురించి ఏకరువు పెట్టబోయాడు.

'అవన్నీ నాకు తెలుసు. అయినా నేనిప్పుడు పార్టీలో చేరడం అస్సలు వీలుపడదండీ' అన్నాడా పెద్దమనిషి మరింత పట్టుదలగా.

'ఎందుకో తెలుసుకోవచ్చా?' అని మొహం గంటుపెట్టుకొన్నాడు ఆ కాంగ్రెస్ నాయకుడు.

'ఎందుకంటే నేనెప్పుడో కాంగ్రెస్‌లో చేరాను. అసెంబ్లీ ఎన్నికల్లో గెలిచి హోంమంత్రినయ్యాను. నా పేరు లాల్‌బహదూర్ శాస్త్రి' అని జవాబిచ్చారా ఆ పెద్దమనిషి.

యినా వాళ్ళు రాలేదు. ఈ జపాలు, తపాలు ఈ కాలంలో సులువుగా చేసుకోవాలి గాని చాదస్తంగా చేయాలంటే మన వల్ల అవుతుందా అనుకున్నాడు. లేచీ లేవగానే గుక్కెడు కాఫీ గొంతులో పడకపోతే తెల్లారినట్టే ఉండదు. కార్యక్రమమంతా ముగిసేటప్పటికి మధ్యాహ్నాం పన్నెండే అవుతుందో రెండే అవుతుందో? అప్పటివరకూ నిరాహారంగా ఉండాలంటే ఎలా?

అతని అవస్థ గమనించిన కమల వంటగదిలో నుంచి కేకేసింది. "ఏమండీ ఒకసారి ఇటు వస్తారా? " అంది.

"ఏమిటే, అసలే ఇంకా ఏమీ మొదలుపెట్టలేదని నేను కంగారు పడుతుంటే, మధ్యలో నువ్వొకదానివి" ఒకచేత్తో పంచె సర్దుకుంటూ మరొక చేత్తో నడుము రుద్దుకుంటూ వంటింట్లోకి వెళ్ళాడు. అతను రాగానే కాఫీ గ్లాసు చేతిలో పెట్టి "వేడిగా ఉంది.. జాగ్రత్తగా తీసుకోండి. అసలే ఆరాటం మీకు" అంది కమల.

'హమ్మయ్య' అనుకుని ఆ కాఫీ గ్లాసు అందుకుని, "అమ్మేమన్నా చూసిందా? " అడిగాడు భయంగా.

లేదన్నట్లు తల ఊపింది.

"నాయనా శివం, ఎక్కడున్నావురా? గోపీ వచ్చినట్టున్నాడు, చూడు" అని కనకమ్మ కేక వినిపించి "వచ్చేస్తున్నా" అంటూ హడావుడిగా మిగిలిన కాఫీ గొంతులోకి ఒంపుకుని భార్య భుజం ప్రేమగా తట్టి, హాల్లోకి పరుగున వెళ్ళాడు సదాశివం.

గోపాలకృష్ణ అతన్ని చూసి "బావగారూ కాస్త ఆలస్యమైంది.." అన్నాడు చేతులు జోడించి. ఆత్మారాముడు కాస్త శాంతించాడు గనుక సదాశివం నవ్వుతూ "ఎంత మాట, అరగంటయినా ఆలస్యం కాకపోతే ఇండియన్ పంక్చువాలిటీ పరువుపోదూ" అన్నాడు తాను కూడా నవ్వుతూ.

బిలబిలా ఎనమండుగురు బ్రాహ్మలు హాల్లోకి వచ్చేశారు. అది ఒక ప్యాకేజి కార్యక్రమం గనుక కావలసిన వస్తువులన్నీ వాళ్ళే తెచ్చుకున్నారు. గోపాలకృష్ణ హాల్లో సోఫా ఒక పక్కకు జరిపాడు, హోమం చేయడానికి సరిపోయేటంత జాగా కోసం. ఇంకా అడ్డుగా ఉంటాయనుకున్న కుర్చీలు, టీపాయ్‌లు బెడ్‌రూమ్‌లలో సర్దాడు సదాశివం. అతని తల్లి కనకమ్మ వచ్చి హాల్లో ఓ పక్కనే కూర్చుంది.

"నాయనా, ఏమి జపాలు చేస్తున్నారూ? " అంది, వచ్చిన వాళ్ళలో ముఖ్యుడైన నాగభూషణశర్మను.

"అమ్మా, కేతువుకి, శనికి జపం చేస్తున్నాం. అలాగే నక్షత్రాధిపతికి కూడా జపం చేస్తున్నాం. తర్వాత రుద్రాభిషేకం కూడా మొదలుపెట్టేస్తాము" అన్నాడు.

"ఏమిటో నాయనా, నా బంగారు తల్లిని నేనే బెంగుళూరు పంపించాను. ముసలిదాన్ని నన్నన్నా తీసుకుపోయాడు కాదు, ముక్కుపచ్చలారనిదాన్ని తీసుకుపోయాడు" అంది కనకమ్మ కన్నీళ్ళు తుడుచుకుంటూ.

"మామ్మగారూ మీకు చెప్పేవాణ్ణి కాను గాని, జాతస్య ధ్రువో మృత్యుః అంటోంది శాస్త్రం. గీతాకారుడూ ఆత్మకు నాశనం లేదని చెప్పాడు కదా? ఆమెకు సద్గతి కలగాలని కోరుకోవటం వినా మనం చేసేదేముంది? " అని ఊరడించాడతను.

మామ్మగారితో మాట్లాడుతూనే రుద్రాభిషేకానికి, నవగ్రహ పూజకు కావలసినవి సర్దుకుంటున్నాడు నాగభూషణశర్మ.

"ఏమో నాయనా నా మనమరాలు చనిపోవడమే బాధగా ఉందనుకుంటే, ఇంకో పసిప్రాణం పోయింది. అంత మంచిపిల్ల వల్ల ఈ దారుణం జరుగుతుందంటే నమ్మలేకపోతున్నాను" బాధగా అంది కనకమ్మ.

"మామ్మగారూ, చనిపోయిన వారిని నిందించటం సరికాదు. వారి కారణంగా మరో ప్రాణం పోయిందనటం కూడా సరి

కాదు. అందువలన మీరు బాధ పడవలసిందేమీ లేదు"

"అలా అయితే ఈ శాంతి హోమాలు అవీ అవసరమా? " లా పాయింట్ లేవనెత్తింది కనకమ్మ.

"అలా వచ్చారా? అయితే వినండి. అసలు విషయం ఏమంటే మన పెద్దలు జనన మరణ సమయాల్లో ఉండే గ్రహస్థితులను బట్టి కొన్ని దోషాల గురించి చెప్పారు. ఏకవింశతి మహాదోషాలను గురించి శాస్త్రాల్లో ఉంది. అంటే ఇరవై ఒక్క మహాదోషాలన్న మాట. అలాగే నవవిధ శాంతుల గురించి కూడా చెప్పారు. సూక్ష్మంగా చెప్పాలంటే మానవ జీవితంపై గ్రహాల ప్రభావం ఇంతింత అని చెప్పలేనంత. కొన్ని దుర్ఘటనలు జరిగినప్పుడు కలిగిన గ్రహప్రభావాల వల్ల మరిన్ని దుర్ఘటనలు జరిగే అవకాశాలు ఏర్పడతాయి. వాటి నివారణకు రుషులు సూచించిన శాంతి విధానాలే మనం పాటిస్తున్నాం"

మామ్మగారితో మాట్లాడుతూనే తక్కిన బ్రాహ్మలకు జపాలు మొదలుపెట్టుకోమని సైగ చేసాడు శర్మ. గోడకు ఒక పక్కగా కూర్చుని, వారి వారి అలవాటు ప్రకారం జపాలు అందుకున్నారు. సదాశివాన్ని వచ్చి కూర్చోమని పిలిచాడు శర్మ.

తను రుద్రాబిషేకం మొదలుపెట్టాడు.

★ ★ ★

కేసుని ప్రవీణ్ తిరగదోడుతున్నాడని తెలిసి అగ్నిపర్వతంలా పేలాడు ఎలగప్ప. "ఏమనుకుంటావుండాడు, మన విషయం తెలిసినట్టు లేదే? " అన్నాడు కేశవరెడ్డితో. ఆ సమయాల్లో ఎంత తక్కువ మాట్లాడితే అంత మంచిదని అనుభవం నేర్పిన పాఠం గుర్తుకొచ్చి మౌనంగా ఎలగప్ప కళ్లల్లోకి చూసాడు రెడ్డి.

"ఏమప్పా కేశవరెడ్డీ, ఈ పిలకాయని తీసేయమని చెప్పుండ్లా. ఎందుకు తాత్సారం చేస్తుండావు"? గద్దించాడు ఎలగప్ప కళ్ళు పెద్దవి చేసి.

తొణక్కుండా కూర్చున్నాడు రెడ్డి.

"పోనీలే వదిలెయ్, మన దారికి అడ్డు వస్తే అప్పుడు చూద్దామంటివి. మరి ఇప్పుడు ఏసెయ్యాలా వద్దా? " ముందుకి ఒంగి టీపాయ్ పైన ఉన్న చిన్ని 'షాట్' గ్లాసులోని కాస్త ద్రవాన్ని గొంతులోకి ఒంపుకున్నాడు.

పక్క సోఫాలో కూర్చుని ప్లేట్లోని జీడిపప్పు పలుకులను స్పూనుతో అటు ఇటు కదుపుతూ నెర్వస్‌గా ఉన్న రుద్రప్పని చూస్తూ "వాడి అనుమానాలకి ఆధారాలు దొరకవు" అన్నాడు కేశవరెడ్డి ఎలగప్పతో.

"నువ్వు చెప్తే సరే. కాని కురుప్పు

> **కొత్తగాలి...**
>
> **ఆస్తులతో పాటు**
> **అమ్మానాన్నని కూడా**
> **పంచుకున్నాం**
>
> – కె. వెంకటేష్ చౌదరి,
> హైదరాబాద్

మనతో ఏదో మాట్లాడాలంటున్నాడు అన్నావే" గ్లాసులోని విస్కీ గొంతులోకి దిగుతుండగానే కొద్ది క్షణాల క్రితం వచ్చిన పిచ్చి ఆవేశం కలలా కరిగిపోయి వాస్తవంలోకి వచ్చినట్లు ఉన్నాడు.

"ఏముంది కొత్త విషయం? మనకి ముందు నుంచే చెప్తుండ్లా" అన్నాడు రెడ్డి.

రుద్రప్ప మరింత నెర్వస్‌గా అయిపోయాడు. తన జుత్తులోకి రెండు చేతులు పోనిచ్చి గట్టిగా కణతలు ఒత్తుకున్నాడు. అతని చేతులూ వణుకుతున్నాయి.

కొడుకువైపు ఒకసారిచూసి, "రే రుద్రప్పా పోయి పండుకో. మామతో మాట్లాడి అన్నీ సరిజేస్తాగా, నువ్వెళ్ళప్పా" అన్నాడు ఎలగప్ప ఆప్యాయంగా.

గబగబా లేచి తన గదిలోకి వెళ్ళిపోయి తలుపు వేసుకున్నాడు రుద్రప్ప. చేతులు ఇంకా వణుకుతూనే వున్నాయి. అల్మైరా దగ్గరకు వెళ్ళి సీక్రెట్ కోడ్ నొక్కి తలుపు తెరిచాడు. లోపల మరో చిన్న లాకర్ ఉంది. దాన్ని కూడా తెరిచి అందులో నుంచి చిన్న గన్ తీసుకుని దాన్ని మోచేయి దగ్గర పెట్టుకుని గట్టిగా ఒత్తాడు. 'టప్' మని చిన్న శబ్దం వచ్చింది. గన్ లాంటి వస్తువుని లోపల పెట్టేసాడు. లోపలి నుంచి ఒక డివిడి తీసి డివిడి ప్లేయర్‌లో పెట్టి ఆన్ చేసాడు. గోడ పైనున్న పెద్ద ఎల్‌సిడి టీవిపై హోటల్ తలుపు ప్రత్యక్షమయింది. కొన్ని సెకన్లలో తలుపు తెరుచుకుని ఎదురుగా గిరిజ కనిపించింది. ఆమె ముఖంలోని భయం చూసి రుద్రప్ప పెదాలపై వంకర నవ్వు మొలిచింది.

మంచంపై అడ్డంగా పడుకున్నాడు రుద్రప్ప. తల టి.వి. ఉన్న గోడ వైపు ఉంది. కొంచెం సర్దుకుని తన తల మంచం అంచునుంచి వెనక్కి వేలాడేలా వుంచుకున్నాడు. టి.వి.లో బొమ్మ తలకిందులుగా కనిపించింది. అలా చూస్తేనే అతనికి మజా!

గిరిజ తలుపు వెయ్యడానికి ప్రయత్నించింది. మొరటుగా నాలుగు చేతులు తలుపుని నెట్టేసాయి. లోపలికి పరిగెట్టి చేతికి దొరికిన వాటర్ జగ్‌ని వారిపైకి విసిరిందామె. గొల్లున నవ్వులు వినిపించాయి. తర్వాత జరిగిన బీభత్సమంతా వికటంగా నవ్వుతూ మరోసారి చూశాడు రుద్రప్ప. గిరిజ చేతులు ఇద్దరు గూండాలు విరిచేయడం, బాధతో ఆమె అరుస్తుంటే అతనికి మరికాస్త ఎక్సైటింగ్‌గా ఉండటం, అడ్డు వచ్చిన ప్రశాంత్‌ని తనే ఐరన్ రాడ్‌తో ఒకే ఒక దెబ్బకు కూల్చేయడం, అప్పుడు వినిపించిన శబ్దం, గిరిజ గావుకేకలు- అన్నీ ఒక రకమైన పైశాచిక ఆనందాన్ని కలుగచేస్తున్నాయతనికి. మృగంలా నోటితో వింత వింత శబ్దాలు చేస్తున్నాడు. రక్తనాళాలలో కలిసిపోయిన మా దకద్రవ్యం మత్తుకి టి.వి.లో వస్తున్న దృశ్యాలలోని పైశాచికత తోడై అతనికి ఏవో వింత ఆనందం అనుభవమవుతోంది. నోటి పక్క నుంచి చొంగ కార్చుకుంటూ మం చంపై పడుకుని తల వెనక్కి వేలాడేసి టి.వి. చూస్తూ నిద్రలాంటి మైకంలోకి జారుకున్నాడు రుద్రప్ప.



బయట ఎలగప్ప కొంచెం కొంచెంగా మందు కొడుతూ రెడ్డితో మాట్లాడుతున్నాడు. "అయితే ఏందంట, ఈ అమ్మాయి కారణంగా మన పిలకాయికి గండమంటా?" రెట్టించాడు, జీడిపప్పు నములుతూ.

ఫ్రైడ్ చికెన్ ముక్కను నోట్లో వేసుకుని కరకరలాడిస్తున్నాడు రెడ్డి.

"కురుప్ప నీ కొడుక్కి ముప్పయ్యో పుట్టిన రోజుకి జాగ్రత్తగా ఉండమని మొదలే చెప్పిండ్లా? మన శత్రువులు ఏమైనా స్కెచ్ వేస్తారేమోనని రుద్రప్పని హోటల్ దాటనివ్వలేదు. ఫుల్ సెక్యూరిటి పెట్టి పక్కన నేనే కాచుకున్నాను. ఈ అమ్మాయి కంటబడ్డాక రుద్రప్ప తనకి



నచ్చిందన్నాడు. వద్దంటే వింటాడా! నేనే పక్కన ఉండి పెద్దగా గొడవ జరగకుండా చూసుకున్నాను" అన్నాడు. ఆ రోజు తాను ఇతర అతిథులకు ఏమీ అనుమానం రాకుండా చేయడం. ఆధారాలు లేకుండా ప్రేమికులిద్దర్నీ చంపించడం ఒక్కసారి గుర్తుకి వచ్చింది అతనికి. అంతా పర్ఫెక్ట్‌గా జరిగింది.

"ఊc, అయితే" అన్నాడు ఎలగప్ప అసహనంగా.

"జరిగింది కురుప్పుకి చెప్తే అది చచ్చిన టయిమ్ బాగో లేదంట. పూజలు చేయాలన్నాడు. మా రకం జరగబోతోంది, దారి మళ్ళిస్తానన్నాడు. డబ్బు

సమస్య కాదు, నీ ఇష్టమొచ్చినంత తీసుకో అని పది లక్షలిచ్చాను. మరో పది లక్షలు అడిగాడు. ఎందుకంటే ఇంకో రెండు ప్రాణాలు బలి పెట్టాలి, అంత ఖర్చు అవుతదన్నాడు"

"డబ్బిచ్చావు కదా! మల్లా ఏంది కత? " ఎలగప్ప బ్రైన్ చాలా షార్ప్. కాని అమాయకుడిలా మాట్లాడి కొత్తవాళ్ళను మభ్య పెడతాడు. తక్కువ అంచనా వేసిన వాళ్ళను దారుణంగా దెబ్బతీస్తాడు.

"అదే చెప్తుండా బావా, వాళ్లేదో ప్రయత్నాలు చేస్తున్నారట, తన ప్రయోగం బెడిసికొడితే మొదటికే మోసం వస్తుందని కురుప్పు అంటున్నాడు" అన్నాడు రెడ్డి.

"ఇంతకీ రెండు ప్రాణాలు బలయినయ్యా" ఎలగప్ప గొంతులో స్వల్పంగా మార్పు వచ్చింది. ఒక తాగుబోతు నిరక్షరకుక్షిలా కాకుండా, ఒక పెద్ద కంపెనీ బోర్డ్ ఆఫ్ డైరెక్టర్స్ మీటింగ్‌లో ఛైర్మన్ మాట్లాడినట్లుంది ఆ మార్పు.

ఎలగప్ప గురించి బాగా తెలిసిన రెడ్డి వినయంగా చూస్తూ "లేదట. ఒకటే అయిందట. వాళ్ళు ఏదో శాంతి చేయిస్తున్నారట" అన్నాడు.

"కురుప్పు ఏమీ చేయలేడా? "

"తాను చేయాల్సింది చేస్తాను అన్నాడు. కాని అవతల ఒక పండితున్నాడంట. అతనికి ఒక వస్తువు దొరికితే అతన్నెవరూ ఏమీ చేయలేరు అంటున్నాడు"

"అంటే, సమస్య ప్రవీణ్ కాదు, రెండో ప్రాణం పోవటం కాదు. ఆ పండితుడికి ఆ వస్తువు దొరక్కుండా చేయాలి. అంతేనా? " కళ్ళల్లో విధ్వంస రచనా కౌతుకం ఉట్టిపడుతుండగా అడిగాడు ఎలగప్ప.

మౌనంగా తల ఊపాడు రెడ్డి. ఎలగప్ప ఫాంలోకి వస్తే ఎదుర్కోవడం ఎవరి వల్లా కాదు. రెడ్డికే కొత్త పాఠాలు చెప్పగలడు.

ముందుకి ఒంగి మరో షాట్ అందుకుని "కురుప్పుని రేపే తీసుకురా, మాట్లాడాలి" అని గొంతులోకి ఒంపుకున్నాడు.

★ ★ ★

ఉదయం తొమ్మిది గంటలకు ఏర్‌పోర్ట్‌లో తమ క్లయింట్‌ని కలవాలి. ఇంకా గంట టైం వుంది. లక్కీగా ఉదయంపూట పెద్ద ట్రాఫిక్ ఉండదు కాబట్టి వేగంగా వెళ్ళిపోవచ్చు అనుకున్నాడు రాంబాబు. కారు డ్రైవ్ చేయటం బాగా అలవాటు కావటంతో బైక్ నడపటానికి కొంచెం తడుముకోవాల్సివస్తోందతనికి. కాలుతో చేయాల్సినవి చేతులతో, చేతులతో చేయాల్సినవి కాళ్ళతో చేయాల్సి రావడం ఇబ్బందిగానే ఉంది. కాని వెళ్ళాల్సిన చోటుకి టైంకి వెళ్ళడం ముఖ్యం అవడంతో ఏదో విధంగా మానేజ్ చేస్తున్నాడు.

రోడ్డు విశాలంగా ఉంది.

గ్రేటర్ హైదరాబాద్ భవిష్యత్తు ఎలా వుందోగాని వర్తమానం మాత్రం వండర్‌ఫుల్‌గా వుంది. ఎన్నో ఏళ్ళనుంచి పెరిగిన చెట్లు ముక్కలు ముక్కలై కనుమరుగయ్యాయి. తిన్న ఇంటి వాసాలు లెక్కబెట్టే మాయగాళ్ళు వుంటారని పూర్వకాలంలో జాగ్రత్త పడేవారు. కాని తల్లి లాంటి చెట్టుని నరికే కృతఘ్నత కలికాలానికి మాత్రమే ప్రత్యేకమైన మాయరోగం.

అక్కడక్కడా అసంపూర్తిగా ఉన్న రోడ్డు ఎదురవుతున్నా చాలావరకు బాగానే ఉంది. అంతలో రాంబాబు మొబైల్ మోగింది. అనాలోచితంగా బైక్ స్లోచేసి మొబైల్ అందుకున్నాడు. వెనక నుంచి వేగంగా వస్తున్న ఇన్నోవా పెద్దగా హారన్ కొడుతూ షార్ప్‌గా టర్న్ చేసుకుని ముందుకి వెళ్ళి ఆగింది. అందులోనివాళ్లు బండబూతులు తిట్టారు.

హఠాత్తుగా ప్రమాదం అంచుల్లోకి వెళ్ళి వచ్చిన రాంబాబుకి ఆ షాక్‌కి చెవులు వినిపించడం మానేసాయి. భయంతో బైక్‌ని



## యువరాజు ఔదార్యం

**లా**స్‌ఏంజెలెస్‌లోని క్రెన్‌షా స్కూల్ వెనక ఖాళీగా ఉన్న కొద్ది స్థలంలో ఆర్గానిక్ తోటని పెంచితే కొంత ఆదాయం వస్తుందని మేనేజ్‌మెంట్ నిర్ణయించింది. దాంతో స్కూలు విద్యార్థులు అక్కడ పెరిగిన పిచ్చి మొక్కలని పీకేసి, కూరగాయలని పండించి, మార్కెట్లో అమ్మి కొంత లాభాన్ని ఆర్జించసాగారు. ఆ డబ్బును బీద విద్యార్థులకి స్కాలర్‌షిప్ ఇచ్చేందుకు ఉపయోగించేవారు.



పద్నాలుగేళ్ళ కార్లోస్ లోపెజ్‌కు త్వరలో లాస్ ఏంజెలెస్‌కి ఇంగ్లండ్ యువరాజు ఛార్లెస్ వస్తున్నాడని తెలిసింది. తమ ఆర్గానిక్ తోటను సందర్శించమని ఆయనకు ఉత్తరం రాసాడు. బ్రిటిష్ కాన్సులేట్‌వారు లోపెజ్‌కి ఫోన్‌చేసి ఛార్లెస్ అతడి ఆహ్వానాన్ని అంగీకరించాడని చెప్పారు. యువరాజుకు ఆర్గానిక్ తోటలను పెంచడం ఇష్టమని, వాటిని పెంచే వ్యాపార సంస్థ కూడా ఆయనకు ఉందని అప్పటికింకా లోపెజ్‌కు తెలీదు.

తన వెంట రిపోర్టర్లను తోటలోకి రావద్దని, అక్కడ మొక్కలని తొక్కేస్తారని ఛార్లెస్ వారించాడు. ఆ స్కూల్లోనే పిల్లలతో కలిసి లంచ్ చేసాడు. యువరాజు తన తరఫున ఆ తోటకి బహుమతిగా ఓ డెలివరీ ట్రక్‌ని ఇప్పించాడు.

ఒంటి చేత్తో తిప్పి అదుపు తప్పి పడబోయి ఆఖరు నిముషంలో ఆపుకున్నాడు. అతని పరిస్థితి చూసిన ఇన్నోవా వాలా, తమ దారిన తాము పోయారు. చేతిలోని మొబైల్ ఎప్పుడు జారిపోయిందో తెలియదు. కొంత దూరం వెనక్కి వెళ్ళి చూస్తే కింద పడి ఉంది. ఒకటి కాదు, ముక్కలు ముక్కలుగా. అవన్నీ ఏరి బాగ్‌లో పడేసి బైక్‌స్టార్ట్ చేస్తూ మూడోసారి అనుకున్నాడు, 'ఈరోజు నా టైమ్ బాగోలేదు'.

అతనికి వచ్చిన కాల్ అతని తండ్రి కేశవమూర్తి ఢిల్లీ నుంచి చేసింది. అనుకోకుండా హైదరాబాద్ బయలుదేరాననీ, పది గంటల ఫ్లయిట్‌లో వస్తున్నాననీ, కారు తీసుకుని వచ్చి రిసీవ్ చేసుకోమని చెప్పాలని ఫోన్‌చేశాడు. ఫోన్‌ఎత్తాడు కాని పెద్దపెద్ద శబ్దాలు వినిపించి లైన్ కట్ అయ్యేసరికి ఆయనకు ఏమీ అర్థం కాలేదు. వెంటనే లాండ్‌లైన్‌కి చేశాడు.

చాలా సేపు ఫోన్ రింగయింది. కేశవరావు మనసు కీడు శంకించింది. ఆఖరు రింగు అయ్యేటప్పటికి సిద్ధార్థ్ ఫోన్ ఎత్తాడు. "హలో" అన్నాడు, గొంతులో నిద్ర మత్తుతో. "హలో, ఎవరూ, రాంబాబేనా? " అన్నాడు కేశవమూర్తి.

"కాదు, రాంఫ్రెండ్ సిద్ధార్థ్‌ని. ఎవరు? "

"రాంబాబు డాడీని. రాంబాబు ఏడి? "

"రాం ఆఫీసు పనిమీద ఎక్కడికో వెళ్ళాడు, అంకుల్"

"నేను ఫోన్‌చేస్తే కలవటం లేదు. రాంబాబుకి నువ్వు చెప్పు సిద్ధార్థ్. నేను పదిగంటల ఫ్లైట్‌లో హైదరాబాద్ వస్తున్నా. ఏర్‌పోర్ట్‌కి కారు తీసుకురమ్మను"

"అంకుల్, కారు టైర్ ఫ్లాట్ అయింది. అందుకే కారు వదిలి వెళ్ళాడు"

"మరి ఎలా వెళ్ళాడు? " తను విన్న

భీకర శబ్దాలు మళ్ళీ గుర్తుకు వస్తుంటే ఆందోళనగా అడిగాడు కేశవమూర్తి.

"నా బైక్ తీసుకువెళ్ళాడు"

"కొంప ముంచావు" అంటూ కేశవమూర్తి తనకు వినబడిన శబ్దాల గురించి సిద్ధార్థ్‌కి చెప్పాడు.

"బాబు సిద్ధార్థ్, నువ్వు వాడిని ఎలాగైనా కాంటాక్ట్ చేయాలి. నాకు ఎందుకో భయంగా ఉంది. నా నెంబర్ తీసుకో. ఏ విషయం తెలియగానే చెప్పు" అని తన మొబైల్ నంబర్ ఇచ్చాడు. రాంబాబు గురించి వెళ్ళమని మరీ మరీ చెప్పి సిద్ధార్థ్ నెంబర్ తీసుకుని ఫోన్ పెట్టేశాడు.

కేశవమూర్తి మాటలకు సిద్ధార్థ్ నిద్ర మత్తు ఎగిరిపోయింది. గబగబా తయారై స్పేర్ టైర్‌తో పంక్చర్ అయిన టైర్ మార్చి, కారు తీసుకుని రాంబాబుని వెతకటానికి బయలుదేరాడు.

★ ★ ★

రుద్రాభిషేకం కొనసాగుతోంది.

ఏకాదశ రుద్రాభిషేకం అది. రుద్రం, నమక, చమకాలతో గంభీరంగా సాగుతోంది. శర్మ గాత్రం మంద్ర స్థాయిలో తుమ్మెద ఝుంకారంలా వినబడుతోంది సదాశివానికి. కనకమ్మ భక్తి ప్రపత్తులతో ఓ వారగా కూర్చుని చేతులు జోడించి శివలింగం వైపు కన్నులు అరమోడ్చి చూస్తూ ఉంది. కమల నైవేద్యాలు, బ్రాహ్మణ సమారాధనకు కావలసిన ఏర్పాట్లు చేస్తోంది. గోపాలకృష్ణ అక్కకు సాయం చేస్తున్నాడు.

ఇంతలో సదాశివం మొబైల్ ఫోన్ మోగింది. అతను దాన్ని అందుకుంటుండగా కనకమ్మ "ఒరే, ఒరే అది పక్కనపెట్టు. ఏమే కమలా వాడి దగ్గర ఆ పాడుఫోన్ ఎందుకు ఉంచుతావే.. వచ్చి తీసుకెళ్ళు" అని అరిచింది.

చేతికి అందుతున్న ఫోన్ అక్కడే వదిలి, మనసులోనే 'అబ్బ ఏమి చాదస్తంరా బాబు' అని తిట్టుకున్నాడు సదాశివం.

గబగబా అక్కడకు వచ్చిన కమల ఫోన్ అందుకుని, "మీ అన్నగారు" అంది అతనికి మాత్రమే వినబడేటట్లు.

ఫోన్ ఆన్‌చేసి, మెల్లగా 'హలో' అంటూ వంట ఇంట్లోకి వెళ్ళింది.

కాసేపటికి బయటికి వచ్చి అత్తగారితో అంది, "బావగారు ఢిల్లీ నుంచి వస్తున్నారట. రాంబాబు పొద్దున్నే బైక్ వేసుకుని వెళ్ళాడట. ఎక్కడికి వెళ్ళాడో తెలుసా అని అడుగుతున్నారు. కారులోకాక బైక్‌మీద వెళ్ళాడని కంగారు పడుతున్నారు".

"వాడ్ని ఈ రోజు ఉదకశాంతికి రావాలని నేను చెప్పాను. అయితే పొద్దున్నే ఏర్‌పోర్ట్‌కి వెళ్ళాలి. ఆ పని అయిపోయాక వస్తానన్నాడు" అని చెప్పాడు సదాశివం.

"వీడి భక్తి శివుడి మీదా చిత్తం చెప్పుల మీదా అన్నట్లు వుంటాడు" అని వాపోయింది కనకమ్మ.

తల్లీకొడుకుల సంగతి తెలిసిందే. గనుక వాళ్ళ మాటల మధ్య జోక్యం చేసుకోకుండా, తన పని తాను చేసుకోడానికి వంటింట్లోకి వెళ్ళిపోయింది కమల.

పిల్లలు లేచి స్నానాలు కానిచ్చి టిఫిన్లు చేస్తున్నారు. రాంబాబు గురించి బావగారు కంగారు పడుతున్నారంటే ఆశ్చర్యమేసింది. 'పిల్లలు ఇంత పెద్దవాళ్ళైన తర్వాత కూడా వాళ్ళు ఆయన చెప్పినట్లే వినాలంటే కుదురుతుందా? రాంబాబుకి బైక్‌మీద వెళ్ళటమంటే సరదా. తండ్రి చాదస్తం వలన రాంబాబుకి ఆ సరదా తీరనేలేదు. పాపం, అందుకే ఎప్పుడైనా తమ ఇంటికి వచ్చినప్పుడు, కారు చంద్రంకిచ్చి తమ బైక్‌మీద తిరిగి వస్తాడు. ఎవరి పిచ్చి వారికి ఆనందం', అనుకుంది కమల.

"అమ్మా ఇంకా ఎంతసేపు? "

శార్వాణి అడిగింది. ఆ రోజు తన టీమ్ మేట్స్‌తో కలిసి ప్రాజెక్ట్ డిస్కషన్ పెట్టు

## వాద్య 'సహకారం'




తిరుపతిలో మూడు రోజుల సంగీతోత్సవం. మొదటి దినం అరియాక్కుడి రామానుజయ్యంగార్ గానం, టి.ఎన్. కృష్ణన్ ఫిడేలు పక్కవాద్యం. రెండో రోజు శెమ్మంగుడిగారి గానం, చౌడయ్యది ఫిడేలు సహకారం. మూడోరోజు మరో ఇద్దరు. ఈ ఉత్సవాలకు సంబంధించిన ఆహ్వాన పత్రికను చౌడయ్య సరిగా చూసుకోలేదు. అందుకే మొదటి రోజే తిరుపతి చేరుకొన్నాడు. ఉత్సవ కార్యక్రమం వివరాలు తెలుసుకున్నాడు. దాని ప్రకారమైతే ఒక దినమంతా వేచివుండాల్సి వుంటుంది. చౌడయ్య దీనికేదైనా ఉపాయం చేయాలనుకున్నాడు.



మొదట రామానుజయ్యంగార్‌ను కలిశాడు. 'ఏం అరియాక్కుడి స్వామి? ఇంతకు ముందంతా మీకు పక్క వాద్యానికి చౌడయ్యే కావలిసి ఉండె. ఇప్పుడు ముదుసలి అయ్యానని నన్ను వదిలి కృష్ణన్ గారిని పట్టుకుంటిరా? ' అని గర్జించాడు.

'అదెక్కడయినా నిజమా చౌడయ్యా? మీరు మన సంగీత ప్రపంచంలో జాంబవంతులే కదా? ' అని అరియాక్కుడి పలికారు. 'అలాగైతే ఈ సాయంత్రం మీ కచ్చేరీకి నాదే పక్కవాద్యం' అని చౌడయ్య ఘోషించాడు. అరియాక్కుడి తడబడుతూ, 'కృష్ణన్' అని అంటూండగానే, 'ఆ విషయం నాకు వదిలెయ్యండి' అన్నాడు. తర్వాత నేరుగా కృష్ణన్ వద్దకు వెళ్ళాడు. 'కృష్ణన్, నాకు రేపు బెంగళూరులో అర్జెంట్ పని వుంది. తప్పక పోవలసిందే. ఈ దినం అయ్యంగారులకు నేను వాద్య సహకారం అందజేస్తాను. నీవు శెమ్మంగుడిగారి కచ్చేరిలో రేపు నా బదులుగా వాద్య సహకారం అందజేసెయ్. సరిపోతుంది కదా? ' అన్నారు. 'మీ మాటకు తిరుగు ఉంటుందా అన్నా? ' అన్నాడు కృష్ణన్. అలా తన సమస్యను తెలివిగా పరిష్కరించుకున్నాడు చౌడయ్య.

కుంది. ఆమె ప్రాజెక్ట్ పూర్తిచేయడానికి అట్టే టైమ్ లేదు. అసలే సాఫ్ట్‌వేర్ ఉద్యోగాలు తుమ్మితే ఊడిపోయే ముక్కుల్లా ఉన్నాయి.

"అయిపోవచ్చిందమ్మా. ఇక హోమం మొదలెట్టేస్తారు. తర్వాత ఉదకశాంతి చేస్తారు" అంది కమల.

"ఆ తర్వాత వెళ్ళొచ్చా, లేకపోతే ఇంకా వేరే ఏమైనా ఉన్నాయంటావా? ".

"నేననేదేముందే, ఉదకశాంతి తర్వాత ఆ బట్టలు విడిచి మళ్ళీ స్నానాలు చెయ్యాలిగా. ఆ తర్వాత బ్రాహ్మలందరికీ భోజనాలు పెట్టి మనం తినాలి. అయినా ఈ రోజు నీ ప్రోగ్రాం కాన్సిల్ చేసుకో. నీ టీం వాళ్ళకు ముందే చెప్పేయ్. మళ్ళీ లేటయిందంటే నా తల తింటావు" విసుగ్గా అంది.

హాల్లో రుద్రాభిషేకం ముగిసింది. హారతి ఇచ్చి అందరినీ రమ్మని పిలిచారు శర్మగారు.

"అయ్యా, ఇప్పుడు అష్టదిక్పాలకులను ఆవాహన చేసి మండపారాధన చేస్తాం. పూజ, హోమం చేస్తాం. ఐదు నిముషాలు టైమ్ ఉంటుంది. కావాలంటే కాసేపు, అటు ఇటు తిరగొచ్చు మీరు" అన్నాడు శర్మ సదాశివంతో.

'హమ్మయ్య, కాళ్ళు పట్టేసాయి' అనుకుంటూ లేచివెళ్ళి సోఫాలో కూర్చుని రిలాక్సయ్యాడు సదాశివం. అప్పుడు అన్న చేసిన ఫోన్ గుర్తుకి వచ్చి కమలను మొబైల్ తెచ్చి ఇమ్మన్నాడు. కేశవమూర్తితో మాట్లాడి రాంబాబు ఏర్‌పోర్ట్‌కి వెళ్తానని చెప్పిన విషయం చెప్పాడు.

కేశవమూర్తి అప్పటికి శంషాబాద్ ఏర్‌పోర్ట్‌కి చేరుకున్నాడు. లగేజి ఏమీ లేకపోవటం వల్ల చేతిలోని హాండ్‌బాగేజి తీసుకుని త్వరగా బయటికి వచ్చాడు. సదా

శివం చెప్పిన మాట విని రాంబాబు ఏమైనా కనిపిస్తాడేమో అని అటు ఇటు చూడసాగాడు.

శర్మ అక్కడ చేస్తున్న పూజ విధి విధానాలను కనకమ్మ శ్రద్ధగా గమనిస్తోంది. శర్మ ఒక ధవళ వస్త్రంపై ఒడ్లు పోసి కలశాలు ఉంచుతున్నాడు. ఆమెకు ఏమైనా సందేహం వస్తే వెంటనే దాన్ని నివారించుకుకోకపోతే స్థిమితంగా ఉండలేదు.

"ఆ కలశాలు ఎందుకు నాయనా? " అని అడిగేసింది.

"అమ్మా, ఇప్పుడు ఈ ఇంట జరిగిన అకాలమృత్యువు ఏ గ్రహస్థితి కారణంగా ఏర్పడిందో ఆయా నక్షత్రాధిదేవతకు, తిథి, వార అధిపతులకు జపం చేయించాం. మరి మృత్యువుకి అధిపతి యముడు కదా? అందుకు ఆయన్ని, అష్టదిక్పాలకులతో పాటు ఆవాహనచేసి, పూజచేసి ఇకపై ఈ వంశస్థులకు అకాల మృత్యువు కలగకుండా కాపాడమని ప్రార్థించి తర్వాత హోమం చేస్తాం. ఇక మీరు ఆ కలశాల గురించి అడిగారు కదా? వాటిలో ఇక్కడ జపాలు చేసిన ఆయా తీర్థజలాలను పోస్తాం. వాటిలో వేరే జలాలు కూడా కలిపి ఉదకశాంతి చేస్తాం".

"తెలియక అడుగుతున్నాను నాయనా, ఇవన్నీ ఏ వేదాలలో ఉంటాయి"

"అమ్మా ఇవి వేదజనితం కాదు. బోధాయనుడనే మహానుభావుడు ఉత్తరక్రియలలో భాగంగా ప్రవేశపెట్టినవి" ఓపిగ్గా సమాధానం చెప్పాడు శర్మ.

ఆమెతో మాట్లాడుతూనే శర్మ మండపం రెడీ చేసుకున్నాడు. ఆ ఏర్పాట్లు అవగానే, "అయ్యా మొదలు పెడదామా? " అని సదాశివాన్ని అడిగాడు. మరోసారి కింద కూర్చుని కార్యక్రమం చేయటానికి మనసుని సిద్ధం చేసుకుని మొండికేస్తున్న శరీరాన్ని బ్రతిమాలుకుని మెల్లగా సోఫాలో నుంచి దాన్ని నేలపైకి చేర్చాడు సదాశివం.

పూజ మొదలు పెట్టాడు శర్మ. అదయ్యాక హోమం చేయాలి. జపాలు అప్పటికి అయిపోతాయి.

★ ★ ★

రాంబాబు ఏర్‌పోర్ట్‌కి వెళ్లి బాసు చెప్పిన క్లయింట్‌ని కలిసాడు. గుణీత్ సింగ్ ఆరడుగుల రెండంగుళాల ఎత్తైన మనిషి. కాంటాక్ట్ చేయటానికి చేతిలో మొబైల్ లేకపోయినా సింగ్‌ని అదివరకు కలిసాడు గనుక ఈజీగానే గుర్తు పట్టాడు రాంబాబు. అతను ఢిల్లీ ఫ్లయిట్ వెళ్లేచోట లాంజ్‌లో వెయిట్ చేస్తున్నాడు.

"గుడ్ మాణింగ్ సర్" అన్న రాంబాబుని చూసి నవ్వుతూ, "నువ్వు రావేమో అనుకున్నాను" అన్నాడు ఇంగ్లీషులో.

విషయం క్లుప్తంగా చెప్పి మొబైల్ విరిగిపోవడం వలన తను కాంటాక్ట్ చేయలేకపోయానన్నాడు రాంబాబు.

బ్యాగ్‌లోనుంచి తను తెచ్చిన స్కెచెస్, ఇతర వివరాలున్న కాగితాలు తీసి గుణీత్ సింగ్‌కి ఇచ్చాడు. అతను కోరిన విధంగా తాము చేసిన మార్పులు చేర్పులు క్లుప్తంగా చెప్పాడు. వివరాలన్నీ ప్రింట్ చేసి ఉన్న కాగితాలు చూపించాడు. గుణీత్ సింగ్ అడిగిన ప్రశ్నలకు చక్కగా సమాధానాలు చెప్పాడు.

"థాంక్స్, రాం. నువ్వు ఈ పేపర్లు తెచ్చి ఇవ్వకపోతే నా ప్రయాణం వేస్ట్ అయ్యేది. ప్రాజెక్ట్ డిలే అయితే మా డైరెక్టర్ నన్ను భాంగ్రా చేయిస్తాడు" నవ్వుతూ అని, లేచి రాంబాబుతో షేక్‌హాండ్ చేశాడు గుణీత్ సింగ్.

"దానిదేముంది. మా కంపెనీ మీకు ఇచ్చే సర్వీసెస్‌లో ఏ లోటుపాట్లు రాకుండా ఉండాలని ఎక్స్‌ట్రా కేర్ తీసుకుంటుంది.. ఓకే విష్ యు ఎ ప్లెజంట్ టైమ్" అని సెలవు తీసుకున్నాడు

రాంబాబు.

పార్కింగ్‌లో ఉంచిన బైక్ తీసుకుని టైమ్ చూసుకున్నాడు. బాబాయ్ ఇంటికి వెళ్ళాలి. ఏదో శాంతి హోమం చేస్తున్నా రట రమ్మన్నారు. కావాలంటే సిద్ధార్థ్ తన కారు వాడుకుంటాడు అనుకుంటూ బైక్ పోనిచ్చాడు.

★ ★ ★

సిద్ధార్థ్ కేశవమూర్తికి ఫోన్ చేసాడు. రాంబాబు ఎక్కడకు వెళ్లాడో తెలుసుకోవ డానికి అతని కొలీగ్స్‌కి ఫోన్‌చేసి వాళ్ళ ద్వారా రాంబాబు బాసు నెంబరు తీసుకుని చివరికి రాంబాబు ఏర్‌పోర్ట్‌కే వచ్చాడని తెలుసుకున్నాడు. దారి పొడవునా అతని కోసం చూసుకుంటూ వచ్చాడు. ఎలాగూ కేశవమూర్తి కూడా ఫ్లైట్‌లో వస్తున్నాడు కాబట్టి అతన్ని పికప్ చేసుకుందామని అత నికి ఫోన్ చేశాడు.

కేశవమూర్తి ఫోన్‌లో సిద్ధార్థ్‌తో మాట్లా డాడు. ఇంకా రాంబాబు ఆచూకి తెలియలే దని కాస్త టెన్షన్‌గా ఉన్నాడు. తనెక్కడు న్నాడో సిద్ధార్థ్‌కి చెప్పాడు. కొంచెంసేపటికి అతను ఉన్నచోటికి వచ్చాడు సిద్ధార్థ్. ఒక రినొకరు పలకరించుకున్నారు.

"పదండి అంకుల్ రాంబాబు ఆఫీసుకి వస్తే వెంటనే నాకు ఫోన్ చేయమని చెప్పాను వాడి కొలీగ్ సుధీర్‌తో. మనం ఇంటికి వెళ్దాం" అన్నాడు సిద్ధార్థ్.

"లేదు సిద్ధార్థ్ రాంబాబు మా తమ్ముడు సదాశివం ఇంటికి వస్తానని చెప్పాడట. నాకు కూడా అక్కడ కొంచెం పనుంది. నువ్వెళ్లు నేను కాబ్ తీసుకుని వెళ్తాను".

"నాకు బాబాయ్‌గారి ఇల్లు తెలుసు అంకుల్. వనస్థలిపురమేగదా? మిమ్మల్ని అక్కడ దింపి రూమ్‌కి వెళతాను. రండి అంకుల్" అన్నాడు సిద్ధార్థ్.

కేశవమూర్తి 'సరే'నని కారులో సదా శివం ఇంటికి బయలుదేరాడు.

రాంబాబు కూడా అదే దారిలో వెళ్తు న్నాడు. వనస్థలిపురం దగ్గరకు వచ్చాక, ఒక రెస్టారెంట్ కనిపిస్తే, పొద్దుటినుంచి ఏమీ తినలేదని గుర్తుకి వచ్చింది. ఎలాగూ బాబాయ్ ఇంట్లో పూజ, హోమం కాబట్టి బిజీగా ఉంటారు. వెళ్లగానే టీ, టిఫిన్ అంటే వీలుపడుతుందో లేదో, ఇక్కడే ఏమైనా మేస్తే పోలా అనుకుని ఆ రెస్టా రెంట్ దగ్గర ఆగాడు.

పది నిముషాల తేడాలో రాంబాబు వెనక బయలుదేరిన సిద్ధార్థ్ కారు సరిగ్గా పది నిముషాల తరువాత అదే రోడ్‌పై వెళ్తోంది. కేశవమూర్తి టెన్షన్‌లో ఉన్నాడని గ్రహించిన సిద్ధార్థ్ నేర్పుగా అతన్ని మాట లలో పెట్టాడు. తన ఆఫీసు విషయాలు, రాష్ట్రంలో గొడవలు చెబుతూ విజయవం తంగా అతని దృష్టిని మరల్చాడు. తను మాత్రం రాంబాబు కనిపిస్తాడేమో అని రోడ్డుపై జాగ్రత్తగా చూస్తూనే ఉన్నాడు.

★ ★ ★

అష్టదిక్పాలకుల పూజ అయిపోయింది. వరుణ దేవుణ్ణి ఆవాహన చేసి కలశంలోని నీటిని మంత్రించాడు శర్మ. హోమం కూడా చేసి శాంతి మంత్రాలు పఠించాడు. జపాలు చేసిన బ్రాహ్మలు తర్పణాలు చేసి ధారాదత్తం చేశారు.

"అయ్యా, మీరు పెరటివైపు వస్తే సచేల

## కొత్తగాలి...

**ఎలాంటి సమస్యలనైనా**
**ఎదిరించి బతుకుతున్న...వాడు**
**పిల్లి ఎదురొస్తే... ఎందుకో**
**భయపడుతున్నాడు!!**

– భాస్కరభట్ల,
హైదరాబాద్

స్నాన కార్యక్రమం కానిచ్చేద్దాం"

"ఇంటిల్లిపాది రావలసిందేగా" అన్నాడు సదాశివం.

"అవునండి, పాత బట్టలు కట్టుకు వస్తే వాటిని విడిచిపెట్టేయొచ్చు ఎవరైనా పుచ్చుకుంటే ఇచ్చేయండి. లేదా బయట పారేసినా మంచిదే" అన్నాడు శర్మ.

భార్యా పిల్లలను పాత బట్టలు కట్టుకుని రమ్మన్నాడు. తను కూడా బట్టలు మార్చుకుని వచ్చాడు. రాంబాబు కూడా వచ్చేస్తే బాగుండేది. కేశవమూర్తి ఆఫీసుకి వెళ్లిపోయి ఉంటాడు. ఎలాగూ ఊరిలోనే ఉన్నాడు, ఆయన వచ్చినా బాగుండేది. ఒకసారి ఫోన్‌చేసి చూద్దాం అనుకుని కేశవమూర్తికి రింగ్ చేశాడు. పూర్తిగా రింగయినా అవతలి నుంచి రెస్పాన్స్ లేదు.

కమల పెరట్లో ఫైబర్ కుర్చీలు వేయించింది. బకెట్లలో నీరు సిద్ధం చేయించింది. శర్మ కలశాలు పెరట్లో పెట్టించాడు. అంతా సిద్ధం అయిపోయింది. సదాశివం కూడా పెరట్లోకి వెళ్ళాడు.

"అయ్యా, అలా కూర్చోండి" అని అందరిని వరసగా కుర్చీలలో కూర్చోబెట్టాడు. కలశాలలో నీరు కొంచెం కొంచెంగా అందరి శిరసులపై పడేటట్లు చిల్లుల పళ్లెంలో పోసాడు. అందరి బట్టలు తడిసేలా వారికి సచేల స్నానం చేయించాడు.

"అమ్మా, ఈ స్నానం నూట ఎనిమిది సార్లు చేయాలి తెలుసా? " అన్నాడు శర్మ కనకమ్మతో.

"ఆ స్నానాలు అయిపోయేటప్పటికి వైకుంఠయాత్రకు రెడీ అయిపోతాను నాయనా" అంది ఆవిడ చలికి వణుకుతూ.

గట్టిగా నవ్వి, "అందుకే శాస్త్రంలో ఒక సులువు ఉందమ్మా. మీ తలపైన ఈ పళ్ళెం పెట్టి దానిపైనుంచి నీరు పోస్తున్నాము చూడండి. దీన్ని శతశ్చిద్రపాత్ర అంటారు. వాటి నుంచి వచ్చే 108 ధారలతో మీరు అన్నిసార్లు స్నానం చేసినట్లవుతుంది" అన్నాడు శర్మ.

"ఏమిటో ఈ మాయ. ఉంది అనుకుంటే ఉంది. లేదు అనుకుంటే లేదు" అనుకున్నాడు సదాశివం.

ఆ తంతు ముగిశాక శర్మ అందర్నీ స్నానాలు చేసి బట్టలు మార్చుకుని రమ్మన్నాడు ఆశీర్వచనం కోసం. దాని తర్వాత బ్రాహ్మణ సమారాధన ఉంటుంది.

రాంబాబు వచ్చి ఉంటే బాగుండేది కదా అని మళ్ళీ అనిపించింది సదాశివానికి.

★ ★ ★

సిద్ధార్థ్ కారు ఒక పక్కగా తీసి ఆపాడు.

"ఏమైంది? " అన్నాడు కేశవమూర్తి.

"అక్కడ నా బైక్ కనిపించింది అంకుల్. రాంబాబు ఇక్కడే ఉండి ఉంటాడు" అన్నాడు కారు దిగుతూ. కేశవమూర్తి కూడా కిందకు దిగాడు. సిద్ధార్థ్ కారు లాక్‌చేసి వెనక్కి నడవసాగాడు. అతని వెంటే కేశవమూర్తి వెళ్ళాడు. బైక్ దగ్గరకు వెళ్ళి అటూ ఇటూ చూశారు రాంబాబు కోసం.

రాంబాబు వెళ్ళిన రెస్టారెంట్ రోడ్డుకి అటువైపు ఉంది. అప్పుడే టిఫిన్ చేసి బయటకు వస్తున్న రాంబాబుకి తండ్రి, సిద్ధార్థ్‌లు బైక్ దగ్గర కనిపించారు. సిద్ధార్థ్ కూడా అప్పుడే రాంబాబుని గమనించాడు.

"అంకుల్, అడుగో రాంబాబు" అని చూపించాడు. రాంబాబుని చూసి కేశవమూర్తి 'హమ్మయ్య' అనుకుని నిట్టూర్చాడు. నవ్వుతూ చెయ్యి ఊపాడు రాంబాబు. ఒక అడుగు ముందుకు వేసాడో లేదో ఎగిరి అంతదూరంలో పడ్డాడు.

రెస్టారెంట్‌కి కాస్త అవతలగా ఉన్న బస్ స్టాప్‌లో ఆగవలసిన బస్ అక్కడ ఆగకుండా వేగంగా వచ్చి రెస్టారెంట్ ముందు ఆగింది. మాట్లాడుతున్న సెల్‌ఫోన్ పక్క

నపెట్టి ఆర్.టి.సి బస్‌డ్రైవర్ ఆందోళనగా పక్కకి చూసాడు.

"అన్నా ఎంత పని చేసినవే" అంటూ కండక్టర్ గబగబా కిందకు దిగాడు. బస్ ఎక్కుదామని పరిగెత్తుకుని వస్తున్న జనాలు 'అయ్యయ్యో' అంటూ రాంబాబు పడి ఉన్న దగ్గరకు వెళ్ళారు. డ్రైవర్ బస్ దిగి వెంటనే రెస్టారెంట్‌లోకి పరిగెత్తాడు. టిఫిన్ సెక్షన్‌లో ఆగకుండా కిచెన్‌లోకి పరిగెత్తి వెనకవైపు తలుపు తెరుచుకుని పారిపోయాడు పిచ్చి భయంతో.

బస్‌లోని ప్రయాణీకులు కూడా గబగబా కిందకు దిగి రాంబాబుని చూస్తున్నారు. కేశవమూర్తికి ఏమీ అర్థం కాలేదు. ఆలోచనలు స్తంభించి పోయినట్లయింది.

"అంకుల్, రాంబాబు" అంటూ సిద్ధార్థ్ కేశవమూర్తి చేయి పుచ్చుకుని రోడ్డు దాటించాడు. అతని చేతులు వణుకుతున్నాయి. కేశవమూర్తి జేబులోని మొబైల్ మోగటం ప్రారంభించింది. ఆ శబ్దం పట్టించుకునేలా లేవు వారి మనసులు.

"ఈ బస్సులోళ్ళు రోడ్డుమీద ఎవరినీ నడవనీకి వదలటం లేదు తమ్మీ" కింద పడున్న రాంబాబుని చూస్తూ అన్నాడు ఒకడు. మూలుగుతూ లేవడానికి ప్రయత్నిస్తున్నాడు రాంబాబు. పరిగెత్తుకుంటూ వచ్చిన సిద్ధార్థ్ రాంబాబుని లేపడానికి ప్రయత్నించాడు. ఒంటిమీద చిన్న దెబ్బ కూడా బయటకు కనిపించటంలేదు. కాని లేపడానికి ప్రయత్నిస్తుంటే తలవెనక నుంచి రక్తం ధారగాపోతూ కనిపించింది.

"అంకుల్, బాగా దెబ్బ తగిలింది" పిచ్చి పట్టినట్టు అరిచాడు సిద్ధార్థ్. జేబులు తడుముకుని మొబైల్ ఫోన్ కోసం వెతుకుతూ "డాక్టర్ ఎక్కడుంటాడు? " అరిచాడు.

"108కి ఫోన్‌చేసినా, జర్రుండు తమ్మీ. కొంచెం నిదానించు. పరేషాన్‌గాకు" ధైర్యం చెప్పాడు మొదట అక్కడకు వచ్చిన వ్యక్తి.

"పక్కనే హాస్పిటల్ ఉంది" అన్నాడు

## చదవడమే హాబీ



శ్రీగంగ

చిన్నప్పటి నుంచి పుస్తకాలు చదవడం హాబీ. కాలేజీ రోజుల్లో అప్పుడప్పుడూ గాలి పోగేసి కవితలల్లినా, వాటిని పాఠకులకు చేర్చాలనే ఆలోచన రాలేదు. నా మొట్టమొదటి నవల 'సేతురహస్యం'తో రెండేళ్ల క్రితం రచనా వ్యాసంగాన్ని సీరియస్‌గా మొదలుపెట్టాను. రామసేతువుపై రాజుకున్న వివాదం మతం రంగు పులుముకుంటుంటే సగటు మనిషిగా స్పందించి అది రాశాను. సున్నితమైన అంశాన్ని నవలగా మలచినందుకు మేధావుల ప్రశంసలు లభించాయి.

ఇక ప్రస్తుత నవల మృత్యురహస్యం విషయానికి వస్తే, శాస్త్రాలను పరిహసించడమే హేతువాదమనే భ్రమనుంచి మేలుకోవాలి. మన జ్ఞాన పరిధికి ఆవలి విషయాలను అసంబద్ధాలనుకునే ధోరణి నుంచి బయట పడాలి. ఇలాంటి నా అభిప్రాయాలకు మరికొన్ని యదార్థ, కల్పిత అంశాలను జోడించి ఈ నవల అల్లాను. రచనలు చేసే నా భార్యది, నాది కలిపి పెట్టుకున్న కలంపేరు శ్రీగంగ. నా నవలను ప్రచురణకు స్వీకరించిన చతుర సంపాదకులకు కృతజ్ఞతలు.

**చిరునామా:**
**జి.శ్రీనివాసరావు,**
క్వార్టర్ నెం. 416/1,
రైల్వే ఆఫీసర్స్ కాలనీ,
సౌత్ లాలాగూడ,
సికింద్రాబాద్-500017

జనంలో మరొకడు.

ఆ సమయంలో వెంటనే ఏమి చేయాలో ఎవరికీ సరిగా తెలియదు. హఠాత్తుగా ఎదురయ్యే ప్రమాదాలలో పౌరులు ఏమి చేయాలో తెలియచేయడానికి ప్రభుత్వమో, ప్రచార సంస్థలో ఎవరో ఒకరు ముందుకు రావాలి. అడుగడుక్కి సినిమాల గురించి, సిగిరెట్ల గురించి, చీరల గురించి, సెల్ ఫోన్‌ల గురించి ప్రకటనలు గుప్పిస్తారు. రోడ్డు ప్రమాదంలో ముందు చేయాల్సిన ప్రథమ చికిత్స గురించి ఒక్క హోర్డింగూ ఉండదు. ప్రాణానికి మనమిచ్చే విలువ ఇదేనా?

అక్కడి జనాల్లో ఉన్న నర్సింగ్ విద్యార్థిని ఒకామె వచ్చి "రక్తం పోకుండా ఆపాలి" అంటూ తన చున్నీ రెండు భాగాలు చేసి ఒకటి మడిచి తలకింద పెట్టి రెండవ భాగంతో కట్టు కట్టింది. నోరు, ముక్కు చోక్ అయిపోకుండా తల కాస్త ఎత్తుగా పెట్టి "ఇక్కడ కొంచెం ఎత్తుగా పట్టుకోండి" అంది. కేశవమూర్తి చేతలుడిగి కొడుకువైపు చూస్తున్నాడు. "థాంక్స్ అండి" అంటూ సిద్ధార్థ్ తన స్నేహితుని తలను కొంచెం ఎత్తుగా వుండేటట్లు పట్టుకున్నాడు. "నా కారు ఉంది హాస్పిటల్‌కి తీసుకువెళితే మంచిదా?" అడిగాడు నర్సింగ్ విద్యార్థినిని.

"ఆయనను కదపటం ప్రమాదం. అలాగే ఉంచండి. 108 త్వరగా వచ్చేస్తుంది" అని తన ఫోన్ నుంచి మళ్ళీ 108కి ట్రై చేసింది.

అంతలో అంబులెన్స్ సైరన్ మోత చేసుకుంటూ వచ్చింది. ట్రాఫిక్ కానిస్టేబుల్, మరికొందరు రాంబాబుని అందులోకి ఎక్కించారు. కేశవమూర్తి కొంచెం తెప్పరిల్లి రెండు చేతులు జోడించి ఆ నర్సింగ్ విద్యార్థినికి నమస్కారం చేసాడు.

"చాలా థాంక్స్ తల్లీ" అన్నాడు.

"అంకుల్ మీరు అంబులెన్స్ ఎక్కండి. నేను కార్లో వస్తాను" అన్నాడు సిద్ధార్థ్.

సైరన్ మోగించుకుంటూ అంబులెన్స్ సాగిపోయింది. 108లో ఉన్న సిబ్బంది చున్నీ తొలగించి రక్తస్రావం ఆపడానికి బాండేజి కట్టారు. ఆక్సిజన్ మాస్క్ ముక్కుకి తగిలించారు. డాక్టరు రాంబాబు నాడి చూసి పరీక్ష చేసి బీపీ మానిటర్ కట్టాడు. పక్కనే ఉన్న కేశవమూర్తి జేబులోని మొబైల్ మళ్ళీ మోగి మోగి ఆగిపోయింది. "అంకుల్ ఫోన్ చూడండి" అని పక్కనే ఉన్న సిబ్బంది చెప్పినా వినిపించుకోకుండా దేవుణ్ణి ప్రార్థిస్తూ కూర్చున్నాడు కేశవమూర్తి.

"భగవంతుడా నా బిడ్డను రక్షించు"

★ ★ ★

సదాశివం తన కుటుంబ సభ్యులందరితో కలిసి కిందపరిచిన చాపపై కూర్చుని శర్మ బృందంతో ఆశీర్వచనం పొందారు. "అయ్యా, ఇక మీరు సమారాధన ఏర్పాట్లు చేసుకోవచ్చు. మా పని ముగిసింది అన్నాడు. అతనితో వచ్చిన బ్రాహ్మలందరూ తమ తమ సంచులు సర్దుకుంటున్నారు. సదాశివం వాళ్ళకు దక్షిణ తాంబూలాలు ఇచ్చి భోజనానికి ఆహ్వానించాడు. అందరూ భోజనానికి కూర్చున్నారు.

కమల చేతి వంట అద్భుతం. అదీగాక

కొత్తగాలి...

**వృద్ధాప్యంలో**
**వినేదెవ్వరు నీ గోడు**
**బీపీ షుగర్లే**
**కడదాకా నీకు తోడు**

– పినిశెట్టి లక్ష్మీశారద, రాజమండ్రి

# పోలీసుల కళా హృదయం



**పో**లీసులను సాధారణంగా కర్కశ హృదయులనుకుంటారు. వారికి కళా హృదయం ఉండదని అనుకుంటే పొరపాటే. దుబాయ్ పోలీసులు తామెంతో సున్నితమైన కళాహృదయం గలవారని జనవరి 2010లో నిరూపించారు. అక్కడి పోలీస్ ఆఫీసర్లు సముద్రపు ఒడ్డునుంచి అనేక రకాల శంఖాలు, ఆల్చిప్పలను సేకరించి ముప్పైరెండు రోజుల పాటు 335 గంటలు శ్రమించారు. ఫలితంగా తమ పోలీస్ ఎంబ్లమ్‌కు, శంఖాలను ఉపయోగించి చక్కటి ఆకృతినిచ్చారు. 1700 కిలోల సీషెల్స్‌ని ఉపయోగించి 13.6 మీటర్ల పొడవు, 12 మీటర్ల వెడల్పు గల లోగోని నేలపై ఏర్పాటు చేసారు. ఇది గిన్నిస్ బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డ్స్‌లోకి ఎక్కింది.



షేక్ మహమ్మద్ బీన్‌రషీద్ అల్ ముఖ్తుమ్ దుబాయ్ ప్రధానిగా పదవి చేపట్టిన నాలుగో వార్షికోత్సవ సందర్భంగా ఆయన గౌరవార్థం పోలీసులు దీన్ని రూపొందించారు. దుబాయ్ పోలీస్ డిప్యూటీ డైరెక్టర్ నిమీస్‌మత్తార్ అల్ మెజియానా దీనికి తన సహకారాన్ని అందించాడు. ఎండకి వానకి కూడా లోగో కొంచెమైనా పాడవ్వక పోవడం విశేషమని ప్రజలు కొనియాడారు.

ఉదయం నుంచీ ఏమీ తినకుండా ఉన్నారేమో మరి కాస్త రుచిగా తోచాయి అందరికీ. తృప్తిగా భోజనాలు చేసి బయలుదేరటానికి సిద్ధపడ్డారు శర్మ బృందం.

“శర్మగారు, మా అన్నయ్య ఢిల్లీ నుంచి వచ్చాడు. పూజ టైమ్‌కి ఎందుచేతనో రాలేకపోయాడు. వాళ్ల అబ్బాయి, రాంబాబు కూడా రావలసింది, వాడూ రాలేదు. లేటుగా వస్తారేమో అనుకుంటున్నాను. మరి వాళ్ల కోసం ఏమైనా ఇస్తారా? ” అన్నాడు సదాశివం.

“పూజ తర్వాత మీకు ఇచ్చిన తీర్థప్రసాదాలు ఇవ్వండి” అని ఒక క్షణం అగి, కలశాలు తెప్పించి వాటిలో ఉన్న నీటిని వేరే గిన్నెలోకి పోసి, “ఈ నీటిని కలుపుకుని స్నానం చేయమనండి..” అన్నాడు కలతపడుతున్న సదాశివాన్ని చూసి.

“థ్యాంక్సండి. ఎందుకో నా మనసు బాగోలేదు. మీరు ధైర్యం చెప్పారు గనక ఇప్పుడు మనశ్శాంతిగా ఉంది” అన్నాడు.

శర్మ, అతనితో వచ్చిన బ్రాహ్మలందరూ వెళ్లిపోయారు.

“హోమం చల్లారేక తొలగించవచ్చు. ఆ పక్కగా సోఫాలు కుర్చీలు సర్దరా” అని కొడుక్కి చెప్పి కాసేపు నడుం వాలుస్తే మంచిదనుకుంటూ బెడ్‌రూమ్‌లోకి వెళ్లాడు సదాశివం. అప్పుడు అతని మొబైల్ మోగింది. చూస్తే అన్నగారి పేరు కనిపించింది.

“హలో” అన్నాడు.

ఆవతలి నుంచి మాటలు వినగానే అతని మొఖం పాలిపోయింది. “అలాగే. నువ్వు కంగారు పడకు. నేను బయల్దేరుతున్నాను. అన్నిటికీ ఆ భగవంతుడున్నాడు” అని ఫోన్ పక్కనే పడేసి మంచంపై కూలబడిపోయాడు.

భర్త పరిస్థితి చూసి కంగారుపడిన కమల "ఏమైందండి?" అంది ఆందోళనగా. ఆమె గొంతులో ధ్వనించిన భయానికి పిల్లలు, కనకమ్మ అక్కడికి వచ్చేసారు. నోట మాటలేక అలా పడున్న భర్తను కుదుపుతూ "ఏమిటండి, మాట్లాడరు?" అని అడిగింది కమల ఏడుపు గొంతుతో.

అందరూ ఆశ్చర్యంగా చూస్తున్నారు.

"రాంబాబు..." అన్నాడు.

"ఊఁ, రాంబాబుకి ఏమయింది! చెప్పండి" శోకాలు పెట్టడానికి సిద్ధపడిపోతూ అడిగింది కమల.

"ఏమీ కాలేదు, కంగారుపడకు. మన ఇంటికి వచ్చేదారిలో రోడ్డుమీద యాక్సిడెంట్ జరిగిందట. అపోలోలో ఉన్నాడు. అన్నయ్య ఫోన్ చేశాడు. నేను వెంటనే వెళ్లాలి" అన్నాడు.

చంద్రం గబగబా వెళ్లాడు బట్టలు మార్చుకుని తండ్రి వెంట వెళ్లటానికి.

"అయ్యయ్యో, ఎంత ఘోరం జరిగిపోయింది. ఎందుకు మన కుటుంబానికి ఈ శాపం? దేవుడా మేమెవరికి అపకారం చేసాం? ఎందుకు మమ్మల్ని ఇలా శిక్షిస్తున్నావు. నువ్వే కాపాడాలి భగవంతుడా" శోకాలు పెట్టింది కనకమ్మ. రాంబాబు అంటే ఆ ఇంట్లో అందరికీ అభిమానం. అతను ఆపదలో ఉన్నాడంటే వాళ్లకు చాలా బాధగా ఉంది. సదాశివం లేచి బట్టలు మార్చుకున్నాడు.

చంద్రంతో కలిసి బైక్‌పైన కూర్చుని బయలుదేరుతూ అనుకున్నాడు సదాశివం- 'ఉదకశాంతి లేటుగా చేయించటం వలన కలిగిన దుష్ఫలితాలా ఇవి?'

★ ★ ★

రాంబాబును ఐసియులో ఉంచారు. ఎవరినీ లోనికి పోనీయటం లేదు. టైమ్‌కి తీసుకురావటం మంచిదే అయిందని చెప్పాడు డాక్టరు. అయినా అతని పరిస్థితి క్రిటికల్‌గా ఉందని నలభైఎనిమిది గంటలు గడిస్తేగాని ఏ విషయం చెప్పలేమన్నాడు. కేశవమూర్తి కొడుకు విషయం భార్యకు ఇంకా చెప్పలేదు. సదాశివం వస్తే ఏమి చెయ్యాలో, ఎవరికి చెప్పాలో, ఎలా చెప్పాలో చూసుకుంటాడు. తమ్ముడు ధైర్యస్థుడు. సమస్యలు వచ్చినప్పుడు, ఏమి చేయాలో వాడికి తెలుసు అనుకున్నాడు..

సిద్ధార్థ్ తన ఫ్రెండ్స్ అందరికీ ఫోన్లు చేశాడు. అందరు వచ్చేశారు. పేషెంట్‌ని చూడటానికి డాక్టర్లు అనుమతించలేదు.

హాస్పిటల్‌లో వెయిటింగ్ హాల్లో దిగులుగా కూర్చుని ఉన్నాడు కేశవమూర్తి. సదాశివం కనబడగానే లేచి తమ్ముడిని కావిలించుకుని భోరుమన్నాడు.

అన్న భుజం తట్టి "కంగారు పడకు ఏం కాదులే" అన్నాడు సదాశివం.

చంద్రం వెళ్లి సిద్ధార్థ్ భుజంపై చేయివేసి "ఎలా జరిగింది?" అని అడిగాడు. జరిగిందంతా వివరంగా చెప్పాడు సిద్ధార్థ్. తలకి ఎమ్ఆర్ఐ తీయించారు. వెంటిలేటర్ కూడా పెట్టారు అని తెలిసిన సదాశివంకు గుండె బరువెక్కింది.

"అన్నయ్యా, ఢిల్లీనుంచి వదిన్ని తీసుకుని రావటానికి ఏర్పాటుచేయి" అన్నాడు.

కేశవమూర్తి ఆఫీసుకి ఫోన్‌చేసి అసిస్టెంట్‌కి చెప్పాడు, తన భార్యను వెంటబెట్టుకుని ఫ్లైట్‌లో హైదరాబాద్ రమ్మని.

"వదినతో కూడా మాట్లాడు" అన్నాడు సదాశివం.

"ఏం చెప్పనురా?" అన్నాడు కేశవమూర్తి.

"అమ్మకు సీరియస్ అయిందని చెప్పు" అన్నాడు సదాశివం నిర్వేదంగా.

తమ్ముడు చెప్పిందే భార్యతో చెప్పాడు. ఆమె అడుగుతున్న ప్రశ్నలు మధ్యలోనే ఆపేసాడు. "మన రాంబాబు ఎలా ఉన్నాడు? మా అన్నయ్యా మంచి

సంబంధం తెచ్చాడట. అమ్మాయి వాళ్లంతా హైదరాబాద్‌లో ఉంటారట. మరి బట్టలు సర్దుకుని ఒక వారం ఉండేలా రానా? " అంది లక్ష్మి.

"ఊఁ, సరే" అన్నాడు.

"ఒకసారి రాంబాబుకి ఇవ్వండి వాడి ఫోన్‌కి చేస్తే కాల్ పోవటం లేదు" అంది.

"ఇప్పుడు కాదు. నేను హాస్పిటల్‌లో ఉన్నాను" అని ఫోన్‌కట్‌చేసి తమ్ముడి భుజంపై తలపెట్టి బోరుమన్నాడు, "మీ వదిన రాంబాబుకి పెళ్లి సంబంధం తెస్తు న్నదిరా" అంటూ.

## 4



**కు**రుప్పుని తీసుకుని రావటానికి కేశవ రెడ్డి తనే స్వయంగా వెళ్లాడు. కురుప్పు కొత్తవాళ్లతో మాట్లాడటానికి ఇష్టపడడు. ఎవరినీ నమ్మడు. ఒక్కోసారి తనను గుర్తించి పలకరించడానికి పరిచయస్తులు ప్రయత్నించినా ఎవరో తెలియనట్లు చూస్తాడు. సిటీకి వచ్చినప్పుడు ఎక్కడో ఒక సంకేత స్థలంలో కలుసుకుంటాడు. ఎప్పుడూ ఒకేచోటు చెప్పడు. సిటీ బయట ఎక్కడ ఉంటాడో అనేది కూడా ఎవరికీ చెప్పడు. అసలు చిరునామా ఎవరికీ తెలి యనివ్వడు. అతనికి వేరే పార్టీలతో పరి చయం ఉందా, లేక తమనే నమ్ముకుని ఉన్నాడా అని కూడా కేశవరెడ్డికి తెలి యదు. పూజలు చేసేటప్పుడు తప్ప వేరే సమయాలలో మామూలుగా పాంట్, షర్ట్ వేసుకుంటాడు. ఎప్పుడూ నల్లపాంట్ పైన ఎర్ర చొక్కా వేసుకుంటాడు. పూజలో ఉన్న ప్పుడు ఎర్రపంచె కట్టుకుంటాడు. చొక్కా వేసుకోడు. బయట తిరిగేటప్పుడు నల్ల కళ్ళద్దాలు పెట్టుకుంటాడు. మొఖం కప్పేస్తూ పెద్ద గడ్డం.. బాగా పెరిగిన తల వెంట్రుకలను చిన్న ముడివేసి ఒక టోపీ పెడతాడు. నుదుట నల్లటి బొట్టు పెట్టుకుంటాడు. మెడనిండా రకరకాల దండలు, రెండు మోచేతులపై పొడిపించు కున్న వింత వింత పచ్చబొట్లు అతను బయట తిరిగేటప్పుడు కనబడకుండ ఫుల్ హాండ్స్ చొక్కా కప్పి వేస్తుంది.

ఎలగప్ప తన బెడ్‌రూమ్‌కి ఆనుకుని ఉన్న ఒక రూమ్‌లో కూర్చుని ఉన్నాడు. ముఖ్య విషయాలు మాట్లాడటానికి ఆ గదినే వాడుతాడు. ఇంటి వెనక ఒక గేటు ఉంది. అదెప్పుడూ లాక్‌చేసి ఉంటుంది. ఇటువంటి అరుదైన సందర్భాలలో మాత్రమే తెరిచి, రావల్సినవాళ్లు రాగానే దాన్ని మూసేస్తాడు రిమోట్‌తో. ఎలగప్ప ఎవరిని కలిసిందీ ఆ ఇంట్లో కూడా ఎవ రికీ తెలియదు.

కేశవరెడ్డి కారును వెనక వైపుకి తీసుకె ళ్లాడు. రాత్రి పది అయింది. అక్కడ స్ట్రీట్ లైట్ లేకపోవటం వల్ల చీకటిగా ఉంది. కారు గేటుని సమీపించగానే తెరుచు కుంది. కారు లోపలికి వెళ్ళి ఇంటి వెనక ఉన్న తలుపు దగ్గర ఆగింది. కేశవరెడ్డి కారులోనుంచి దిగాడు. కురుప్పు కూడా కిందకు దిగి చుట్టూ చూసాడు. చుట్టూ దట్టంగా చెట్లు ఉన్నాయి.

కేశవరెడ్డి తలుపు తోశాడు. తలుపు తెరిచే ఉంది. కురుప్పుని వెంటబెట్టుకుని లోపలికి వెళ్లి తలుపు బోల్టు వేశాడు. ఎల గప్ప ఎదురుగా ఒక చిన్న రౌండ్ టేబుల్

దగ్గర కూర్చుని ఉన్నాడు. లోపలికి వచ్చిన ఇద్దర్నీ చూసి నవ్వాడు. గుహలోకి వచ్చిన అల్పప్రాణులను చూసి సింహం జాలిగా నవ్వినట్లు ఉంది. కురుప్పుని కూర్చోమని చెప్పి కేశవరెడ్డి తానూ కూర్చున్నాడు.

కురుప్పు ఎలగప్పను కలవడం అదే మొదటిసారి.

"ఊఁ, చెప్పు" అన్నాడు ఎలగప్ప.

"ఈయన కురుప్పు. మనకి ఇదివరకు చాలా కేసుల్లో సాయం చేసాడు. ఇప్పుడు రుద్రప్ప విషయంలో ఈయనే అంతా చూస్తున్నాడు" అన్నాడు కేశవరెడ్డి.

"కురుప్పు అంటే మళయాళమా? " అడిగాడు ఎలగప్ప.

"కాదు కన్నడీయుడ్నే. కాని మా గురువు పిలిచే పేరు అది" అన్నాడు కురుప్పు, చుట్టూ ఏమున్నాయో చూస్తూ.

"ఇప్పుడు, రెడ్డి యాదో వస్తువు అంటాడే, ఏందది? "

"అది మన దగ్గర ఉంటే నీ కొడుకు బతుకుతాడు. వాడి దగ్గర ఉంటే నీ కొడుకు చస్తాడు"

"అసలు ఇదంతా ఏమిటి? అదెవత్తో చచ్చింది కదా? పోలీసు కేసు లేకుండా నేను చూసుకున్నా. వాళ్లేమన్నా మన మాదిరి గ్యాంగ్‌లు మెయింటైన్ చేసే మనుషులా అంటే కాదు. వాళ్ల నుంచి నాకేం భయం? నా పిలకాయకేంది భయం? " విసుగ్గా అన్నాడు ఎలగప్ప.

కుర్చీలో నుంచి లేచాడు కురుప్పు.

కేశవరెడ్డి కూడా లేచి అతని భుజంపై చేయివేసి "కురుప్పు కొంచెం ఉండు. కూర్చో" అన్నాడు.

"ఏంది బావా? కురుప్పు శక్తి నాకు తెలుసు. నువ్వు తొందరపడితే ఎట్లా? " అన్నాడు కేశవరెడ్డి.

"నువ్వు చూసావప్పా, నీకు తెలుసు కురుప్పు శక్తి. నేను చూడలా" అన్నాడు ఎలగప్ప కూర్చోమని సైగచేస్తూ.

అప్పుడు కూర్చున్నాడు కురుప్పు.

అప్పటివరకు తీయని నల్ల కళ్లద్దాలను తీసి ఎదురుగా ఉన్న టేబుల్‌పైన పెట్టాడు. కళ్లు ఎత్తి ఎలగప్పని చూసాడు.

ఎలగప్ప ఎందరినో తనే చంపాడు, మరెందరినో చంపించాడు. కాని ఏనాడు భయపడలేదు. కురుప్పు కళ్ళల్లోకి చూసి మొదటిసారి భయపడ్డాడు.

ఆ కళ్లు అతని గుండెలను చీల్చుతున్న ఈటెల్లా ఉన్నాయి. నీలం రంగులో మెరుస్తూ మెస్మరైజ్ చేస్తున్నట్లున్నాయి. కురుప్పు ఒక మనిషి కాదని కొన్ని దుష్టాత్మల సమూహమనీ ఒక నిర్హేతుకమైన భావన మదిలో మెదిలింది. అతని ఆలోచనలను చదువుతున్నట్లు ఉన్నాయి కురుప్పు చూపులు.

"అటు చూడు" ఎలగప్ప వైపునుంచి చూపు తిప్పకుండా తన చేతిని పక్కన ఉన్న గోడవైపు చాచాడు. ఎప్పుడు వచ్చిందో అతని చేతిలో ఒక మంత్ర దండం కనిపించింది. అది చూపిన వైపు చూసిన ఎలగప్ప తెల్లటి గోడపై కనిపిస్తున్న దృశ్యాన్ని చూసి ప్రాన్పడిపోయాడు. హాస్పటల్‌లో ఒక బెడ్‌పైనున్న పేషెంట్ చిత్రం కనిపించింది. సినిమా చూసినట్లు అక్కడి దృశ్యం కనిపిస్తుంటే

## కొత్తగాలి... 

**మత్తులో ఉంటారు**
**తాగినవారు**
**అధికారంలో ఉన్నవారు**

– మోపూరు రామశేషు,
హైదరాబాద్

## తలొంచాల్సిందే

శాస్త్రిగారు, పాకిస్తాన్ అధ్యక్షుడు ఆయూబ్ ఖాన్‌తో చర్చలకు తాష్కెంట్ వెళ్ళారు. అప్పుడు విలేకరులు 'శాస్త్రిగారూ! ఆయూబ్



ఖాన్ పొడవైనవారు. మీరు చూస్తే పొట్టి వారు.. ఎలా? ' అన్నారు.

'కావొచ్చు! అందువల్ల నాకొక సదుపాయం ఉంది. నేను ఇతరులతో మాట్లాడేటప్పుడు తలెత్తి మాట్లాడుతాను. నాతో మాట్లాడేవారు తలలు దించుకుని మాట్లాడక తప్పదు!' అన్నారు శాస్త్రీజీ నవ్వుతూ.

ఆశ్చర్యపోయాడు. ఆ పేషంట్‌కి శరీరంపై చాలాచోట్ల వైర్లు కనబడుతున్నాయి. అవి అక్కడ ఉన్న మానిటర్‌లకు కనెక్ట్ చేసి ఉన్నాయి. ముక్కుకి ఆక్సిజన్ మాస్క్ ఉంది. వెంటిలేటర్ కనెక్ట్ చేసి ఉంది.

"ఎవరతను? " మెల్లగా అడిగాడు ఎలగప్ప కురుప్పువైపు తిరిగి.

కురుప్పు దృష్టి మరల్చకుండా అతన్నే చూస్తూ అన్నాడు.

"నీ కొడుకు బలి అవ్వాల్సిన శక్తికి ఇతన్ని బలి పెడుతున్నా. రెండు ప్రాణాలు బలి కావల్సింది అన్నాను. ఒకటి అయిపోయింది. ఇది రెండోది. వాళ్లు శాంతి చేశారు. అందుకే ఇతను ఇంకా వేలాడుతున్నాడు చావుకి, బ్రతుక్కి మధ్య" గొంతులో కసి వినిపించింది.

అది కురుప్పు స్వరమేనా లేక అతన్ని ఆధారంగా చేసుకుని మానవ మనుగడ సాగిస్తున్న పైశాచిక శక్తి గొంతా అని ఎలగప్పకి అనుమానం వచ్చింది.

"మరి అతను చావడా? " అడిగాడు కదులుతున్న పేషెంట్ దేహాన్ని చూస్తూ.

కురుప్పు చేతిలోని మంత్రదండం ఒకసారి ఉగ్రంగా ఊగింది. రాంబాబు శరీరం అచేతనంగా మారిపోయింది.

"ఆ కళ్ళద్దాలు పెట్టుకో" అభ్యర్థనగా అడిగాడు ఎలగప్ప.

అభావంగా టేబుల్ మీది కళ్ళజోడు తీసి పెట్టుకున్నాడు కురుప్పు. అతని చేతిలో మంత్రదండం లేకపోవడం గమనించాడు ఎలగప్ప.

"నేను కూడా నీ శక్తిని చూసాను. ఇప్పుడు చెప్పు ఏమి చేయాలి" అన్నాడు ఎలగప్ప.

"నేను చెప్పిన మనిషి ఒక వస్తువు కోసం వెతుకుతున్నాడు. విచిత్రమేమిటంటే, దాన్ని వెతుకుతున్న విషయం అతనికి కూడా తెలియదు" అన్నాడు కురుప్పు.

అటువంటి మాట మరెప్పుడైనా విని ఉంటే గట్టిగా నవ్వేవాడు ఎలగప్ప. అదే మాట మరెవరి నోటి వెంటన్నా వచ్చివుంటే తన మూడ్‌ని బట్టి చంపటమో, చితక బాదటమో చేసేవాడు. కాని ఇప్పుడు అలా చేయటానికి సాహసించలేకపోయాడు. ఏమీ అర్థం కానట్టు అయోమయంగా చూసాడు.

"అతను వెతుకుతున్నది మహా భైరవ విగ్రహం.. అది సామాన్యమైనది కాదు. దాన్ని ఒక మహర్షి కొన్నివేల ఏళ్ల కిందట చేసాడు. అది ఒకప్పుడు ఆ పండితుడి చేత పూజలు అందుకుంది. ఇప్పుడు పూజ పునస్కారం లేకుండా ఎక్కడో అజ్ఞాతంగా పడుంది. ఈ జన్మలో మళ్లీ అతన్ని చేరాలని చూస్తున్నది"

కేశవరెడ్డి, ఎలగప్పలు కుతూహలంగా వింటున్నారు. ఆ మహాభైరవ విగ్రహానికి రుద్రప్ప ప్రాణానికి ఏమిటి లింకు అని

ఆలోచిస్తున్నారు. కురుప్పుకి వారి ఆలోచనలు స్పష్టంగా తెలిసిపోతున్నాయి.

"ఆ మహాభైరవ విగ్రహం అతని చేతికి వస్తే అతనికి గతజన్మలో ఉన్న శక్తులు మళ్ళీ వస్తాయి. గిరిజ చావు తర్వాత వాళ్ల వంశంలో జరిగిన చావులు ఎలా జరిగాయో తెలుస్తుంది. ఇకపై అతని వంశంలో జరగబోయే మరి మూడు చావులను ఆపగలుగుతాడు. అలా ఆపితే ఆ మహాభైరవుడు గిరిజ చావు తర్వాత అసలు మరణించాల్సిన వారెవరో వాళ్ళను బలి తీసుకుంటాడు" అన్నాడు కురుప్పు.

"అది రుద్రప్పేగా" అన్నాడు కేశవరెడ్డి.

అంతవరకు ఎటువంటి భావం పలకని కురుప్పు మొఖంలో ఒక అట్టహాసం ఉద్భవించింది. మిగిలిన ఇద్దరు ఉలిక్కిపడ్డారు.

"చావాల్సింది ఒకరు కాదు ముగ్గురు. నీ కొడుకుతోపాటు మీ ఇద్దరూ కూడా చస్తారు దారుణంగా" అన్నాడు కురుప్పు. ఆఖరి మాటను ఒత్తి పలుకుతూ.

ఆ ఏ.సి. రూమ్‌లో వారిద్దరికీ ఒళ్ళంతా చెమటలు పట్టేసాయ్.

★ ★ ★

సాయంత్రం రాంబాబు దగ్గరికి ఒక్కరినే వెళ్ళనిచ్చారు ఐసియు స్టాఫ్. సదాశివం లోపలికి వెళ్ళాడు. రాంబాబు అతన్ని చూసి గుర్తుపట్టాడు.

బాబాయ్‌ని పలకరించడానికి ప్రయత్నించి వల్లకాక కన్నీరు పెట్టుకున్నాడు. అది చూసి సదాశివం చలించిపోయాడు. "నీకేం కాదురా. భయపడకు" అన్నాడు.

జేబులో వున్న సంచీతీసి ఉదకశాంతి చేసిన జలాన్ని కాస్త రాంబాబుపై చల్లాడు. తీర్థం నోట్లో వెయ్యాలని చూశాడు కాని హాస్పటల్ స్టాఫ్ అప్పటికే అతను నీరు జల్లడం చూసి, "ఇన్‌ఫెక్షన్ వస్తుంది" అని వారించారు.

రాత్రి డ్యూటీ డాక్టర్‌తో మాట్లాడుదామని వెళ్ళాడు కేశవమూర్తి. అతను భోజనం చేయలేదు. సదాశివం బలవంతం మీద రెండుసార్లు టీ తాగాడు.

సదాశివం ఐసియు ఎదురుగా ఉన్న లాంజ్‌లో కూర్చున్నాడు. లోపలినుంచి నర్స్ హడావుడిగా పరిగెత్తుకుంటూ ఐసియు పక్కన ఉన్న డ్యూటీ డాక్టర్ రూమ్‌లోకి వెళ్ళటంచూసి అలర్ట్ అయ్యాడు. లేచి నుంచుని చూస్తుండగా డ్యూటీ డాక్టర్ హడావుడిగా ఐసియులోకి వెళ్లాడు. వెనకగా కేశవమూర్తి వచ్చాడు.

"ఏమైంది? " అడిగాడు సదాశివం.

"ఏమో, నర్స్ వచ్చి 'డాక్టర్ ఎమెర్జెన్సీ' అంది. డాక్టర్‌గారు వెంటనే పరిగెత్తారు" అన్నాడు.

"సరేలే, మనోడి గురించి ఏమన్నారు? "

"పక్కటెముకలకు దెబ్బ బాగా తాకిందట. తలకు రోడ్డు తగలటం వలన దెబ్బ తగిలిందట. అయితే తలకు తగిలిన దెబ్బ అంత ప్రమాదకారి కాదట. మొత్తంమీద ఫిఫ్టీ, ఫిఫ్టీ ఛాన్స్ అంటున్నాడు"

"పోనీలే భగవంతుడున్నాడు. మనవాడికి ఏమీ ఫరవాలేదు. మరి వెంటిలేటర్ ఎందుకు పెట్టారో అడిగావా? "

"ఏదీ, మధ్యలో నర్స్ వచ్చి తీసుకెళ్ళింది కదా. మళ్ళీ వచ్చాక అడుగుదాం" అన్నాడు కేశవమూర్తి. డాక్టర్తో మాట్లాడేక కాస్త

### కొత్తగాలి...



అరు నూరైనప్పుడు
నూరు ఆరుకాక తప్పదు
నింగికెగసిన పతంగం
నేలకూలక తప్పదు

– వి.రాఘవేంద్రరావు, హైదరాబాద్

ధైర్యం వచ్చినట్లుంది. దానితోపాటు శరీర ధర్మాలు మళ్ళీ మొదలయ్యాయి.

"ఒరే ఆకలిగా ఉందిరా, కిందకెళ్ళి ఏమైనా తిని వద్దాం" అన్నాడు.

"పద వెళ్దాం" అన్నాడు సదాశివం. పాపం అన్నయ్య ఎంత టెన్షన్ పడుతున్నాడో అనుకున్నాడు మనసులో. వదిన ఈపాటికి ఏర్‌పోర్ట్‌కి వచ్చేసి ఉంటుంది. ఇంకో గంటలో ఇక్కడకు వచ్చేయవచ్చు. ఆవిడ వచ్చాక ఎలా చెప్పాలో అని ఆలోచించుకుంటూ కాంటీన్ వైపు వెళ్ళాడు.

వాళ్ళు కిందకు వెళ్తున్న సమయానికి ఐసియులో రాంబాబు బెడ్ దగ్గర డాక్టర్, ఇద్దరు నర్స్‌లు హడావుడిగా ఉన్నారు. నర్స్ ఏవో ఇంజెక్షన్‌లు ఇచ్చింది. డాక్టర్ గుండెలపై షాక్ ఇచ్చి చూసాడు. బిపి బాగా పడిపోయింది, రాంబాబు గుండె రెస్పాండ్ కావటంలేదు.

"ఏమైంది, ఇప్పటివరకు బాగానే ఉన్నాడు కదా? " పక్కనే ఉన్న నర్స్‌కి మాత్రమే వినిపించేలా అడిగేడు డాక్టర్.

"నాకేమి తెలియదు డాక్టర్. సడన్‌గా ఒక జెర్క్‌లా వచ్చింది బాడీలో. చూస్తే హార్ట్‌బీట్ లేదు. వెంటనే మీకు చెప్పాను"

"సరే, ఇక మనమేమీ చేయలేము. హి ఈజ్ గాన్. వెళ్ళి చీఫ్‌తో మాట్లాడుతా. నువ్వు ఎక్విప్‌మెంట్ అలానే ఉంచు" అని మొబైల్ తీసి చీఫ్‌కి రింగ్ చేసి ఫోన్ చెవి దగ్గర పెట్టుకుని బయటకు నడిచాడు.

కాంటీన్ కట్టేసి ఉండటం చూసి, "పోనీ బయటకు వెళ్ళి ఏమైనా తిందాం రా" అన్నాడు సదాశివం.

"ఒద్దులేరా, మీ వదిన వచ్చే వేళయింది. ఇక్కడ మనం కనబడకపోతే టెన్షన్ పడుతుంది" అన్నాడు కేశవమూర్తి.

వాళ్ళు వెనక్కి తిరిగి ఐసియువైపు వెళ్తుంటే చంద్రం కనిపించాడు. చేతిలో ఫ్లాస్క్ ఉంది. "పెదనాన్నా, కాఫీ తీసుకుంటారా? " అన్నాడు.

"ఇవ్వరా, అసలు పెదనాన్నకి టిఫిన్ పెట్టిద్దామనుకుంటే కాంటీన్ కట్టేశాడు" అని ఫ్లాస్క్ అందుకుని ప్లాస్టిక్ కప్పుల్లో కాఫీ పోసి ఇచ్చాడు సదాశివం. తనూ ఒక కప్పు పోసుకున్నాడు. కాఫీ తాగుతుండగా, రాంబాబు తల్లి, లక్ష్మి హాస్పటల్‌లోకి వస్తూ కనిపించింది. కాఫీ తాగుతున్న అన్నదమ్ములను చూసి పరిస్థితి అంత టెన్షన్‌గా లేదని అనుకుంది.

"అత్తయ్యకు ఎలా ఉంది? రాంబాబు ఏడి? " అని అడిగింది.

ఏమి చెప్పాలో తెలియక తడుముకుంటున్న కేశవమూర్తిని ఊరుకోమని సైగ చేసి "వదినా నువ్వు కంగారుపడకు, రాంబాబుకి చిన్న యాక్సిడెంట్ అయింది" అన్నాడు సదాశివం.

"ఏమైంది? వెంటనే చూడాలి. ఏమండీ, నన్ను బాబు దగ్గరకు తీసుకెళ్ళండి" అంటూ ఏడుపు మొదలుపెట్టింది లక్ష్మి.

"ఊరుకో, ఏమీ కాలేదు" అని సముదాయిస్తూ ఆమెను పొదివి పట్టుకుని జాగ్రత్తగా ఐసియు దగ్గరకు తీసుకువెళ్ళాడు కేశవమూర్తి. ఐ.సి.యు దగ్గర డ్యూటీ డాక్టర్, వీరి కోసం బయట వెయిట్ చేస్తున్నాడు.

"డాక్టర్, మా వదిన..." అని చెప్పబోతున్న సదాశివాన్ని పట్టించుకోకుండా, "సారీ, కేశవమూర్తి గారూ, వి ట్రైడ్ అవర్ బెస్ట్, బట్ వి లాస్ట్ హిమ్" అన్నాడు.

ఆ మాటలు ఆ తల్లిదండ్రుల చెవుల్లో పిడుగుల్లా దూరాయి.

రెండు నెలల కిందట కూతురుని పోగొట్టుకున్న సదాశివానికి ఆ రంపపు కోత ఎలా ఉంటుందో తెలుసు.

★ ★ ★

కురుప్పు మాటలు విన్న తర్వాత కలిగిన భయాందోళనలు అదుపు చేసుకోవడానికి ప్రయత్నిస్తూ "రెడ్డీ, కొంచెం మందు

పొయ్యి" అన్నాడు ఎలగప్ప.

వణుకుతున్న చేతులను స్వాధీనపరుచుకోవడానికి విఫలయత్నం చేస్తూ టేబుల్‌పై ఉన్న బాటిల్ ఎత్తి గ్లాసుల్లోకి ఒంపాడు కేశవరెడ్డి.

"కురుప్పు, ఆ పండితుడి ఆచూకి చెప్పు. వాడిని లేపేస్తే పనైపోతుంది" అన్నాడు ఎలగప్ప తన గ్లాసు అందుకుంటూ.

మొదటిసారి కొంచెం తడబడ్డాడు కురుప్పు. గ్లాసులోని మందును ఒక్కసారి గొంతులోకి ఒంపుకున్నాడు.

ఎలగప్ప కురుప్పును చూస్తూ తన గ్లాసులోని ద్రవాన్ని కొంచెం చప్పరించాడు.

కేశవరెడ్డి ఒక పాకెట్ ఓపెన్‌చేసి ఫ్రైడ్ చికెన్ ఒక ప్లేట్‌లో సర్దాడు.

"అతని ఆచూకి తెలుసుకోవడానికి కొన్ని చిక్కులున్నాయి. నీ మనుషుల ద్వారా ఆ పని చేయించు. ఆచూకి తెలిసాక నాకు చెప్పు" అన్నాడు కురుప్పు ప్లేట్లోని చికెన్ ముక్క ఒకటి నోటిలో వేసుకుంటూ.

"కోపం తెచ్చుకోనంటే ఒక మాట అడుగుతా. ఇక్కడ కూర్చుని ఎక్కడో ఒకడిని చంపినవాడివి, నీకు అతని ఆచూకి తెలుసుకోవడం కష్టమా? " అడిగాడు, రెడ్డి కుతూహలంగా.

"వాడు మీరు చంపినదాని వంశస్థుడు కాదు, ఆమె ఆత్మద్వారా అతని ఆచూకి దొరకదు"

"సరే, వాడి వివరాలు చెప్పు"

"నువ్వే తెలుసుకో" అన్నాడు కురుప్పు, మరో చికెన్ ముక్క నములుతూ.

ఎలగప్ప, రెడ్డిని మందలిస్తూ, "ఏం రెడ్డీ, ఆ మాత్రం కనుక్కోలేవా? ఆ చచ్చినదాని ఇంటికి పోయి ఎంక్వయిరీ చేస్తే అంతా తెలిసిపోతుంది. దానికి కురుప్పునెందుకు ఇబ్బంది పెడతావు? మనుషుల్ని పెట్టు. ప్రతి సిటీలో ప్రైవేట్ డిటెక్టివ్‌లు బిజినెస్‌లు చేస్తుండట్లా" అన్నాడు పోయిన ఫాం తిరిగి తెచ్చుకుంటూ.

గట్టిగా నవ్వాడు కురుప్పు. ఈసారి ఆ నవ్వు వాళ్ళలో పైశాచికత్వాన్ని రెచ్చగొట్టింది. వాళ్ళు కూడా బిగ్గరగా నవ్వారు.

★ ★ ★

సూర్యానికి, మూర్తికి స్నేహం ఏర్పడింది. మూర్తితో ఉన్నంత చనువులేకపోయినా, నారాయణంటే సూర్యంకు గౌరవంతో కూడిన అభిమానం కలిగింది.

ఉజ్జయిని వచ్చినరోజే వారికి మహాకాళి ఆలయానికి ఎలా వెళ్ళాలో దారి చెప్పాడు సూర్యం. మిత్రులిద్దరూ మహాకాళి దర్శనానికి వెళ్ళారు. ఉజ్జయిని ప్రజలు ఆ గుడిని గడ్ కాళి లేదా గర్ కాళి మందిరంగా వ్యవహరిస్తారు.

ప్రతి పన్నెండేళ్లకు అక్కడి క్షిప్ర నదికి కుంభమేళా జరుగుతుంది. భారతదేశంలో కుంభమేళాలు హరిద్వార్, నాసిక్, ప్రయాగ్, ఉజ్జయినిలలో మాత్రమే జరుగుతాయి. అప్పుడు ఎక్కడెక్కడి నుంచో సాధు సత్పురుషులు, తాంత్రికులు, అఘోరాలు, నాగా సాధువులు, ఇంకా ఎందరెందరో వస్తారు. అక్కడ చాలామంది తాంత్రిక విద్యలను సాధన చేసే ఔత్సాహికులు, సాధనలో ముందుకు వెళ్ళిన సాధకులు, గురుస్థానంలో ఉండదగ్గ సిద్ధులు ఉంటారు. చాలామంది ప్రచ్ఛన్నంగా

కొత్తగాలి...

**కప్పలు**
**బిత్తర పోయాయి**
**రోజుకోపార్టీ మారే**
**నాయకుల్ని చూసి..!**

– తులసీరాం, హైదరాబాద్

ఉంటారు.

నారాయణ ఆలయంలో ప్రతిచోట ప్రతి వ్యక్తిని గమనిస్తూ తిరిగాడు. కాని అసలు, నకిలీ తేల్చి చెప్పడం అంత తేలిక కాదు. వేషభాషలతో ఆకట్టుకుని కనికట్టు చేసే వారు, గారడీలు చేసేవారు కూడా సిద్ధుల్లా ప్రకటించుకుని మోసం చేస్తారు. ఉదర పోషణార్థం బహుకృత వేషం అన్నట్లు.

కోయదొర చెప్పినట్లుగా ఉజ్జయిని మహాకాళి తనకు ఏదో చెప్తుందని ఎదురు చూసాడు. అయితే ఆమె వాక్కు తనకు ఎలా చేరుతుంది? ఎవరి ద్వారా చేరుతుంది అనే ఆలోచనలతో సతమతమయ్యాడు. అతని మనసులో మాత్రం అతన్ని ఏదో వేధిస్తూనే ఉంది.

మధ్యప్రదేశ్‌లోని మాల్వా ప్రాంతంలో ఉజ్జయిని ఉంది. మహాభారతకాలంలో ఇది అవంతీ రాజ్యానికి రాజధాని. ఇది అష్టాదశ శక్తిపీఠాలలో ఒకటి. ద్వాదశ జ్యోతిర్లింగాలలో ఒకటైన మహాకాళేశ్వరుడు కూడా ఇక్కడే కొలువై ఉన్నాడు.

భారతదేశంలోని ముక్తిప్రదాయకమైన ఏడు ముఖ్యమైన ఆధ్యాత్మిక ప్రాముఖ్యత గల పుణ్యక్షేత్రాలలో ఉజ్జయిని ఒకటి. ద్వాపరయుగంలో శ్రీకృష్ణుడు బలరామ, సుదాములతో కలిసి విద్యార్జన చేసిన సాందీపముని ఆశ్రమం ఇక్కడే ఉంది. అక్కడ పూజారి నిరంతరం "రాధే శ్యామ్" అని జపిస్తూన్నాడు. చదువులో వెనకబడిన పిల్లలకు అక్కడ 'పట్టి పూజ' చేస్తారు. ఆ పూజలో పలక, బలపం పెట్టి పిల్లలకు శ్రీకృష్ణుని ఆశీర్వచనం అందిస్తారు.

అక్కడ నుంచి మంగళ్‌నాథ్ ఆలయానికి వెళ్ళారు. పురాణకాలంలో శివుడు అంధకాసురునితో యుద్ధం చేసినప్పుడు ఆ గుడి ఇప్పుడున్నచోట ఒక శివలింగం పడిందట. మంగళ గ్రహం యుద్ధాలకు అధిపతి. ఆ మంగళనాథుడు అప్పుడు ఆ యుద్ధరంగంలో ఉద్భవించాడని ప్రతీతి. కుజదోషం ఉన్నవారు ఇక్కడ పెరుగన్నం నైవేద్యంగా పెట్టి మంగళ గ్రహ దోషనివారణ చేసుకుంటారు. పిల్లలు లేని దంపతులు ఎడమచేతి వాటం స్వస్తిక్‌ని పూజిస్తారు. వాళ్ళ కోరిక తీరి సంతానం కలిగిన తర్వాత మళ్ళీ అక్కడకు వచ్చి కుడిచేతివాటం స్వస్తిక్‌ని పూజిస్తారు.

ఉజ్జయినిలో ఏడు గుండాలు ఉన్నాయి. అందులో కోటితీర్థ్, మహాకాళి ఆలయంలో ఉంది. వాళ్ళిద్దరూ మహాకాళేశ్వరుని కూడా దర్శించుకున్నారు. ఇక్కడ శివుడు దక్షిణ దిక్కుని చూస్తూ ఉంటాడు. అందుకే తాంత్రిక సాధకులకు ఇది చాలా ముఖ్యమైన క్షేత్రం. తర్వాత బసకు వెళ్లిపోయి భోజనం చేసి విశ్రాంతి తీసుకున్నారు.

శివునికి భస్మహారతి ఇచ్చేటప్పుడు, చితా భస్మాన్ని వినియోగిస్తారని అంటుంటారు. మూర్తికి అదే సందేహం కలిగింది. అది నిజమో కాదా తెలుసుకోవాలని బసకు వెళ్ళాక సూర్యాన్ని అడిగాడు.

"సూర్యం, శవాలను కాల్చితే వచ్చిన బూడిద వినియోగించి భస్మహారతి ఇస్తారట నిజమా? "

"పూర్వకాలంలో శివుని అర్చించటానికి అలా చేసేవారేమో తెలియదు గాని ఒకసారి ఈ విషయంపై పండితుల చర్చ జరిగిందట ఉజ్జయినిలో. గాంధీచితి నుంచి సేకరించిన బూడిదను తెచ్చి భస్మహారతి చేయమని ఇస్తే, ఇక్కడ పూజారులు తిరస్కరించారట. శవాలను దహనం చేయగా వచ్చే భస్మాన్ని తాము వాడబోమని చెప్పారట. ఆవుపేడను ఎండబెట్టి కాల్చగా వచ్చిన బూడిదనే భస్మ హారతికి వినియోగిస్తున్నారు" అన్నారు సూర్యం.

మరునాడు ఊరు చూడటానికి వెళ్ళారు. ఆ ఊరిలో చూడవలసిన ప్రాంతాలు ఏమిటి అని మూర్తి ముందే కనుక్కుని

ఉంచుకున్నాడు.

పురాణ ప్రసిద్ధి చెందిన విక్రమాదిత్యుడు ఉజ్జయిని రాజధానిగా రాజ్యమేలాడు. ఆయన ఆస్థానంలో 'నవరత్నాల' పేరిట వివిధ రంగాలలో ప్రసిద్ధులైన ధన్వంతరి, క్షపణక, అమరసింహ, శంకు, భేతాల భట్ట, ఘటఖర్పర, వరాహమిహిర, వర రుచి, కాళిదాసులు ఉండేవారు.

భర్తృహరి కాళిదాసుకి సమకాలీనుడు. ఉజ్జయినిలో భర్తృహరి గుహలు ఉన్నాయి. నాథ సంప్రదాయం అనుసరించేవారికి ఇది దర్శనీయ స్థలం అని అంటారు. మత్స్యేంద్రనాథుని శిష్యుడు గోరక్షనాథుడు. ఆయన శిష్యుడు భర్తృహరి. ఈ గుహలకు దగ్గరలోనే మత్స్యేంద్రనాథుని సమాధి ఉంది.

కాళిదాసు అర్చించిన మహాకాళి ఆలయం కూడా ఉంది. ఇంకా చిన్న చిన్న ఆలయాలు, కొత్తగా కట్టిన ఆలయాలు చాలా ఉన్నాయి. కొత్తవాటిలో చార్ ధామ్ ఆలయంలో ఉత్తర భారతదేశంలో బాగా ప్రాచుర్యంలో ఉన్న నాలుగు ముఖ్యక్షేత్రాలలోని మూర్తులను పోలిన విగ్రహాలను ప్రతిష్ఠ చేసారు. బదరీ, కేదార్, పూరీ, ద్వారకలను కలిపి చార్‌ధామ్ అంటారు.

కుంభమేళా సమయంలో నాగా సాధువులు వచ్చి బసచేసే చోటుని 'దత్త అఖాడ' అంటారు.

ఇవిగాక ఇంకో ముఖ్యమైన ఆలయం ఒకటి ఉంది. అదే కాలభైరవుని ఆలయం. కోటలాంటి కట్టడంలో ఈ ఆలయం ఉంటుంది. ఇక్కడి ఆచారం ప్రకారం భక్తులు కాలభైరవునికి సారాయి సమర్పిస్తారు. భక్తులు సమర్పించిన సారాయిని ఒక ప్లేట్‌లో పోసి విగ్రహం నోటి దగ్గర పెడతారు పూజారులు. చూస్తుండగానే ఆ ప్లేట్లోని సారాయి మెల్లమెల్లగా తగ్గిపోతుంది. కాలభైరవుడు ఆ సారాయిని తాగేస్తాడంటారు భక్తులు. పర్వదినాల్లో మద్యం లెక్కలేనంతగా ఆ విగ్రహానికి పానం చేయిస్తారు. కాలభైరవుని వాహనం శునకం, గర్భగుడిలోని మూలవిగ్రహం ఎదురుగా ఒక శునక విగ్రహం కూడా ఉంటుంది. అంతేగాక ఆలయంలో కూడా కుక్కలు యథేచ్ఛగా తిరుగుతుంటాయి.

నారాయణ, మూర్తి అన్ని ప్రదేశాలు తిరిగారు. కాలభైరవ ఆలయంలో సారాయిని ప్రసాదంగా ఇస్తుంటే తీసుకోవడానికి మూర్తి సంకోచించాడు. నారాయణ మాత్రం ద్వంద్వాతీతుడిలా ఆ తీర్థాన్ని భక్తితో సేవించాడు.

గుడిలో ఒక పక్కన కూర్చున్నప్పుడు మూర్తి అన్నాడు, "వాళ్ళిచ్చిన తీర్థం

## నా ఎత్తు నయాపైసా!

ఆ సంవత్సరం ప్రభుత్వం కొత్త నాణాలు విడుదల చేసింది. ఒక సభలో కొందరు ప్రముఖులు వాటి గురించి మాట్లాడుతున్నారు. అప్పుడు లాల్ బహదూర్ శాస్త్రి కూడా అక్కడే వున్నారు. అందరూ కొత్త నాణాలపై



తమ అభిప్రాయాలను చెబుతున్నారు. ఒకాయన శాస్త్రిని 'ఈ కొత్త నాణాలపై మీ అభిప్రాయం ఏమిటి?' అని ప్రశ్నించాడు.

'నాకీ నాణాలన్నీ నచ్చాయి. ముఖ్యంగా నయాపైస నాణెం!' అన్నారు శాస్త్రి.

'ఆ నాణెం ఎందుకంత ఇష్టం?' అడిగాడాయన.

'ఎందుకంటే మనుషుల్లో నా ఎత్తు ఎలాంటిదో నాణాల్లో దాని ఎత్తు అలాంటిది' అన్నారు శాస్త్రిగారు చలోక్తి విసురుతూ.

ఏమిటో తెలిసే తీసుకున్నావా? "

నారాయణ నవ్వాడు. "మనం ఏ క్షేత్రాన్ని దర్శిస్తామో అక్కడి ఆచారాలను గౌరవించాలని శాస్త్రం. ఒక్కొక్కచోట ఒక్కో విచిత్రమైన పద్ధతి ఉండవచ్చు. అక్కడి ఆచారాలలో మనకు అర్థంకాని విషయాలు ఉన్నా అవి పాటించటం వలన మనకు అక్కడి దైవం అనుగ్రహం కలుగుతుంది. అయితే ఇష్టం లేకపోతే చేయక్కరలేదు. కాని విమర్శించకూడదు. నా వరకు నేను ఆ పదార్థం ఏమిటి అన్న దానికంటే అది తీర్థం అన్నదానికి విలువ ఇచ్చాను" అన్నాడు.

మూర్తి అర్థం అయినట్లు తల ఊపాడు.

కొంచెంసేపు మౌనంగా ఉన్నాడు నారాయణ. తర్వాత అక్కడ నుంచి లేస్తూ, "ఎందుకో ఈ ప్రదేశం నాకు బాగా పరిచయమైనదిగా అనిపిస్తోంది" అన్నాడు.

మూర్తి విచిత్రంగా చూశాడు అతనివైపు.

## 5



**ము**చికుందు యోగిని కలుసుకోవడం తన జీవితంలో మరపురాని ఘటనవుతుందని నారాయణ ఊహించలేదు.

సూర్యం ఉజ్జయినిలో తనకు తెలిసిన యోగులలో ముచికుందు యోగి అతి ముఖ్యమైన వ్యక్తిగా చెప్పినమీదట అతన్ని చూడటానికి అంత ప్రయాసపడి వెళ్ళారు ముగ్గురూ. ఆ ముచికుందు యోగి ఉండే కొండపైకి దారికూడా సరిగా లేదు. చిన్న చిన్న ముళ్ళపొదలతో, ఎత్తు పల్లాలతో అగమ్యగోచరంగా ఉంది.

"అసలు ఈ కొండపై ఏమి చేస్తాడు ఆయన? కింద ఏ గుడిలోనన్నా ఉంటే అందరికీ అందుబాటులో ఉండొచ్చుగా? నాలుగు మంచి మాటలు చెప్తే విన్నవాళ్ళకు ఉపయోగం, ఈ యోగికి పుణ్యం" ఆయాసపడుతూ అన్నాడు మూర్తి.

నగర జీవనంలో నడక తక్కువైపోవటం వలన కొండ ఎక్కలేకపోతూ చిరాకుగా ఉంది అతనికి.

"గుడుల్లో కూర్చుని పురాణాలు చెప్పే వాళ్ళు ఎంతమంది లేరు? కాలక్షేపం బఠానీల్లాంటి కబుర్లు ఎన్ని వింటే మనుషులు మారతారు. మా మావయ్య అనేవాడు 'ఒరే టైమ్‌పాస్ చేయాలని చూడకురా, అది ఎలాగూ పాస్ అవుతుంది. చదవకపోతే నువ్వు ఫెయిల్ అవుతావు' అని. విన్నానా? లేదే" అన్నాడు సూర్యం.

"ఆయన ఒక్కడే ఇక్కడ ఏం చేస్తుంటారు? ఒంటరిగా ఏమైనా తపస్సు లాంటిది చేస్తారా? " కుతూహలంగా అడిగాడు నారాయణ.

"తపస్సు అంటే మీరు చందమామ కథల్లో చదివిన తపస్సు లాంటిది కాదు. కాని ఆయన తపస్సు ఆయన చేస్తారు. అంతా తను చూస్తూ ఎవరూ తనను చూడని భగవంతుడిలా ఆయన కూడా అందరినీ చూస్తుంటారు" అన్నాడు.

"భలే కోతలు కోస్తున్నావే. ఆయనకు దేవునికి పోలికా? ఆయన ఎక్కడో ఉండి మనలను చూస్తున్నాడా? భలే వినిపిస్తున్నావే" అన్నాడు మూర్తి. ఏవో భ్రమలు కల్పించి సూర్యం తమను ఉత్సాహపరచాలని చూస్తున్నాడని అతని సందేహం.

అతనివైపు ఒకసారిచూసి ఏదో అనబోయి, ఆగిపోయాడు సూర్యం.

"ఆధునిక శాస్త్రవేత్తలు పరిశోధనలు చేస్తుంటారే, అటువంటివి చేస్తుంటాడు. పదార్థాలను ఒకదాని నుంచి మరొక దానిగా మార్చడం వంటివి" అన్నాడు నారాయణవైపు చూస్తూ.

కిందపడున్న ఎండిన రేగుపండు తీసి "దీన్ని తాజా ద్రాక్షపండుగా మారుస్తాడా? " అన్నాడు మూర్తి వెటకారంగా.

పొద్దున్నే కప్పు కాఫీ ఇచ్చి, "ఎండెక్కకుండా వెళ్తే బాగుంటుంది పదండి" అని తొందరపెట్టాడు. టిఫిన్లో అంటే, 'తినేసి బయల్దేరితే కొండ ఎక్కలేం. అక్కడకు వెళ్లేక ఏమైనా తినొచ్చులే' అన్నాడు. పరిస్థితి చూస్తే కడుపు కాలేటట్లే ఉంది. అందుకే మూర్తికి తిక్క తిక్కగా ఉంది.

"నీళ్లు తాగుతావా? " అన్నాడు నారాయణ, మూర్తి పరిస్థితిని అర్థంచేసుకుని.

"పొయ్యి నాయనా, వెనకటికెవడో కాలే కడుపుకి గంజే పరమాన్నం అన్నాడట" అన్నాడు మూర్తి.

ఆపసోపాలు పడుతూ ఒక అరగంట నడిచి, ఒక చెట్టు కింద కూలబడి "ఇక నా వల్ల కాదు, మీరు మాట్లాడి రండి. నేను ఇక్కడే ఉంటాను. వచ్చేటప్పుడు తినడానికి ఏమైనా పట్టుకురండి" అన్నాడు మూర్తి.

"వచ్చేసాం. ఇక్కడ నుంచి పది నిముషాలే. ఎత్తు ఎక్కవలసిన పని కూడా లేదు. పద" అన్నాడు సూర్యం.

కొంచెంసేపు అక్కడే ఉండి, సణుక్కుంటూ లేచి నడవడం మొదలెట్టాడు మూర్తి. "బుద్ధి తక్కువై వీళ్ళ వెంట వచ్చాను. ఇంకెప్పుడూ ఇలాంటి తప్పు చేయను" మనసులో అనుకుంటున్నట్లు బిగ్గరగా అంటూ, ముందుకు సాగాడు.

సూర్యం చెప్పిన దానికంటే కొంచెం తొందరగానే ముచికుంద యోగి ఉండే ఆశ్రమం కనిపించింది. చిన్ని గుడిసెలా ఉంది. దాని చుట్టూ నేల చదును చేసి ఉంది. బయట ఒక నీళ్లతొట్టె ఉంది. సన్నగా తెల్లగా ఆకర్షణీయంగా ఉన్న యువకుడు కనిపించాడు. అతను హడావుడిగా లోనికి బయటకు తిరుగుతూ ఉన్నాడు. ఆశ్రమంవైపు వస్తున్న మిత్రులను చూసి పరుగున ఎదురెళ్లి, "రండి, రండి. స్వామి మీకోసం ఎదురు చూస్తున్నారు" అన్నాడు స్పష్టమైన తెలుగులో.

"ఏమిటీ స్వామి వారి దగ్గర మొబైల్ ఫోన్ ఉందా? " అన్నాడు మూర్తి.

అతని ప్రశ్నకు సమాధానం ఎవరూ చెప్పలేదు. నారాయణకు కూడా ఒక సందేహం వచ్చింది. 'ముచికుంద యోగి తెలుగువాడా? ' అని అనుకున్నాడు.

అతిథులను తీసుకుని వెళ్లి కాళ్లు కడుగుకోడానికి నీళ్లు, తుడుచుకోవటానికి తెల్లటి టవల్స్ ఇచ్చాడతను. తర్వాత లోపలికి తీసుకుని వెళ్లాడు. ఆ గుడిసెలో ఒకటే గది ఉంది. ఒక పక్కన చిన్న ట్రంకు పెట్టె, మరొకవైపు చిన్న చాపలు పరిచి ఉన్నాయి. ఒక చాపపైన ఎనభైయేళ్ల వృద్ధుడు కూర్చుని ఉన్నాడు. ముగ్గురు మిత్రులను ఎదురుగా ఉన్న చాపపై కూర్చోమన్నాడు.

అతని సన్నిధిలో చెప్పలేనంత ప్రశాంతంగా అనిపించింది. కొండ ఎక్కిన అలసట మచ్చుకైనా కనిపించలేదు. మూర్తికి తిక్క తిక్కగా అనిపించటం మానేసింది. నోరు తెరిచి మాట్లాడి అక్కడి ప్రశాంతతను చెడగొట్టాలనిపించలేదు. రెండు చేతులు జోడించి నమస్కరించారు ముగ్గురూ. ప్రతి నమస్కారం చేస్తూ, "మిమ్మల్ని కష్టపెట్టాను. నా అతిథ్యం స్వీకరించండి" అన్నాడాయన సరళమైన హిందీలో. అలా అని పక్కనే ఉన్న యువకునివైపు చూసాడు.

ఆ యువకుడు చకచకా తాజా ఆకులు పరిచి పక్కన ఉన్న గిన్నెలలో నుంచి వేడి

వేడి ఇడ్లీలు వడ్డించాడు. పక్కనే చట్నీ వేసాడు. గ్లాసులో మంచి నీరు తెచ్చి పెట్టాడు. ఆవిరి చిమ్ముతూ ఉన్న మల్లెపూ వుల్లాంటి ఇడ్లీలను చూసి 'వీటిపై ఇంత నెయ్యి వేసుకుని కారప్పొడితో తింటే ఉంటుంది మజా' అనుకున్నాడు మూర్తి. అంతలో గబగబా ఒక చిన్న గిన్నెలో కార ప్పొడి తెచ్చి అతని ఆకులో వేసాడు ఆ యువకుడు. తెల్లబోయి అతనివైపు చూసిన మూర్తి వైపు సమ్మోహనంగా నవ్వుతూ చూసి "తృప్తిగా తినండి" అంటూ ఇడ్లీలపై నెయ్యి వడ్డించాడు. ఆ ఇడ్లీలకంటే అతని నవ్వు చాలా నచ్చింది మూర్తికి. కడుపు నిండా తిన్నాడు.

టిఫిన్లు అయిన తర్వాత అందరికీ చిక్కటి కాఫీలు అందించాడు ఆ యువ కుడు. వారంతా కాఫీలు తాగేవరకు ఉండి అక్కడి గిన్నెలన్నీ ఒక సంచీలో వేసుకుని "వెళ్లొస్తాను గురువుగారు" అంటూ విన యంగా ఒంగి నమస్కరించి, అతిథులకు కూడా నమస్కరించి వెళ్లిపోయాడు.

అతను వెళ్లిన వైపే చూస్తూన్న మూర్తిని పిలిచి, "తృప్తిగా అయిందా?" అన్నాడు ముచికుందు యోగి హిందీలో.

మూర్తి "అయింది" అన్నాడు తెలుగులో సంతోషంగా.

"ఇవి తీసుకో" అని కొన్ని వక్క పలు కులు అతనికి ఇచ్చి, మిగిలిన ఇద్దరికీ కూడా ఇచ్చాడు ముచికుందు యోగి.

లేచి ఆ యువకునితో పాటు వెళ్లి మాటలు కలిపి స్నేహం చేయాలనిపి స్తోంది మూర్తికి. మాటి మాటికి అతని నవ్వు అయస్కాంతంలా లాగేస్తోంది. ముచికుందు యోగి ఇచ్చిన వక్క పలు కులు నోట్లో వేసుకున్నారు అందరూ.

"ఇప్పుడు చెప్పండి, నన్ను వెతుక్కుంటూ ఇంత దూరం ఎందుకొచ్చారో?" అన్నాడు ముచికుందు యోగి.

సంభాషణ ఎలా మొదలు పెట్టాలో తెలియక తికమక పడ్డాడు నారాయణ. అతనికి హిందీ మాట్లాడటం రాదు. కొంత వరకు అర్థం చేసుకోగలడు.

"భాష స్థూలమైంది. భావం సూక్ష్మ మైంది. నువ్వే భాషలో మాట్లాడినా ఫర వాలేదు. మనం దేహధారులం గనుక స్థూల సంభాషణ తప్పనిసరి" అన్నాడు ముచికుందు యోగి. పక్కనే ఉన్న మూర్తివైపు చూసి చిరునవ్వు నవ్వాడు. మూర్తికి వక్క పలుకులు తిన్న తర్వాత అంతకు ముందు కలిగిన మోహం తొలగి పోయింది. ఇప్పుడు ముచికుందు యోగి నవ్వితే ఎన్నో గోప్యమైన విషయాలు బట్ట బయలైనట్లైంది.

నారాయణ తన మనస్సులోని వేదనను మాటలలో వివరించాడు. 'పండు' చనిపో యిన తర్వాత నుంచి తనను ఒకచోట నిలవనీయకుండా చేస్తున్న ఎన్నో ఆలోచన లను చిన్నచిన్న మాటలతో చెప్పాడు. తను పండు మరణాన్ని ఆపగలిగి ఉండే వాడు కాదు. ఎందుకంటే చావు పుట్టుకలు దైవ నిర్ణయాలు. కాని అలా ఆపగలిగే శక్తి తనకుందని తన మనసు తనకు చెప్తుందని, అలా చేయగలిగి ఉండి కూడా నిర్లక్ష్యం చేశానని, తప్పు చేశానని, తన మనసు నిందిస్తున్నదని తెలియజేశాడు. పండు మరణం వెనక ఏదో బలవత్తర మైన కారణం ఉందని, దాన్ని అర్థం చేసు కోకపోతే మరోసారి తనను అదే కారణం బాధ పెట్టబోతున్నదని తన మనసు ఘోష పెడుతున్నదని చెప్పాడు.

"ఇంకా ఎన్నో చెప్పాలని ఉంది. కాని మీకన్నీ తెలుసని అనిపిస్తోంది. దయచేసి నాకు అంతా వివరంగా చెప్పమని ప్రార్థిస్తు న్నాను" అన్నాడు చేతులు జోడించి.

నారాయణ మనోవేదనను అతని మాట ల్లోనే విన్న మూర్తి, సూర్యం చలించిపో

యారు. బడబానలం లాంటి బాధను కడుపులో దాచుకుని మామూలుగా తిరగడానికి ఎంత ప్రయాస పడ్డాడు, అని బాధపడ్డారు. వారికి అంతవరకు తెలియని కొత్త నారాయణ కనిపించాడు.

నారాయణ చెప్పిన మాటలు విన్న ముచికుంద యోగి చాలాసేపు మౌనంగా ఉండిపోయాడు. ఆయన మనోనేత్రంలో ఎన్నో విషయాలు కదులుతున్నాయనిపించింది అక్కడ ఉన్న ముగ్గురికీ. ఒక్కమాట మాట్లాడకుండా ఆయన ముఖంలోకి చూస్తూ కూర్చున్నారు.

కొంచెంసేపటికి గొంతు సవరించుకుని, "నీవెవరివో నీకు తెలియదు. సమయం వచ్చినప్పుడు నేను తెలియజేస్తాను. అయితే నువ్వు అనుకుంటున్నది నిజం.

కొత్తగాలి...

**ప్రపంచం**
**దగ్గరౌతోంది**
**పక్షిల్లు**
**దూరమౌతోంది**

– ఆర్.ఎస్. హైమవతి, చెన్నై

'పండు' చావు సహజం కాదు. కల్పించబడింది. అలాగే మరొకటి జరిగింది. అదీ సహజం కాదు. నీకు నిజంగానే కొన్ని అపూర్వశక్తులు ఉన్నాయి. అవి నిగూఢంగా ఉన్నాయి. వాటిని నువ్వు పొందటానికి కొన్ని అవరోధాలున్నాయి. నువ్వు వాటిని పొందవలసిన అవసరం కూడా ఉంది. నిజానికి ఈ జన్మకు అదే నీ జీవిత పరమార్థం" అంటూ మొదలెట్టారు యోగి.

"వేల సంవత్సరాల క్రితం దక్షిణ భారత దేశంలో పద్దెనిమిది మంది మహాసిద్ధులు ఉండేవారు. వారిలో భోగనాథుడు ఒకరు. ఆయన గురువు 'కలంగి నాథుడు'. భోగనాథుడు స్వర్ణకారుల వంశంలో జన్మించాడు. ఆయన రసవాదంలో ప్రజ్ఞాపాటవాలుగల సిద్ధపురుషుడు. గురువుగారి ఆజ్ఞప్రకారం చైనా దేశానికి వెళ్ళాడు. అక్కడ 'లావో ట్సె' పేరుతో ప్రసిద్ధిచెందాడు. చైనాకు తాను స్వంతంగా నిర్మించుకున్న విమానంలో వెళ్ళాడు. ఆ దేశస్థులకు ఆయన రసవాదం నేర్పించాడు. విమానాలు తయారుచేయటం నేర్పించాడు. అక్కడ ఆయన ప్రచారం చేసిన సిద్ధాంతాలు నేటికీ 'టావోఇజమ్' పేరుతో అక్కడి ప్రజలు పాటిస్తున్నారు. ఆయన తిరిగి దక్షిణ భారతదేశానికి వచ్చి తన యాత్రా విశేషాలు, ఎన్నో రసవాద రహస్యాలు వివరిస్తూ ఏడువేల శ్లోకాల కావ్యం రచించి గురువుగారికి సమర్పించాడు. ఆ గ్రంథమే 'సప్తకాండం'.

లావో ట్సెగా చైనాలో ఉన్నప్పుడే భోగనాథుడు సృష్టిలోని ద్వంద్వత్వం గురించి అక్కడివారికి విశదీకరించాడు. అంతకుముందు ఆ దేశంలో ప్రసక్తిలేని 'యిన్', 'యాంగ్' అనే శక్తులను గురించి లావో ట్సె చెప్పాడు. అందులో 'యిన్' అనేది స్త్రీ శక్తి, 'యాంగ్' అనేది పుంస శక్తి. వాటిని విశ్లేషించి తరువాతి కాలంలో 'ఫెంగ్ షుయి' అనే చైనా వాస్తుకళ అభివృద్ధి చెందింది. భారతదేశంలోని శివ, శక్తిరూపమైన సృష్టినే భోగనాథుడు చైనీయులకు అలా వివరించాడు.

పళని పుణ్యక్షేత్రంలో ఆయన సమాధి నేటికీ ఉంది. స్థూలశరీరం విడిచినా ఆయన సూక్ష్మశరీరంలో జాగరూకులై ఉన్నారు. ఆయన స్వయంగా తయారుచేసిన దండపాణాయుధ విగ్రహానికి పళని సుబ్రహ్మణేశ్వరస్వామిగా నేడు అభిషేకాలు జరుగుతున్నాయి. ఆ విగ్రహం సామాన్య

మైనది కాదు.

ఆ విగ్రహాన్ని 'నవపాషాణం'తో తయారుచేసాడు, భోగనాథుడు. ఎనిమిది పాషాణాలను మంత్రపూర్వకంగా మిశ్రమం చేసి వాటిని తొమ్మిదో పాషాణంతో కట్టుకట్టి స్థిరపరిచాడు. ఆవిధంగా తయారైన నవపాషాణ విగ్రహం కౌపీనధారి అయిన సన్యాసి రూపంలో ఉంటుంది. పావుకోళ్ళు ధరించి కుడిచేత నిలువెత్తు దృఢమైన దండాన్ని ధరించి ముండనం చేయబడిన శిరస్సుతో ఉన్న రూపం అది. ఆ విగ్రహానికి జరిపే పంచామృత అభిషేకంలో సేకరించిన పంచామృత ప్రసాదం ఎంతకాలమైనా నిలవ ఉంటుంది. దానికి ఔషధగుణాలు అబ్బుతాయి. ఆ ప్రసాదం సేవించి ఎందరో దీర్ఘ వ్యాధులనుంచి విముక్తి పొందారు. ఆ విగ్రహంపై పాతిక సంవత్సరాల క్రితం ప్రభుత్వం పరిశోధనలు జరిపించింది. ఆధునిక పరిశోధనా పద్ధతులను, పరికరాలను ఉపయోగించినా కూడా ఆ శాస్త్రవేత్తలు దాని నిర్మాణ రహస్యాన్ని ఛేదించలేకపోయారు.

భోగనాథుడు మరొక విగ్రహాన్ని కూడా చేసి ఆ పళని కొండలో ఒకచోట భద్రపరిచాడు. ఈనాడు పళనిలోని విగ్రహం ముఖం నుంచి నడుము వరకు చెక్కుచెదరకుండా ఉన్నా.. కింది భాగం కొందరి అత్యాశ వలన కొన్నిభాగాలలో ఎక్కువ అరుగుదలకు గురయ్యింది. అందువలన విగ్రహం కాళ్లు సన్నగా పుల్లల్లా అయిపోయాయి. భోగనాథుడు, ఈ పరిస్థితి ముందుగా ఊహించే మరొక దండాయుధపాణి విగ్రహాన్ని కూడా తయారుచేసి నిక్షిప్తం చేసాడు. సమయం వచ్చినప్పుడు అది బయటకు వస్తుంది.

భోగనాథుడు కలియుగంలో ప్రజలు నానావ్యాధుల బారినపడి బాధలు పడతారని ముందుగా ఊహించి దయతో వారి వ్యాధులను నివారించే ఔషధాన్ని విగ్రహరూపంలో పళనిలో ప్రతిష్ఠ చేసాడు. అందువలన ప్రజలకు ఇటు భక్తి కలుగుతుంది. అటు ఇహలోకంలో వ్యాధినుంచి విముక్తి కలుగుతుంది.

అలాగే భోగనాథుడు దుష్టశక్తుల ఆటకట్టించి అమాయక ప్రజలను రక్షించడానికి మరొక విగ్రహాన్ని నవపాషాణంతో చేసాడు. ఈ విగ్రహం గురించి ఆయన గుప్తంగా ఉంచాడు. ఆయన శిష్యులలోనే అందరికీ తెలియదు. దీనిని తన అంతరంగిక శిష్యులలో ఒకరికి ఇచ్చి రహస్యంగా ఉంచమన్నాడు.

ఆ శిష్యుడు ఆ విగ్రహానికి రహస్యంగా అర్చనాదులు చేస్తూ ప్రజలపై దుష్టశక్తులు విజృంభించకుండా కాపాడేవాడు. ఆ శిష్యుని తదనంతరం ఆయన శిష్య ప్రశిష్యులు ఆ బాధ్యత నిర్వర్తించారు. కాలక్రమేణా ప్రజలలో మంత్రతంత్రాలపట్ల ఆసక్తిపోయింది. యాంత్రిక శక్తిపై నమ్మకం పెరిగింది. అలా జరగటం దైవేచ్ఛ.

ఆఖరు శిష్యుడు ఆ విగ్రహాన్ని తన శిష్యులకు అప్పగించకుండానే సమాధి చెందాడు. అటు తర్వాత ఆ విగ్రహం బయటకు రావలసిన అవసరం కలగలేదు. కాని కొన్ని ప్రత్యేక పరిస్థితుల వల్ల దుష్టశక్తులను ఉపాసించేవారు మళ్ళీ తలెత్తే అవకాశం బలపడింది. వారిని ఎదుర్కొని మానవాళికి మేలు చేయాలనే సత్సంకల్పంతో ఆ చివరి శిష్యుడు మళ్ళీ స్వచ్ఛందంగా జన్మ తీసుకున్నాడు.

ఆ విగ్రహం 'మహాభైరవుడి విగ్రహం'. భోగనాథుడు ఆ విగ్రహాన్ని కూడా నవపాషాణంతోనే చేసాడు. ఆ విగ్రహంలో అద్భుత శక్తులు నింపాడు. ఆ విగ్రహాన్ని సమంత్రకంగా అర్చించినవారికి స్వచ్ఛంద మరణంపొందే శక్తీ వస్తుంది. అంతేకాదు, అష్టసిద్ధులు వారి వశం అవుతాయి.

ఆ మహాభైరవ విగ్రహం ఇప్పుడు ఎక్కడ ఉంది నాకూ తెలియదు. ఆ విగ్రహమే తనను ఇదివరకు చివరగా పూజచేసిన వ్యక్తిని తనంతట తానుగా చేరుతుంది. అతని చేతికి చేరకముందు దాని ఉనికిని గ్రహించటం ఎవరివల్లా కాదు"

ఇలా చెప్పి ముచికుందు యోగి ఇలా అన్నాడు..

"ఇప్పుడు అసలు విషయానికి వస్తున్నాను. ఆ విగ్రహాన్ని పూజించిన చివరి వ్యక్తివి నువ్వే. ఆ విగ్రహం నిన్ను చేరడానికి ప్రయత్నిస్తోంది. ఎందువలన అంటావా? ఆ విగ్రహానికి తన యజమానిని చేరే గుణం ఉంది. అది గత జన్మలో నీది. అదివరకు నీ గురువులు తమ తమ శిష్యులకు అర్చనలు చేయమని ఇచ్చినట్లు నువ్వు నీ శిష్యులకు ఇవ్వలేదు. అందుకే ఈ జన్మలో తన అవసరం నీకు ఏర్పడింది. కనుక అది నిన్ను చేరాలని ప్రయత్నిస్తోంది. అది నిన్ను చేరాక నీ నుంచి ఎవరైనా పొందవచ్చు. అప్పుడు అది వారిని యజమానిగా గుర్తిస్తుంది. అది నీ దగ్గర ఉండగా దానిని పొందాలంటే నీ అనుమతితో గాని, నిన్ను జయించి గాని పొందాలి. ఆ ప్రయత్నాలుచేసే వారు కూడా నీపై కన్ను వేసారు. అయితే నువ్వు ఆ విగ్రహం రక్షణలో ఉండగా నిన్ను మంత్రశక్తులు ఏమీ చేయలేవు. గిరిజ మరణం ఆత్మహత్య కాదు. ఆమెను ఆమె ప్రియుణ్ణి చంపిన హంతకుడికి జాతకంలో ఒక దోషం ఉంది. దాని వలన ఆమె మరణించిన నెలలోగా వాడూ మరణించాలి. కాని ఒక శక్తిమంతుడైన తాంత్రికుడు 'మారక హోమం' చేయటం వలన ఆ హంతకుడికి తగలాల్సిన కీడు వెనకకు మళ్ళి ఆమె వంశస్థులలో ఇద్దరిని బలిగొంది. కాని అంతటితో అది ఆగిపోదు. జరగవల్సిన మరణాలు ఐదు. వాటిని 'పంచకం' అని అంటారు. మరొక నెలలో మరో ముగ్గురు మరణించబోతున్నారు."

అప్రతిభుడై చూశాడు నారాయణ.

"ఆ మహాభైరవ విగ్రహం నీ వద్ద ఉంటే నీలోని గత జన్మ శక్తులు మళ్ళీ మేల్కొంటాయి.. అప్పుడు నువ్వు మిగిలిన మరణాలను ఆపగలుగుతావు. ఆ విషయం నీ శత్రువులకు తెలుసు. ఆ విగ్రహం నువ్వు సాధించితే నిన్ను అడ్డుకోవడం కష్టం. కాని నిన్ను గుర్తుపట్టి నీ ప్రయత్నాలు పాడు చేయడం ఒకటే వారు చేయగలిగింది. నీకు ఆ మహాభైరవుడి రక్షణ ఉంది. ఇతర మంత్రాధిదేవతలు ఆ మహాభైరవుణ్ణి కొలుస్తాయి. అందువలన అవి నీకు హాని చేయవు. ఆ జన్మలో నీ గురువు అలఘునాథుడిని నేనే. నా చేతిమీదుగానే ఆ మహాభైరవ విగ్రహాన్ని నీకిచ్చాను. ఆ విగ్రహం నీ చేతికి వచ్చిన తరువాత నీకు ఆ విషయాలు అనుభవానికి వస్తాయి. అప్పుడు నీ పేరు సత్యనాథుడు. ఆనాడు నా శిష్యులలో వీరిద్దరు కూడా ఉన్నారు", అన్నాడు యోగి మూర్తి, సూర్యంలను చూసి.

"ఇవన్నీ చెప్పటానికి మీ ముగ్గురిని మళ్ళీ ఒక చోట చూడటానికి కాశీకి ప్రయాణం అయిన నిన్ను ఉజ్జయిని రమ్మని చెప్పాను" నవ్వుతూ అన్నాడు ముచి

### కొత్తగాలి... 

**ఆత్మ**
**దేహాల్ని మారుస్తూనే ఉంటుంది**
**ముక్తి దొరికేంతవరకు**
**మనిషి**
**రంగులు మారుస్తూనే ఉంటాడు**
**పదవి దొరికేంతవరకు**

– మంత్రి లక్ష్మీనారాయణ, సిరిసిల్ల

కుంద యోగి.

నారాయణకి, మూర్తికి ఒక్కసారిగా కోయదొర గుర్తుకి వచ్చాడు. ముగ్గురూ శిరసు వంచి ముచికుందు యోగికి ప్రణామం చేసారు.

"మరొక విషయం మీకు చెప్పాలి. నేను చెప్పిన తాంత్రికుడు కూడా అప్పటి జన్మలో మీ సహ విద్యార్థి. అతని పేరు అప్పుడు కామపాలుడు. అతని అపరిపక్వ మానసిక స్థితి కారణంగా నీ కంటె ముందుగా నా వద్ద చేరినా అతన్ని కాదని మహాభైరవ విగ్రహాన్ని నీ చేతికిచ్చాను. ఈ జన్మలో అతడు ఆ విగ్రహాన్ని ఎలాగైనా పొందాలని చూస్తున్నాడు."

ముచికుందు యోగి తన గురువు అని, తనను అనుక్షణం కనిపెట్టి ఉంటూ కాపాడుతున్నాడని తెలిసాక నారాయణ పులకరించిపోయాడు. గురువుగారికి సాష్టాంగ నమస్కారం చేసాడు. "గురుదేవా, నన్ను ఆశీర్వదించండి" అని ప్రార్థించాడు. మూర్తి, సూర్యం కూడా తాము జన్మ జన్మలు కలిసి ఉన్నామని విని ఆశ్చర్యపోయారు. వారు కూడా తమ గురువుకి సాష్టాంగ నమస్కారం చేసారు.

"నీ అన్వేషణలో నువ్వు బీహార్ వెళ్ళాలి. అంతకుమించి ఇప్పుడేమీ చెప్పలేను. నీ ప్రయత్నాలు ఫలించాలని ఆశీర్వదిస్తున్నాను" ఆప్యాయంగా తన ప్రియ శిష్యుడిని చూస్తూ కోరకనే వరమిచ్చాడు ముచికుందయోగి.

మూర్తి వైపు చూసి "ఇది నీ కోసమే" అని చేయి చాచాడు ముచికుందయోగి. ఆయన అరచేతిలో ఎండిన రేగు పండు ఉంది. దాన్ని చూడగానే కొండ ఎక్కేటప్పుడు వెటకారంగా తను సూర్యానికి చూపించిన రేగు అదేనని గుర్తించాడు మూర్తి. సిగ్గుగా నవ్వుతూ చేయి చాచాడు. ఆయన తన చేతిలోని రేగు పండును

మూర్తి చేతిలోకి వదిలాడు. మూర్తి చేయి చూసుకుంటే అందులో తాజా ద్రాక్ష పండు కనిపించింది. ఆశ్చర్యంతో ఒళ్ళు పులకరించిపోతుండగా శిరసు నేలకానించి ఆయనకు నమస్కరించాడు మూర్తి.

★ ★ ★

రాంబాబు మరణవార్తను మూర్తికి తెలియచేయాలని విశ్వప్రయత్నంచేశాడు సదాశివం. కాని ఎన్నిసార్లు చేసినా అతని ఫోన్ 'అవుటాఫ్ కవరేజి' అనే మెసేజి మాత్రమే వినిపించింది. ఒకవైపు గిరిజ మరణానికే కృంగిపోతుంటే పండు మరణించటం, ఇప్పుడు రాంబాబు మరణించటం వారి మనసులను కలచివేసింది. మరునాడు రాంబాబు అంత్యక్రియలు అవుతుండగా మూర్తినుంచి ఫోన్ వచ్చింది.

★ ★ ★

ముచికుందు యోగి ఆశ్రమం నుంచి తమ బసకు వచ్చిన తరువాత గాని ఆ ముగ్గురి మిత్రుల ఉత్తేజం తగ్గలేదు. ఎన్నో కొత్త విషయాలు తెలియటం వలన వారి ఆలోచనలు కలగాపులగమైపోయాయి. అదీగాక జన్మల మధ్య సంబంధం, అనుబంధం కనిపిస్తుంటే మరణం అంత భయంకరమైన అనుభవం అని కూడా అనిపించటం మానేసింది. అందుకే ముచికుందు యోగి ప్రస్తావించిన మరొక మరణం గురించి అంతగా మనసులో ఆలోచన మెదలలేదు. కాని ఆశ్రమం నుంచి దూరం పెరిగి, బస దగ్గర అవుతుంటే మూర్తి, సూర్యం వర్తమానంలోకి త్వరగా వచ్చేశారు. నారాయణ మాత్రం అప్పటి ఆలోచనలను ఇంకా కొనసాగిస్తున్నాడు.

వసతి గృహంలోకి వెళ్ళగానే సూర్యం "కాఫీ లావో" అని అక్కడి పనివాడికి చెప్పాడు. విశ్రాంతిగా సోఫాలో కూర్చున్న మూర్తికి ముచికుందు యోగి చెప్పిన రెండో మరణం గురించి గుర్తువచ్చింది. ఇంటి దగ్గర నుంచి వచ్చిన తరువాత వారితో మాట్లాడలేదని కూడా గుర్తుకొచ్చింది. 'ఇంతకూ బాబాయి శాంతి చేయించాడా?' అని అనుకుంటూ, సూర్యనారాయణ దగ్గర ఫోన్ తీసుకుని సదాశివానికి రింగ్ చేసాడు.

మూర్తి ఫోన్ చేసినప్పుడు రాంబాబు అంత్యక్రియలు అవుతున్నాయి. సదాశివం ఫోన్ రిసీవ్ చేసుకున్నాడు.

"బాబాయ్, ఎలా ఉన్నారు? " అన్నాడు మూర్తి.

"ఒరే మూర్తీ, నువ్వా! అన్యాయమైపోయిందిరా" అన్నాడు సదాశివం బాధగా.

"ఏమైంది బాబాయ్? " ఏమి వినాల్సి వస్తుందో భగవంతుడా అనుకుంటూ గుండెలు అరచేతిలో పట్టుకుని అడిగాడు.

"మన రాంబాబుని బస్సు గుద్ది చచ్చిపోయాడురా" అన్నాడు ఏడుపు గొంతుతో.

'ఎంత అన్యాయం జరిగింది' అనుకున్నాడు మూర్తి.

ఏమీ చేయలేనితనం కోపాన్ని మరింత పెంచుతుంది.

"బాబాయ్, ఇది అంతా ఒక తాంత్రికుడు చేస్తున్న అఘాయిత్యం. తొందర్లోనే నారాయణ వాడి పని పడతాడు" ఉద్రేకంగా అరిచి చెప్పాడు.

మూర్తి అంత గట్టిగా మాట్లాడేటప్పటికి పక్కనే ఉన్న నారాయణ ఉలిక్కి పడి చూసాడు.

ఎక్కడ మూర్తి నోరు జారి రహస్యంగా ఉంచవలసిన విషయాలు బట్టబయలు చేస్తాడో అని భయపడ్డాడు. ముక్కుపై వేలు వేసుకుని మూర్తికి సైగ చేసాడు.

ఆ సంజ్ఞ చూసి మూర్తి ఆవేశాన్ని అణుచుకున్నాడు. 'మీ జన్మలకు చెందిన ఈ రహస్యం మీరు వేరెవరికీ చెప్పరాదు. అలా చేస్తే మీలో ఒకరు మరణిస్తారు'

అని ముచికుంద యోగి హెచ్చరించడం గుర్తుకి వచ్చింది.

"ఏమన్నావు? తాంత్రికుడా! ఎవడ్రా వాడు? ఎక్కడుంటాడు? వాడికి మనతో శత్రుత్వం ఏమిటి? మనమేం అపకారం చేసాం? " అని ప్రశ్నలు గుప్పించాడు, సదాశివం.

"మంచివాళ్ళు తమకు అపకారం చేసిన వారిని కూడా క్షమిస్తారు. పైగా వీలుపడితే ఉపకారం కూడా చేస్తారు. దుష్టులు తమకు ఏ అపకారం తలపెట్టకపోయినా అమాయకులను హింసిస్తారు. ఇది నీకు తెలియంది కాదు బాబాయ్. జరిగిందానికి చాలా బాధగా ఉంది. కాని ఒకటి నిజం. గిరిజ, పండుల తర్వాత ఇప్పుడు రాంబాబు వంతు. వీళ్ళు ముగ్గురూ 'హత్య' చేయబడ్డారు బాబాయ్. మేము హంతకులను ఊరికే విడిచిపెట్టం" అన్నాడు వీలైనంత శాంతంగా.

"ఒరే ఏమి చెప్తున్నావో అర్థమయ్యేలా చెప్పరా. సగం సగం మాట్లాడితే మాకు ఎలా అర్థమవుతుందిరా? " అన్నాడు అసహనంగా సదాశివం.

"మళ్ళీ చెప్తాలే గాని, నువ్వు ఇదిచెప్పు. శాంతి చేయించావా? " అడిగాడు మూర్తి.

"చేయించాము. నిన్ననే చేయించాము. రాంబాబు కూడా రావలసింది. ఏదో అర్జంట్ పని ఉందని, చూసుకుని వచ్చేస్తానని అన్నాడు. అంతలోనే యాక్సిడెంట్ అయిపోయింది. నువ్వు చెప్పినప్పుడే చేయిస్తే బాగుండేదేమో. అనవసరంగా లేటు చేసాను. నా వల్లే రాంబాబు చనిపోయాడురా" అన్నాడు బాధగా.

"శాంతి చేస్తే ఆగటానికి వాళ్ళు మామూలు వాళ్ళు కాదులే బాబాయ్. నువ్వేమీ బాధపడవద్దు."

"ఒరే మీరు కాశీ నుంచి ఎప్పుడు వస్తున్నారు? "

"మేము కాశీలో లేము. ఉజ్జయినిలో ఉన్నాం. వెనక్కి రావడానికి ఇంకా సమయం పడుతుంది. మళ్ళీ మాట్లాడతాలే" అని ఫోన్ పెట్టేయబోయాడు.

"ఒరే, ఆగరా. తొందరపడి ఏ ప్రమాదంలోను ఇరుక్కోవద్దు. అసలే తంత్రగాళ్ళు, హత్యలు అంటున్నావు. జాగ్రత్తగా ఉండండి" అన్నాడు సదాశివం.

"సరేలే" అంటూ పెట్టేశాడు మూర్తి.

మెట్లపైన నుంచున్న నారాయణ ఫోన్లో మూర్తి మాట్లాడిందంతా విన్నాడు. వడివడిగా వచ్చి మూర్తి భుజం తట్టాడు.

నారాయణను చూసి మూర్తి కోపం, బాధ మిళితమైన స్వరంతో "నారాయణా, చూడు ఎంత ఘోరం జరిగిపోయిందో! నువ్వు వాడి అంతు చూడాల్సిందే నారాయణా" అన్నాడు.

"శాంతించు. జరగబోయేదాని గురించి మనం ఆలోచించుకుందాం. వెంటనే మనం చేయవలసింది చేద్దాం" అన్నాడు నారాయణ.

"రాంబాబు నీకు తెలుసు కదా.. ఎంత సరదాగా ఉండేవాడు. చీమకైనా అపకారం తలపెట్టనివాడు. వాడిని బస్సుతో..." గొంతు గద్గదమైపోగా, మాటలు పూర్తి చేయలేక, వెక్కుతూ నారాయణను కావ

## కొత్తగాలి...

**అక్షరం పవిత్రం**
**అది అజ్ఞాన లతల పాలిటి లవిత్రం**
**అక్షరాన్ని ఆశ్రయించు**
**లక్షణంగా జీవించు**

– కలవలపల్లి బాలసుబ్రహ్మణ్యం,
విజయవాడ

లించుకుని బావురుమన్నాడు. అతడిని పొదివి పట్టుకుని వీపు నిమురుతూ ఓదా ర్చాడు నారాయణ. తన మనసులో 'ఈ దారుణ మారణ కాండను ఆపి తీరాలి' అని కృతనిశ్చయుడయ్యాడతను.

సూర్యనారాయణ కూడా దగ్గరకు వచ్చి మూర్తిని ఓదార్చాడు. ముగ్గురి మనసుల్లో ఒకటే కోరిక. రాక్షసంగా మారణకాండ చేస్తున్న దుర్మార్గుల ఆటకట్టాలని. ఇంతవ రకూ తమవాళ్ళు మరణిస్తున్నారంటే వారి ఆయువు మూడి చనిపోతున్నారని అనుకు న్నారుగాని, ఇలా ఎవరో దుర్మార్గుడి ప్రాణాలు కాపాడడానికి అన్యాయంగా బలి పశువులు చేయబడుతున్నారని తెలియదు. కీడు తొలగించుకోవటానికి శాంతి చేయటం ఒక రకం. కాని తమకీడు తొల గించుకోవటానికి ఇతరులకు కీడు చేయడం రాక్షసం. తమ ఆత్మీయుల మరణం వెనక ఒక రాక్షస ప్రణాళిక ఉందని తెలిసి వారి రక్తం మరుగుతోంది.

ఏమీ చేయలేమనే నిస్సహాయత ఉంటే పరిస్థితి వేరుగా ఉండేది. కాని జరగబోయే మారణాకాండను ఆపగల అవకాశం ఉందని తెలిసాక పరిస్థితి మరోలా ఉంటుంది. మొదటిది నిర్వేదంలోకి నె ట్టేస్తే, రెండోది ఉత్సాహపరచి కార్యోన్ము ఖుల్ని చేస్తుంది. ఇప్పుడు అదే జరిగింది.

మూర్తి దుఃఖాన్ని తాము చేయబోయే యజ్ఞానికి విడిచే అశ్రు తర్పణంగా తలచి తాము ఆలస్యం చేయకుండా 'మహాభైరవ' విగ్రహ అన్వేషణ మొదలుపెట్టాలి అనుకు న్నాడు నారాయణ.

మెల్లగా దుఃఖాన్ని దిగమింగుకుని మూర్తి "చెప్పు నారాయణా.. ఇప్పుడు ఏమి చేద్దాం? " అన్నాడు.

నారాయణ ఏమి చెప్తాడో అని సూర్య కూడా ఎదురు చూసాడు.

"నేనూ అదే ఆలోచించాను. గురువు గారు చెప్పినట్లు ఆ విగ్రహమే నన్ను వెదు కుతుంది అనుకుంటే ఆ విగ్రహం ప్రేరేప ణకు అనువుగా మనం ఉంటే సరిపో తుంది కదా? అందుకే గదిలో ఆ విగ్ర హాన్నే ధ్యానిస్తూ కూర్చున్నాను. నాకు వెంటనే బుద్ధ గయకు వెళ్ళాలనిపించింది. గురువుగారు కూడా బీహార్ వెళ్లమన్నారు కదా! ఆ విషయం చెప్పాలని వస్తుంటే నువ్వు ఫోన్ మాట్లాడుతూ కన్పించావు. సరే సూర్యం మరి నీ సంగతేమిటి? " అడి గాడు నారాయణ.

తనను కూడా కలుపుకుని నారాయణ ఆలోచిస్తుండేసరికి సూర్యానికి సంతోషం వేసింది.

"నువ్వు ఎలా చెప్తే అలానే చేద్దాం" అన్నాడు, దేన్నికైనా 'సై' అనే యోధుడిలా.

"అయితే, మేము బుద్ధగయ వెళ్ళడానికి ఏర్పాట్లు చేయి. రేపు పొద్దున్నే ప్రయాణం అయిపోతాం" అన్నాడు నారాయణ.

అతని మాటలకు దెబ్బతిన్నట్లు చూసాడు సూర్యం.

"ఏం నేను మీతో రావటం మీకు ఇబ్బందా? " ఎత్తిపొడుపుగా అడిగాడు.

"నారాయణా! మనకు భాషా సమస్య ఉంది. సూర్యం మనతో ఉంటే మన పని సులువుగా ఉంటుంది. అదీగాక గురువు గారు చెప్పిన మాటల ప్రకారం శత్రువులు మనకోసం వెతికే అవకాశం ఉంది. మనకు ఇక్కడి భాష తెలిసిన మనవాడు పక్కనే ఉండటం చాలా మంచిది" అంటూ సూర్యం తరుపున మాట్లాడాడు మూర్తి.

"ప్లీజ్ నారాయణా, నేనూ వస్తాను. మీకు లోకల్ గైడ్‌లా పనికొస్తాను. బుద్ధ గయలో నాకు స్నేహితులు ఉన్నారు. నువ్వు ఎక్కడకు కావాలంటే అక్కడకు తీసుకెళ్ళగలను. అదీగాక టూరిస్ట్ ఆపరేట ర్ల అనధికార నెట్‌వర్క్ చాలా శక్తిమం తమయింది. నేనుంటే మీ పనులు సజా

వుగా అవుతాయి. మన ముగ్గురం ఒక కార్యక్రమంలో కలిసి పనిచేయడం గురువు గారికి కూడా ఇష్టమని నా నమ్మకం. ఒప్పుకో నారాయణా" అడిగాడు సూర్యం.

"నువ్వు రావటం మాకు ఎంతో ఉపయోగపడుతుంది సూర్యం. అందులో నాకు సందేహం లేదు. కాని మనం తలపెట్టిన కార్యక్రమం ప్రమాదకరమైనది. మేమా పెళ్ళికానివాళ్ళం. మాపై ఆధారపడిన వాళ్ళంటూ లేరు. నీ పరిస్థితి అలా కాదు. భార్యాపిల్లలు ఉన్నారు. నీకేమైనా అయితే నన్ను నేను క్షమించుకోలేను. అందుకే వద్దంటున్నాను" అన్నాడు నారాయణ.

"నారాయణా, మీరిద్దరూ ఎవరో తెలియకపోయి ఉంటే ఈ విషయంలో నేను జోక్యం చేసుకునేవాడినే కాదు. కాని ఇప్పుడో మన గతం మనకు తెలుసు. అందులోను నువ్వు చేయబోయే కార్యక్రమం సామాన్యమైనది కాదు. గురువు గారు చెప్పినట్లు ఇప్పుడు నీ చేతుల మీద జరగబోయే కార్యక్రమం నీ జీవిత పరమార్థం అవుతుంది. అంత ముఖ్యమైన పనిలో మా వంతు సహకారం అందించడం నీ సహాధ్యాయిలుగా మా కర్తవ్యం. ఇక కాదనకు. నాకే కాదు, మనలో ఎవ్వరికీ ఏమీ కాదని నా నమ్మకం. ఒకవేళ ఏమైనా అయినా అందులో నీ తప్పు ఏదీ ఉండదు. నా మాట విని నన్ను కూడా రానివ్వు" అన్నాడు సూర్యం పట్టుదలగా.

నారాయణ కొంచెంసేపు ఆలోచించాడు. మూర్తివైపు చూస్తే అతనికి కూడా సూర్యం తనతో రావాలని ఉందని అర్థమయింది.

"సరే, నాకు తెలియకుండా తొందరపడి ఏ నిర్ణయమూ తీసుకోకూడదు. ఎటువంటి ప్రమాదకర పరిస్థితులలోకి తల దూర్చకూడదు. అలా అయితే రావచ్చు" అన్నాడు ఇక తప్పేది లేదనుకొంటూ.

నారాయణ రెండు చేతులు ఇద్దరూ పట్టుకుని ఊపేస్తూ "చాలా సంతోషం నారాయణా" అన్నారు వారు.

"సరే రేపు ఉదయమే మన ప్రయాణం. సూర్యం కావల్సిన ఏర్పాట్లు చేస్తాడు. ఇక మన సామాన్లు సర్దడం మొదలు పెట్టుకుందామా? " అన్నాడు నారాయణ.

సరేనన్నారు మిత్రులు.

## 6



**మూ**ర్తి చెప్పిన విషయాలు శ్రీరామచంద్రమూర్తికి, కేశవమూర్తికి చెప్పాడు సదాశివం.

బంధువులంతా సదాశివం ఇంట్లో ఈ విషయాన్నే అన్ని కోణాల్లోను చర్చించారు. తాంత్రికుల అఘాయిత్యం, క్షుద్రపూజలతో మనుషుల్ని చంపటం వంటివి ఈ కాలంలో ఎవరు నమ్ముతారు?

చాలామంది నమ్మలేదు.

సదాశివం పెదమావగారు, వైకుంఠనాథ శాస్త్రి, ఆ విషయాన్ని ఒక్కమాటలో కొట్టిపారేసారు.

"ఈ కాలంలో ఇవన్నీ ఎక్కడ ఉన్నాయి. అదీగాక మన అమ్మాయి చనిపోయింది శాంతి నక్షత్రంలోనే కాదు. ఆమె చనిపోయినది ఆశ్లేష నక్షత్రంలో. ఆశ్లేష శాంతి నక్షత్రమని ఎవరన్నారు? సరే మాటవరసకి ఒప్పుకుందాం, అది శాంతి నక్షత్రమే అనుకుందాం. మరి మీరు శాంతి చేయించిన రోజే రాంబాబు చచ్చిపోవడం ఏమిటి? ఇవన్నీ దండగ మాటలు. ఆ

నారాయణకి 'పండు' చనిపోయేటప్పటికి మతి చలించింది. అది పక్కనే ఉన్న మూర్తికి అంటించి ఉంటాడు."

"నారాయణని తక్కువచేసి మాట్లాడకండి. మూర్తి కూడా తక్కువ వాడేమీ కాదు. వాడికి అనుమానం వచ్చిందంటే, ఏదో ఉండి ఉంటుంది. మనకు తెలియని విషయాలు లోకంలో ఎన్నో ఉన్నాయి. మనం చూడలేదని చెప్పి అవి లేవంటే ఎలా? " అన్నాడు శ్రీరామచంద్రమూర్తి.

"ఏమిటి తక్కువ చేయటం? అతగాడే శాంతి చేయమని చెప్పాడుగా! అలానే చేసారు. మరి ఇప్పుడు జరిగింది ఏమైనా ఆగిందా? కర్మను ఎవ్వరూ మార్చలేరు. మంత్రాలకు చింతకాయలు రాలే కాలంలో లేం మనం. కాలం మారిపోయింది" అన్నాడు వైకుంఠనాథశాస్త్రి కూడా గట్టిగా.

"మంత్రాలంటే గుర్తుకు వచ్చింది. మొన్నామధ్య హరిద్వార్ వెళ్ళినప్పుడు అక్కడ ఒక సాధువు నన్ను పిలిచి నాకు ఎంతమంది పిల్లలో కరెక్టుగా చెప్పాడు. డబ్బులిస్తుంటే తీసుకోలేదు. పళ్ళు ఇస్తే తీసుకున్నాడు. పెద్దమ్మాయి గురించి జాగ్రత్తగా ఉండాలని చెప్పాడు. తర్వాత నేను ఆ విషయాన్ని మరిచిపోయాను. గిరిజ పోయాక మళ్ళీ గుర్తుకి వచ్చింది" అన్నాడు సదాశివం.

"కాకతాళీయమైన సంగతులు పట్టుకుని వేలాడితే ఎలా? కొంతమంది చీకట్లో రాయి విసిరినట్లు ఏవో చెప్తారు. వాడి అదృష్టంకొద్దీ ఒక్కోసారి అవి నిజమవుతాయి, అంతే" అన్నాడు వైకుంఠనాథశాస్త్రి.

ఎందరు ఎలా మాట్లాడినా, నమ్మేవాళ్ళు నమ్మేరు. నమ్మని వాళ్ళు వెక్కిరించారు.

తన అక్క మరణానికి కారణం అయిన హంతకులే తమ కుటుంబంలోని ఇతరుల మరణాలకు ప్రణాళిక వేస్తున్నారని శార్వాణి నమ్మింది. మంత్రశక్తి అనేది మానసికంగా బలహీనంగా ఉన్న వాళ్ల మీద పనిచేసే హిప్నాటిక్ శక్తిలాంటిదని ఆమె నమ్మకం. అది పని చేయడానికి ముఖ్యకారణం ప్రయోగించినవాడి 'శక్తి' కాదు. దానికి బలయ్యే వారి మానసిక బలహీనతపై మంత్రగాళ్లు ప్రయోగించే 'యుక్తి' అని ఆమె ఉద్దేశం.

దృఢమైన మనసు ఉంటే మనం ఎదుర్కోలేని మంత్రశక్తులు ఏవీ లేవని ఆమె స్థిరమైన నమ్మకం.

గిరిజ మరణం ఓ హత్య అని ఇంట్లో అంతా అనుకున్నారు. కాని ఎక్కడో మైసూరులో జరిగిన దానికి మనమేం చేయగలం? మన కర్మ ఇది. అంతా ఆ

> **కొత్తగాలి...**
>
> **పట్నం వాళ్లది**
> **నాగరికత!**
> **పల్లెటూరి వాళ్లది**
> **'నాగలి'కత!**
>
> – భాస్కరభట్ల, హైదరాబాద్

భగవంతుడే చూసుకుంటాడని సదాశివం ఏ ప్రయత్నం చేయకుండా వదిలేశాడు.

ప్రశాంత్ తండ్రి మంజునాథ్ ఒకసారి ఫోన్‌చేసి మాట్లాడుతూ తనకు తెల్సిన డి.సి.పి ఉన్నాడని, వచ్చి గిరిజ గురించి కంప్లైంట్ రాసిస్తే అతడు యాక్షన్ తీసుకుంటాడని చెప్పాడు. అయినా సదాశివం అంతగా ఆసక్తి చూపలేదు.

భార్యా పిల్లలు పోరు పెట్టి కంప్లైంట్ ఇవ్వమంటే ఇదిగో రేపు మాపు అని వాయిదాలు వేస్తున్నాడు. శార్వాణికి, గిరిజకి చాలా పోలికలుంటాయి. చూడడానికి కవలపిల్లల్లా ఉంటారు. ధైర్యసాహసాల్లో

కూడా ఇద్దరూ ఒక్కలాగే ఉంటారు. గిరిజ అన్యాయాన్ని సహించదు. శార్వాణి కూడా అంతే. తనఅక్క మరణంగాని, అటు తర్వాత జరిగిన మరణాలు గాని మంత్ర తంత్రాల కారణంగా జరిగాయని ఆమె అనుకోలేదు. అదంతా గూండాల పనేనని ఆమె ఉద్దేశం. అందుకే ఆ హంతకులను చట్టానికి పట్టించాలని పట్టుదలతో ఉంది.

రాంబాబు మరణం ఆమె పట్టుదలను మరింత పెంచింది. మూర్తి మాటలలో తెలిసిన విషయం నమ్మినా నమ్మకపోయినా, ఒక విషయం మాత్రం నిజం. అతనికి కూడా గిరిజ మరణం హత్య అని తెలిసింది. అలా తెలియటం విచిత్రమే కదా? ఎందుకంటే సదాశివం ఆ విషయాన్ని పెద్దగా అందరి ముందు చర్చించలేదు. అయినా జరిగింది హత్య అంటున్నాడంటే కొంతవరకు మూర్తి చెప్పేది నమ్మవచ్చు. ఆ విధంగా ఆలోచించినా గిరిజ హంతకులకు మంత్రగాళ్లతో పరిచయాలు ఉన్నాయని తెలుస్తోంది. నేరంచేసే మనిషి ఎప్పుడైతే క్షుద్రశక్తుల వెంటపడతాడో వాడు మరింత ప్రమాదకారి అవుతాడు. ఎందుకంటే వాడిలోని మనోచాంచల్యం, మానసిక బలహీనతలు ఆ విధంగా ప్రకోపిస్తుంటాయి. అందుకే అటువంటివాడు క్రూరుడు, ఉన్మాది అయివుంటాడు. వాడు ఎలా ప్రవర్తిస్తాడో ముందుగా అంచనా వేయలేము. ఒక్కటి మాత్రం కచ్చితంగా చెప్పవచ్చు. అదేమంటే అటువంటి నేరస్తుడు చాలా ప్రమాదకారి అని.

శార్వాణికి బాధపడుతూ చేతులు ముడుచుకుని కూర్చోవటం ఇష్టంలేదు. ఏదో ఒకటి చేయాలని ఉంది. గిరిజ ఆత్మకు అప్పుడే శాంతి అని ఆమె నమ్మకం. ఎందుకంటే గిరిజ అన్యాయాన్ని సహించేది కాదు. ఆమెకు సరైన స్మృత్యంజలి సమర్పించాలి అంటే తను ఆ హంతకుల పని పట్టాలి.

బాగా ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చింది శార్వాణి. ఆ రాత్రి తల్లికి చెప్పింది, తన ప్రాజెక్ట్ బాగా లేటయిపోయిందని. ఇంట్లో ఇంతమంది మధ్య తను పూర్తిగా పనిమీద దృష్టి పెట్టలేకపోతోందని. అందుకే ఫ్రెండ్‌రూమ్‌లో రెండు మూడు రోజులుండి పని పూర్తిచేసుకుని వస్తానని చెప్పి తల్లిని ఒప్పించింది.

★ ★ ★

మరునాడు ఉదయం ఇన్నోవాలో సామాను సర్దుకుని నారాయణ మిత్రబృందం ప్రయాణం మొదలెట్టింది. ముగ్గురి మొఖాల్లో నూతనోత్సాహం వెల్లివిరుస్తోంది. నారాయణ ఉజ్జయిని మహాకాళికి, మహాకాళేశ్వరుడికి, మహాభైరవుడికి మనసులో నమస్కరించుకున్నాడు. ముగ్గురూ ఒకసారి తమ గురువైన ముచికుంద యోగికి నమస్కరించుకున్నారు.

కారు గమ్యంవైపు దూసుకుపోతోంది.

ఎక్కడో బీహార్‌లోని ఒక మారుమూల పల్లెటూరిలో 'మహాభైరవ' విగ్రహంలో నిబిడీకృతమైన శక్తి నారాయణ తనకు దగ్గరగా వస్తున్నాడని తెలిసి సంతోషించింది. అతన్ని కలుసుకోవడానికి తను కూడా కొంత ప్రయాణం చేయాలి మరి. దానికి కావలసిన ప్రేరణలను తగిన వ్యక్తులకు ఇవ్వటం మొదలుపెట్టింది.

★ ★ ★

ఉజ్జయిని నుంచి ముగ్గురు మిత్రులు బయలుదేరిన సమయంలోనే హైదరాబాద్ నుంచి శార్వాణి కూడా బాగ్ తీసుకుని తన స్కూటీపై వెళ్లింది. స్నేహితురాలి రూమ్ దగ్గర స్కూటీ పెట్టింది. స్నేహితురాలికి తనప్లాన్ వివరించి సహకరించమంది.

"జాగ్రత్తగా ఉండవే. తిన్నగా మైసూరులో మా ఇంటికే వెళ్లు. అమ్మ ఒక్కతే




ఉంటుంది. డాడీ ఇప్పుడు కెనడాలో ఉన్నారు. ఆయన ఉన్నా ఏమీ అబ్జెక్ట్ చేయరులే. నేను అమ్మతో ఇప్పుడే ఫోన్ లో చెప్తాను. ఇక్కడ మీ వాళ్లనూ మానేజ్ చేస్తాను" అంది హరిత.

అన్నట్లే వాళ్ల అమ్మతో అప్పటికప్పుడే ఫోన్‌లో మాట్లాడింది.

హరితను హగ్ చేసుకుని "చాలా థాంక్స్" అంది శార్వాణి.

"అరె, ఏముందే? ఫ్రెండ్స్ అన్నాక ఆమాత్రమన్నా చేసుకోమా? " అంది హరిత తేలికగా తీసేస్తూ.

శార్వాణి బెంగళూరుకి ఫ్లయిట్ లో వెళ్ళి పోయింది. అక్కడ నుంచి కాబ్ బుక్ చేసుకుంది మైసూరు వెళ్లడానికి.

★ ★ ★

రుద్రప్ప బిజినెస్ పనులు చూసుకోవడానికి హైదరాబాద్ వచ్చేడు. అతను కూడా అదే రోజు బెంగళూరు ఫ్లయిట్ కోసం ఏర్ పోర్ట్‌కి వచ్చాడు. శార్వాణి ఎక్కిన ఫ్లయిట్ లోనే అతను కూడా ఉన్నాడు. జెట్ ఏర్ వేస్ ఫ్లయిట్‌లో కూర్చుని ఉన్న రుద్రప్పకి హాండ్‌బాగ్‌తో లోపలికి వస్తున్న శార్వాణి కనిపించింది. ఆమెను చూసి గిరిజ అనుకుని ఉలిక్కిపడ్డాడు.

అతనికి గిరిజ బాగా నచ్చింది. ఆమె సహకరించి ఉంటే తనతో ఉంచుకునే వాడే. కాని ఆ పరిస్థితుల్లో అంతకంటే మార్గం కనిపించలేదు అతనికి. కాని ఆమె వీడియో చూసినప్పుడల్లా ఆమె పైన కోరిక అంతులేకుండా పెరుగుతూనే ఉందతనికి.

దీపం కాంతికి ఆకర్షించబడ్డ శలభంలా అతను గిరిజ పట్ల ఆకర్షితుడయ్యాడు.

బెంగుళూరులో ఫ్లయిట్ దిగిన తర్వాత ఆమె ఎటు వెళ్లిందో తెలియలేదు. కాని అనుకోకుండా ఆమె ఎక్కిన కాబ్ మైసూరు

వైపు వెళ్తుంటే రుద్రప్ప చూసి తన వెహికల్లో శార్వాణిని వెంబడించాడు. మైసూరులో ఆమె ఎవరింటికి వెళ్లిందో తెలుసుకుని కారు వెనక్కు తిప్పాడు.

ఎదురుగా ప్రవీణ్ పోలీస్ జీప్‌లో వస్తున్నాడు. ఇద్దరూ ఒకరినొకరు చూసుకున్నారు. ప్రవీణ్‌ని చూసి రుద్రప్ప వంకరగా నవ్వాడు. ప్రవీణ్ ఆ నవ్వును పట్టించుకోలేదు కాని వాడిని పట్టించుకున్నాడు.

'ఏమిటి వీడు ఈ ఏరియాలో ఏం చేస్తున్నాడు? ' అని ఆలోచనలో పడ్డాడు.

ప్రవీణ్ జీప్ శార్వాణి వెళ్లిన ఇంటి పక్క ఇల్లు వద్ద ఆగింది. జీప్ దిగి ఇంట్లోకి వెళ్ళాడు ప్రవీణ్. బయట కుర్చీలో కూర్చుని అక్కడే ఉన్న పేపర్లు తిరగేయసాగాడు. లోపలి నుంచి పట్టుచీర కట్టుకుని ఒక స్త్రీ వచ్చింది.

"పక్కింటి ఆంటీ కూడా వస్తారంట రమ్మని చెప్పనా? " అడిగింది.

"త్వరగా రమ్మను" అన్నాడు ప్రవీణ్.

"ఇదిగో ఇప్పుడే రమ్మంటాను" హడావుడిగా లోపలికి వెళ్ళిపోయింది మీనాక్షి.

★ ★ ★

హాల్లో కూర్చుని ఉంది శార్వాణి. చేతిలో కాఫీ కప్పు పుచ్చుకుని హరితవాళ్ళ అమ్మ కామాక్షి మాట్లాడుతుంటే చిరునవ్వు నవ్వుతూ వింటోంది. అంతలో టీపాయ్ పైన మొబైల్ మోగింది.

"ఆ.. నేను రెడీ. ఇదిగో ఇప్పుడే వస్తాను. హరిత ఫ్రెండ్ దా వచ్చింది. వెంట తీసుకొస్తునా? సరి" అని మాట్లాడి ఫోన్ పెట్టింది.

"ఏమ్మా నువ్వు కూడా వస్తావా మాతో? " అని అడిగింది శార్వాణిని.

"లేదాంటీ నాకు కొంచెం అర్జంట్ పనుంది. మీరు వెళ్ళండి ఆంటీ నేను బయల్దేరుతాను" అంది శార్వాణి.

"తొందర లేదమ్మా పనమ్మాయి ఉంటుంది. నువ్వు నిదానమా వెళ్ళొచ్చు ఇప్పుడే కదా వచ్చావు. పక్కింటి ఆంటీ నేను చిన్నప్పటి ఫ్రెండ్స్. ఆమె కొడుకు డి.సి.పి. ఈ రోజు శుక్రవారం కదా. అదీను శ్రావణం. చాముండి దగ్గర నిండా జనం ఉంటారు. అతను కూడా మాతో వస్తే త్వరగా దర్శనం అవుతుందని వెళ్తున్నాను. నువ్వు ఇటు రాగానే నేను అటు వెళ్తున్నాను. ఏమి అనుకోవు కదా? " నాన్‌స్టాప్‌గా మాట్లాడుతూ అడిగింది కామాక్షి.

"మీ పక్కింట్లో డి.సి.పి ఉన్నారా? నాకు హరిత ఎప్పుడు చెప్పలేదు ఆంటీ"

"ఈ మధ్యే వచ్చారమ్మా. ఇది వరకు మీనాక్షి బెంగుళూరులో ఉండేది, వాళ్ళమ్మాయిని చదివిస్తూ. ఇప్పుడు అమ్మాయి యు.కె. వెళ్ళింది పైచదువులకు. మీనాక్షి భర్త బిజినెస్ చూసుకుంటూ కెనడాలో ఉన్నారు. అందుకే కొన్నాళ్ళు కొడుకు దగ్గర ఉందామని మైసూరు వచ్చింది. ఆమె కోసమని ప్రవీణ్ ఈ ఇల్లు బాడుగకి తీసుకున్నాడు. ఇదివరకు అపార్ట్‌మెంట్‌లో ఉండేవాడు. మీనాక్షికి అపార్ట్‌మెంట్‌లు ఇష్టంలేదు, నా మాదిరే. అందుకే ప్రవీణ్ ఈ మధ్యే ఈ ఇల్లు తీసుకున్నాడు. హరితకు ఇదంతా తెలియదు" మాట్లాడుతూనే పూజగదిలోకి వెళ్లి పూలసజ్జ తీసుకుని బయటకు వచ్చిందామె.

"మరి వెళ్ళి వస్తునా తల్లీ? " అంది కామాక్షి.

"మీకు అభ్యంతరం లేకపోతే నేను కూడా వస్తాను ఆంటీ."

"అయ్యో, ఏమి అభ్యంతరమమ్మా. ఏమి లేదు. మరి డ్రెస్ చేంజ్ చేసుకోవాలా" అని అడిగింది.

"మీరు చెప్పండి ఆంటీ ఇలా బాగానే ఉంది అంటే సరే. లేదంటే మార్చుకుంటాను" అంది శార్వాణి.

ఎర్రరంగు చీర, దాని మీద లైట్‌గా

తెల్లటి ముత్యాల లాంటి పూసలతో లైట్ వర్క్ ఉంది. మాచింగ్ బ్లౌజ్ వేసింది. సన్నటి శంకులాంటి మెడలో ఒంటిపేట బంగారు గొలుసు, చెవులకు హేంగింగ్స్. చక్కగా పాపిడి తీసి దువ్వుకున్న జుత్తు, పొందికగా ఉంది. ఒక చేతికి రెండు బంగారు గాజులు, మరో చేతికి సన్నటి బాంగిల్ లాంటి వాచ్, సన్నటి వేళ్ళు. ఆమెను పైనుంచి కిందవరకు పరీక్షగా చూసిన కామాక్షి తృప్తిగా తలాడించింది. "నీకేమమ్మా, మహాలక్ష్మిలా ఉన్నావు. పద వెళ్దాం" అంది ముందుండి దారితీస్తూ. మనసులో మాత్రం అనుకుంది 'మీనాక్షి ఈ అమ్మాయిని చూస్తే తన కొడుక్కి చేసు కోవాలని ఆశ పడుతుందేమో' అని.

వాళ్ళ ఇంటి ముందు కారులో ప్రవీణ్ వెయిట్ చేస్తున్నాడు. జీప్ కన్వీనియెం ట్‌గా ఉండదని కారు తీసాడు డ్రైవర్. డ్రైవర్‌పక్క సీటులో ప్రవీణ్ కూర్చుని ఉన్నాడు. కామాక్షి వస్తుంటే డ్రైవర్ డోర్ తెరిచి పట్టుకున్నాడు. కామాక్షిని చూసి ప్రవీణ్ కూడా కారుదిగి "నమస్తే ఆంటీ" అన్నాడు.

ఆమె వెనక వస్తున్న శార్వాణిని చూసి ఆశ్చర్యపోయాడతను.

కారులో అంతా కూర్చున్నాక, మీనాక్షి అడిగింది "మీ అమ్మాయా..? "

"కాదు. మా అమ్మాయి ఫ్రెండ్. తను ఇప్పుడే హైదరాబాద్ నుంచి ఏదో పని ఉండి వచ్చింది. అమ్మవారి గుడికి నేనే రమ్మన్నాను. పేరు శార్వాణి" పరిచయం చేసింది.

"నమస్తే ఆంటీ" అంది శార్వాణి.

"నమస్తే అమ్మా. వీడు నా కొడుకు, ప్రవీణ్" అంది మీనాక్షి.

"హలో" అన్నాడు ప్రవీణ్.

"నమస్తే" అంది శార్వాణి.

"ఏమ్మా చదువు అయిపోయిందా? " అంది మీనాక్షి.

"అయిందండీ. టిసిఎస్‌లో జాయిన్ అయ్యాను."

"ఏమి పనిమీద వచ్చావమ్మా? " అడిగింది మీనాక్షి.

తల ఒంచుకుని కూర్చుంది. సమాధానం చెప్పటానికి ఇష్టపడటంలేదు అనుకుని ఆ ప్రశ్నను వదిలేసింది మీనాక్షి. వేరే కబుర్లు మొదలు పెట్టారు మీనాక్షి, కామాక్షి. అప్పుడప్పుడు శార్వాణి కూడా మాట కలిపింది.

చాముండేశ్వరీ దేవి దర్శనం చేసుకుని తిరిగి వచ్చేటప్పుడు, గిరిజ గురించి చెప్పింది శార్వాణి. మొదటిసారి ఆమెను

## కొత్తగాలి...

**ఏడుకొండలోడి**
**ఫారిన్ టూరు**
**ఆయనక్కూడా**
**విదేశీమోజు**

– *జి.వి.ఎస్. ప్రియంవద,*
*శ్రీకాకుళం*

చూసినప్పుడు ఆమెను ఎక్కడో చూసినట్లు ఉందని తనకు ఎందుకు అనిపించిందో ప్రవీణ్‌కి అప్పుడు అర్థమయింది.

గిరిజ చావు గురించి చెప్పినప్పుడు మీనాక్షికి, కామాక్షికి బాధకలిగింది. మీనాక్షి కొడుకుని అడిగింది, "ప్రవీణ్ ఈ కేసులో హంతకులను పట్టుకోలేదా ఇంకా? "

అప్పుడు చెప్పాడు ప్రవీణ్, "గిరిజతో పాటు చనిపోయిన అబ్బాయి మరెవరో కాదు మంజునాథ్ సారు ఒక్కగానొక్క కొడుకు ప్రశాంత్".

"అయ్యో, నాకు చెప్పనే లేదే" అంది

మీనాక్షి.

"బాధ పడతావనే చెప్పలేదమ్మా" అన్నాడు ప్రవీణ్.

"సరే ఇప్పుడు ఏం చెద్దామనుకుంటున్నావు? " శార్వాణిని అడిగింది మీనాక్షి.

"మా అక్క చనిపోయిన తర్వాత మా వంశంలో మరో ఇద్దరు కూడ చనిపోయారు. పదేళ్ళ పండు, మా పెదనాన్న కొడుకు రాంబాబు ఇద్దరూ అనుకోకుండా చనిపోయారు. మా నరసింహం బాబాయ్ కొడుకు మూర్తి, అతనితో నారాయణ అనే ఆయన ఉజ్జయిని వెళ్ళారు. అక్కడ వాళ్ళు ఇదంతా ఎవరో తంత్రగాడు చేయిస్తున్నాడని తెలుసుకున్నారు. వాడి పనిపడతామని మూర్తి మా నాన్నగారికి చెప్పాడు. వాళ్ళు ఏం చేస్తారో నాకు తెలియదు. ఆ దుర్మార్గులను పోలీసులు పట్టుకోకపోతే ఇంకా ఎంతమంది జీవితాలు నాశనం చేస్తారో. కదా? అందుకే ఇక్కడకు వచ్చి డిసిపి గారిని కలవాలనుకున్నా. లక్కీగా ఇలా మీతో నేను చెప్పాలనుకున్నదంతా చెప్పే అవకాశం వచ్చింది"

"తంత్రగాళ్ళు కూడా ఉన్నారా... ఈ దిక్కుమాలిన గూండాలకు వీళ్ళు కూడా తోడయితే ఇంకా ఘోరాలు చేస్తారు. ఆ దేవుడే వీళ్ళను శిక్షిస్తాడు" అంది కామాక్షి.

"అలా ఊరుకోలేం కదా ఆంటీ. మా వాళ్లు ఈ విషయంలో కొన్ని కీలకమైన వివరాలు సంపాదించారు. కేసు తిరిగి ఓపెన్ చేశాం. ఒక ముఖ్యమైన వ్యక్తిని రేపు అరెస్ట్ చేయొచ్చు" అన్నాడు ప్రవీణ్.

"అరెస్ట్ కాదురా, అట్లాంటి దుర్మార్గులను షూట్ చేసి పడేయ్. దేశానికి పట్టిన పీడ విరగడయిపోతుంది" అంది మీనాక్షి కోపంగా.

"అవును, అట్టే చెయ్యాలి" అంది కామాక్షి.

పెద్దగా నవ్వాడు ప్రవీణ్.

"ఏమ్మా నువ్వేమంటావు? " అంది మీనాక్షి.

"మీరు చెప్పింది నిజమే ఆంటీ. మా కుటుంబంలో ఈ నాలుగు నెలల్లో ముగ్గురు చనిపోయారు. అందుకే నన్నడిగితే, మీరు చెప్పినట్లు చేయడమే మంచిదంటాను" అంది శార్వాణి.

"మరి మీ నాన్నగారిని తీసుకుని వస్తే ఆయన కూడా కంప్లైంట్ చేసి ఉండేవారు కదా" అంది కామాక్షి.

"నేను ఇక్కడకు వచ్చిన విషయం మా ఇంట్లో తెలియదు ఆంటీ. నాన్న పోలీసులకు చెప్పి ప్రయోజనం లేదని అంటారు" చెప్పింది శార్వాణి.

ప్రవీణ్ ఏమి అనుకుంటాడో అని ఆమెకు అనుమానం వచ్చినట్లుంది, "సారీ, ఏమీ అనుకోకండి" అంది ప్రవీణ్‌తో.

"ఇట్సాల్ రైట్. ప్రజలు మమ్మల్ని నమ్మేంత గొప్పగా మేం పని చేయాల్సిన అవసరం ఉందిగా మరి" అన్నాడతను.

ఆ కారులో వారి మాటలు ఒక్కటి కూడా మిస్ కాకుండా శ్రద్ధగా విన్న వ్యక్తి ఒకరున్నారు.. అతనే ఆ కారు డ్రైవర్.

★ ★ ★

కేశవరెడ్డికి బెంగుళూరు సిటీలో అడ్వకేట్‌గా మంచి పేరు ఉంది. మైసూరులో బిజీ సెంటర్‌లో కూడా ఆఫీసు ఉంది. మైసూరు కేంద్రంగానే కార్యక్రమాలన్నీ చేస్తుంటాడతను. అతని చేతికింద అరడజను మంది జూనియర్లు ప్రాక్టీస్ చేస్తున్నారు. పబ్లిక్ దృష్టిలోను, పోలీసుల దృష్టిలోను బయటకు కనబడే జీవితం అది.

తిండికి లేక తిరుగుతున్న కేశవరెడ్డిని దూరపు బంధువు అయిన శకుంతల చేరదీసింది. ఆమె ఎలగప్ప ఇల్లాలు. మొదట్లో ఎలగప్ప చిన్న చిన్న దందాలు చేసేవాడు. ఎలగప్ప సంపాదన అంతంత మాత్రంగానే ఉన్నా భర్తని ఎలాగో ఒప్పించి కేశవరెడ్డిని

# ప్రకటన తెచ్చిన తంటా!




కాలిఫోర్నియాలోని పసిఫికా గ్రామంలో మూన్‌రేకర్ రెస్టారెంట్ యజమాని కెన్ ఆల్బర్ట్ వ్యాపారంలో భాగంగా 'ఆల్ యుకెన్ ఈట్' స్కీమ్ ప్రకటించాడు. ప్రతి ఆదివారం ఎవరైనా సరే, పదహారు డాలర్లు చెల్లించి ఎన్ని ఆయిస్టర్లనైనా ఆరగించవచ్చు. సాధరణంగా ఒకరు సగటున పన్నెండు ఆయిస్టర్స్‌ని మించి తినరు.

పోస్టల్ సర్వీస్‌లో పనిచేసే అలెన్‌వాల్డ్ అక్టోబర్ 2009లో ఓ ఆదివారం ఏకంగా 75 ఆయిస్టర్లు తిన్నాడు. యజమాని అతన్ని ఇక వెళ్లిపొమ్మని పంపించేసాడు. దాంతో అతడు స్మాల్ క్లైమ్స్ కోర్టుకెక్కాడు. తన సొమ్ముతోపాటు, నష్ట పరిహారాన్ని కూడా ఇప్పించమని కోరాడు. తన ప్రకటనకు హోటల్ యజమాని కట్టుబడకపోవడం తప్పని కేసు విచారించిన జడ్జి తీర్పు చెప్పాడు. కస్టమర్ చెల్లించిన మొత్తానికి పదిరెట్ల పైకాన్ని, 160 డాలర్లను నష్టపరిహారంగా ఇప్పించాడు. విచారణ సందర్భంగా జడ్జి అలెన్ వాల్డ్‌ను 'ఎన్ని ఆయిస్టర్లు తినగలవు?' అంటే, '125దాకా తినగలను' అని చెప్పాడతను. తర్వాత ఆ స్కీమ్ వెంటనే రద్దయిపోయింది.



శకుంతలే చదివించింది. చిన్నతనంలోనే ఎన్నో కష్టాలు పడ్డ కేశవరెడ్డికి జీవితం పైన కసి ఏర్పడింది. తననుంచి అన్నీ దోచుకున్న సంఘాన్ని వదలకూడదు అనుకున్నాడు. ఇష్టమొచ్చినట్లు దోచుకోవాలనుకున్నాడు. అలానే చేస్తున్నాడు. అతను గౌరవించేది శకుంతలను, భయపడేది ఎలగప్పకు. అంతే, ఇంకెవర్నీ లెక్క చేయడు.

ఆఫీసులో కూర్చుని ఉన్న కేశవరెడ్డికి సెక్రటరీ ఇంటర్‌కామ్‌లో ఫోన్‌చేసింది, "సార్, గోవర్ధన్ వచ్చాడు..కలవాలంట" అంది. చాలా ముఖ్యమైన విషయం అయితే తప్ప గోవర్ధన్ ఎప్పుడు పడితే అప్పుడు డిస్టర్బ్ చేయడు. అందుకే పంపించమన్నాడు, చదువుతున్న ఫైల్ మూసేస్తూ.

తలుపు తెరుచుకుని గోవర్ధన్ లోపలికి వచ్చాడు. కేశవరెడ్డిని చూసి పళ్ళన్నీ కనిపించేలా నవ్వాడు. నల్లగా పొట్టిగా ఉన్న గోవర్ధన్ మొఖానికి గారపట్టిన పళ్ళతో ఉన్న నవ్వు కాకి నోట్లో గారెముక్కలా కనిపించింది. ఈ కాకి కబురు చెప్పాలంటే దానికి మాంసం ముక్క వేయాలి. అయినా దాని నోట్లోనుంచి మొదలు మాటల గారె జారాలి కదా.

"చెప్పు గోవర్ధన్" అన్నాడు కేశవరెడ్డి.

సీటు ఆఫర్ చేసి, మంచినీళ్ళు తెప్పించి, కాఫీ పోయించి, కబుర్లు తెలుసుకోవడానికి సమయం ఉండదు. గోవర్ధన్ మళ్ళీ డ్యూటీకి పోవాలి మరి.

అతను డిసిపి ప్రవీణ్ జీప్ డ్రైవర్.

చక చక తను విన్న మాటలను కేశవరెడ్డి ముందు కక్కాడు. కేశవరెడ్డి చిన్న చిన్న ప్రశ్నలడిగి వివరాలు నోట్‌బుక్‌లో రాసుకున్నాడు. ఇంక తెలుసుకోవలసింది లేదనిపించాక, బ్రీఫ్‌కేస్ తెరిచి, వెయ్యినోట్లు పదితీసి టేబుల్‌పైకి విసిరాడు. మొఖ




## జూన్ -2010
## చతుర ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ అయిదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.




1. **ఎం.పద్మ** - ఇబ్రహింపట్నం, రంగారెడ్డి జిల్లా
2. **రావెళ్ళ పాప** - తార్నాక, సికింద్రాబాద్
3. **బి.కృష్ణవేణి** - టి.నగర్, చెన్నై
4. **బయన శ్రీకాంత్** - ట్రంక్‌రోడ్, ఖమ్మం
5. **కె.వరలక్ష్మి** - కామయ్యతోపు, విజయవాడ

### సరైన జవాబులు

**1. రమణి 2. మాసిలామణి 3. విఠల్ 4. ఆర్యా 5. పార్వతమ్మ 6. రాజాజీ 7. మృత్యుంజయమ్ 8. కీమారాణి 9. రాజేష్‌కుమార్ 10. కస్తూరిబా**

మంతా నవ్వు పులుముకుంటూ గోవర్ధన్ గబగబా ఆ నోట్లు ఏరుకున్నాడు.

తనకోసం పనిచేసేవారిని డబ్బుకి లోటు లేకుండా చూసుకోవడం కేశవరెడ్డి ప్రత్యే కత. అంతేకాదు మరొక ప్రత్యేకత కూడా ఉంది. ఉపయోగపడితే ఆలస్యం చేయ కుండా చేతికి డబ్బు ఎలా ఇస్తాడో, అలాగే డబుల్ క్రాస్ చేయాలని చూసే వాళ్ళను ఆలస్యం చేయకుండానే పైకి పంపిస్తాడు.

"పోయి వస్తాను సార్" అని వెళ్ళిపో యాడు గోవర్ధన్.

తను తెలుసుకున్న సమాచారాన్ని పెన్సి ల్‌తో పేపర్ పైన మూడు పాయింట్లుగా రాసుకున్నాడు. ఎంత జటిలమైన సమస్య అయినా పేపర్‌పై రాస్తే చిన్నగా కనిపి స్తుందని అతనికి అనుభవం నేర్పింది. పేపర్ వైపు దీక్షగా పది క్షణాలు చూసి, ఇంటర్‌కామ్‌లో సెక్రటరీకి "డోంట్ డిస్టర్బ్ మీ" అని చెప్పాడు. తర్వాత మొబైల్ తీసి ఎలగప్పకి ఫోన్ చేశాడు.

★ ★ ★

రుద్రప్పకి కళ్ళు తెరిచినా మూసినా శార్వాణి రూపమే కనబడసాగింది. ఆమె ఎవరు? గిరిజకి ఆమెకు సంబంధం ఉందా? డిసిపి ఆ వీధిలో ఎందుకు కని పించాడు? రకరకాల ఆలోచనలు అతన్ని ముసురుకుంటున్నాయి.

గిరిజని వెంటనే ఖర్చు చేయాల్సి వచ్చింది. మామూలుగా అయితే తనివి తీరేదాకా ఉంచి తర్వాత నిశ్శబ్దంలో కలిపే వాడు. సరే అనుకోకుండా ఇప్పుడు ఆమె లాంటి అమ్మాయే కనిపించేసరికి కోరిక బుసలు కొట్టసాగింది. ఎలాగైనా ఆమెను పొందాలనుకున్నాడు. తన నమ్మినబంటు జోసెఫ్‌ని పిలిపించాడు.

జోసెఫ్‌ది అథ్లెటిక్ బాడీ. టైట్ బ్లూ జీన్స్, దానిపైన ఒంటికి అతుక్కున్నట్టు ఉన్న మెరూన్ రంగు సింథటిక్ టీ షర్ట్ వేసుకున్నాడు. రూమ్‌లోకి వచ్చి "ఎస్ బాస్" అన్నాడు స్టైయిల్‌గా.

"జో, డిసిపి ఇప్పుడు ఎక్కడుంటు న్నాడు?" అన్నాడు రుద్రప్ప.

వెంటనే చెప్పాడు జోసెఫ్.

"గిరిజ గుర్తుందా? అలాంటి అమ్మాయే

నువ్వు చెప్పిన ఏరియాలో అదే క్రాస్‌లో నాలుగో ఇంట్లో ఉంది. బిల్డింగ్‌పైన 'దేవీ నిలయం' అని రాసుంటుంది. ఆ అమ్మాయిని తీసుకురావాలి. లోకల్ వాళ్ళు వద్దు. డిసిపి ఇంటికి సెక్యూరిటీ ఉంటుంది. లోకల్ వాళ్ళయితే పోలీసులు గుర్తుపడతారు. కేర్ తీసుకో" అన్నాడు రుద్రప్ప.

గిరిజని జోసఫ్ మరిచిపోలేదు. ఆమెలానే ఉండే అమ్మాయి మైసూరులో మళ్ళీ కనిపించడం ఏమిటీ అనే ప్రశ్నలు అతనికి రాలేదు. బాస్ మాట తు.చ తప్పకుండా పాటించి బాస్‌ని హాపీ చేయడం ఒకటే తెలుసు జోసెఫ్‌కి.

"ఓకే బాస్" అని వెళ్ళిపోయాడు.

★ ★ ★

శార్వాణికి ప్రవీణ్‌తో మాట్లాడి గిరిజ కేసులోని ప్రోగ్రెస్ తెలుసుకోవాలని ఆశ. అంతేకాదు వీలుంటే గిరిజ, ప్రశాంత్ చనిపోయిన హోటల్‌కి వెళ్ళి అక్కడ వారి స్మృతికి పూలుంచి రావాలని కూడా ఉంది. తనేకాదు, మైసూరులోను, బెంగుళూరులోను చాలామంది ఆ ప్రేమికుల మరణానికి తమ సానుభూతిని, మాఫియాపై తమ నిరసనను తెలపాలని అనుకుంటూ ఉంటారని ఆమె ఉద్దేశం.

అనుకోని సంఘటనలు జరిగితే ఎలా స్పందించాలో మనకు తెలియదు. మనకనే కాదు ఎవరికీ తెలియదు. నాగరికత పరిణామ దశలో ఒక జాతి తన సామూహిక భావాలను బహిర్గతం చేయడానికి మార్గాలను అన్వేషిస్తుంది. కొత్తకొత్త మార్గాలను పరిశీలిస్తుంది. పనికివస్తాయి అనుకున్నవాటిని తన భాండారంలో నిక్షిప్తం చేసుకుంటుంది. అవసరం పడినప్పుడు సందర్భానుసారంగా ఉండే ప్రతిస్పందనలను అటువంటి భాండారం నుంచి బయటకు తీసి వాడుతుంది. విద్యావంతులు, మేధావులు, సంఘంపట్ల బాధ్యతగా మెలిగేవారు తమ ఆలోచనలను మథించి అటువంటి ప్రతిస్పందనలను తయారుచేయాలి. 'యద్యదా చరతి శ్రేష్టః' అన్నట్లు అలాంటి ఉత్తములు ఆచరించేవి ముందు ముందు అందరూ ఆచరిస్తారు.

కామాక్షికి చెప్పి ఇంటి నుంచి బయటకు వచ్చింది శార్వాణి. ప్రవీణ్ నెంబరు చాముండికి వెళ్ళినప్పుడు తీసుకుంది. ఆ నెంబరుకి ఫోన్‌చేసి అతని ఆఫీసుకి వెళ్ళే ముందు ఒకసారి అతనితో మాట్లాడదామనుకుంది. మొబైల్ తీసి రింగ్ చేసింది.

"హలో" అన్నాడు ప్రవీణ్.

"నేను శార్వాణిని. మీ ఆఫీసుకు రావచ్చా" అంది.

"వై నాట్? " అన్నాడు ప్రవీణ్.

"సరే వస్తున్నా" అని అటుగా వెళ్తున్న ఆటో ఎక్కి కమీషనర్ ఆఫీసు అంది.

ఆమె ఆటో ఎక్కటం, జోసెఫ్ గ్యాంగ్ ఆ వీధిలోకి రావటం ఒకేసారి జరిగింది. శార్వాణి ఆటో ఎక్కటం చూసాడు గాని అందులోకి ఎక్కిన వ్యక్తి కచ్చితంగా శార్వాణా కాదా అని అర్థం కాలేదు జోసెఫ్‌కు. అయినా తమలో ఒకడైన సంపత్‌ని దింపి, ఆటోను ఫాలో అవ్వమని చెప్పాడు.

★ ★ ★

కేశవరెడ్డి ఎలగప్పకి ఫోన్‌చేసి గోవర్ధన్ చెప్పిన విషయాలు చెప్పాడు.

"ఇప్పుడు గోవర్ధన్ చెప్పిన మాటల్లో మూడు ముఖ్యమైన విషయాలు ఉన్నాయన్నావు. ఏందవి? " అన్నాడు ఎలగప్ప.

"అన్నిటికన్నా ముఖ్యమైనది, డిసిపి రేపు ఎవర్నో అరెస్ట్ చేస్తానన్నాడట. మన రుద్రప్పకి, నీకు యాంటిసిపెటరీ బెయిల్ కోసం హైకోర్టులో పిటిషన్ వేయించాలి" అన్నాడు కేశవరెడ్డి.

"రెండోది? "

మొదటిది విని చీమ కుట్టినంత రియాక్షన్ కూడా చూపలేదు ఎలగప్ప.



ఎలగప్ప సంగతి తెలుసు కనుక కేశవ రెడ్డి ఏమీ ఫీలవకుండా, "రెండోది మూర్తి, నారాయణ అని ఇద్దరు గిరిజ కుటుంబానికి చెందినవాళ్ళు ఇప్పుడు ఉజ్జయినిలో ఉన్నారు. మన మనుషులను వెంటనే పంపి వాళ్ళను ఫాలో చేయించాలి".

"సరి ఇక మూడోది నేను చెప్తున్నా" నవ్వుతూ అన్నాడు ఎలగప్ప.

"చెప్పు బావా? "

"సరేలే, ముందే నువ్వు మొత్తం సమాచారం చెప్పినావు కదా? వాటిలో రెండు వదిలేస్తే మిగిలిన విషయమే మూడోది. అదేదో నువ్వు చెప్పులే అప్పా."

"ఇంకేముంది. మిగిలిందే అనుకో. కాని నాకు ఇదే చాలా ఎక్కువ ఆశ్చర్యం కలిగించింది" అన్నాడు.

"టైమ్ తినేస్తున్నావు బామ్మర్దీ. విషయానికి రా. ఆ మల్ల తీరి కూచోని ఆశ్చర్యపోదువులే" అన్నాడు ఎలగప్ప విసుగ్గా.

"గిరిజ తర్వాత జరిగిన మరణాలు ఎవరో తంత్రగాడు చేసిన పూజల ఫలితంగా జరిగినయ్యని మూర్తివాళ్ళు చెప్తారంట. ఆ విషయం వాళ్ళకు తెలిసిందంటే వాళ్లు కూడా ఎవరో మంత్రగాడిని పట్టుండాలి. ఇది వెంటనే కురుప్పుకి చెప్పి మన జాగ్రత్తలో మనం ఉండాలి. నాకయితే మొదటి రెండు విషయాలకంటే దీని గురించే భయమవుతుంది బావా" అన్నాడు కేశవరెడ్డి.

"శభాష్ బామ్మర్దీ! లేటుగానయినా నీ బుర్ర సరిగానే పని చేసింది. నా లిస్టులో ఫస్టు ఏందో తెలుసా? "

"చెప్పు బావా"

"నువ్వు లాస్ట్ చెప్పి ఉండలే అదే. వెంటనే కురుప్పుతో మాట్లాడి అతన్ని జాగ్రత్తపడమని చెప్పాలి. శత్రువులకు మన గురించి తెలిసిపోతే వాండ్లు మనం కొట్టే దెబ్బ కాసుకుంటారు. అట్లనే మనల్ని



దెబ్బ కొట్టేదానికి ప్లాన్ చేసుకుంటారు. మనం వాండ్లను సర్‌ప్రైజ్ చేసే అవకాశం పోగొట్టుకుంటాం" ఎలగప్ప యుద్ధ నీతిని బామ్మర్దికి ఉపదేశించాడు.

"సరే బావా.. ఇంకేమి చేయాలి? " ఎలగప్ప తెలివిని మనసులోనే మెచ్చుకుంటూ అన్నాడు కేశవరెడ్డి.

"యాంటిసిపేటరీ బెయిల్ కోసం ప్రయత్నించకు. ప్రవీణ్‌కు అనుమానం వస్తుంది. వాడికి గాని గోవర్ధన్ పైన అనుమానం వస్తే డేంజర్" అన్నాడు ఎలగప్ప.

"డేంజర్ ఏముంది? వాడి ఎదురుగా మాట్లాడటం మానేస్తాడు. లేదా వాడిని కొట్లో ఏసి కుమ్ముతాడు. మనకేంది? " అన్నాడు కేశవరెడ్డి భయపడవల్సినంత సీనేముంది అనుకొంటూ.

"బామ్మర్దీ, బుర్ర ఉపయోగించు. నువ్వు చెప్పినట్లు చేయకుండా, గోవర్ధన్‌తో మనకు తప్పుడు సమాచారం పంపితే, మనం ట్రాప్‌లో పడతాం" అన్నాడు ఎలగప్ప.

ఎలగప్ప విశ్లేషణ విని నోరు తెరిచాడు కేశవరెడ్డి. "బావా నువ్వు ఎందుకు అంత సామ్రాజ్యాన్ని ఏలుతుండావో ఇప్పుడు తెలిసింది. సరే బెయిల్ విషయం మరిచిపోతాను. అరెస్టుచేస్తే అప్పుడు రంగంలోకి దిగుతాను. ఇంకేమి చేయాలో చెప్పు" అన్నాడు కేశవరెడ్డి.

"ఉజ్జయినికి మనవాళ్లను పంపటం బ్యాడ్ ఐడియా" సీరియస్‌గా ఆలోచించేటప్పుడు అలా ఇంగ్లీషులోకి జారుతుంటాడు.

"ఎందుకు? " అడిగాడు కేశవరెడ్డి.

"వాళ్ళు అక్కడ ఎంత కాలం ఉంటారో తెలియదు. మనవాళ్లను అక్కడకు పంపిస్తే అక్కడి మనుషుల్లో వీళ్ళు ప్రత్యేకంగా కనిపిస్తారు. శత్రువులు మనం వాళ్ళకోసం మనుషులను పంపామని అర్థం చేసుకుంటారు. జాగ్రత్త పడతారు. అందుకే అక్కడివాళ్ళను రంగంలోకి

దింపుదాం."

"హేట్సాఫ్, బావా. నీకు నువ్వే సాటి. నువ్వు ఉజ్జయిని విషయం చూసుకో. నేను కురుప్పుతో మాట్లాడతాను" అన్నాడు కేశవరెడ్డి.

"సరే, ప్రవీణ్‌పై ఒక కన్నేసి ఉంచు" అని లైన్ కట్ చేశాడు ఎలగప్ప.

★ ★ ★

ప్రవీణ్ తన ఛాంబర్‌లోని సోఫాలో కూర్చుని ఉన్నాడు. డిసిపి ఛాంబర్ విశాలంగా ఉంది. ఎగ్జిక్యూటివ్ ఛైర్, దాని ముందు పెద్ద టేబుల్, ఒక పక్కగా అందమైన సోఫాసెట్, చిన్న టీపాయ్ ఉన్నాయి.

శార్వాణి తన ఛాంబర్‌లోకి రాగానే ఎందుకో ఎక్సైట్‌మెంట్‌కి గురయ్యాడు. చటుక్కున లేచి ఆమెను లోపలికి ఆహ్వానించాడు. టేబుల్ దగ్గర కూర్చోబోతుంటే, సోఫాల వైపు దారితీసి 'ఇలా రండి' అని అక్కడ కూర్చోబెట్టాడు. మంచినీళ్ళు తెచ్చిన ఆర్డర్లీకి వచ్చిన అతిథి సారుకి బాగా కావలిసినవారని అర్థమయింది.

"ఊఁ చెప్పండి" అన్నాడు శార్వాణి కంఫర్టబుల్‌గా కూర్చున్నాక.

"అక్క కేసులో ప్రోగ్రెస్ ఎలా వుందో తెలుసుకోవాలనిపించింది. కారులో అంతా వివరంగా మాట్లాడటానికి కుదరలేదు. మీకు అభ్యంతరం లేకపోతే, నాకు వివరాలు ఏమైనా చెప్పగలరా?" అడిగింది శార్వాణి.

లేచి కబోర్డ్ దగ్గరకు వెళ్ళి లోపలినుంచి ఒక డోసియర్ తీశాడు. ఆ కేసు తన మాస్టారు మంజునాథ్ కొడుకు హత్య కేసు. అందుకే పర్సనల్‌గా ఇన్వాల్వ్ అయి పని చేస్తున్నాడు ఆ కేసు పైన. సాధారణంగా ఆ డోసియర్‌లోని వివరాలు పబ్లిక్‌తో డిస్కస్ చేయవలసిన అవసరం పోలీసు అధికారిగా అతనికి లేదు. ఇప్పుడు శార్వాణి విషయం వేరు. పక్కింటి ఆంటీ దగ్గర పరిచయం. ఆంటీకి అమ్మకు ఉన్న స్నేహం వల్ల శార్వాణికి మామూలు కంటే కొంచెం ఎక్కువ విలువ ఇస్తున్నాడు అంతే. అంతేనా అంటే అతని వివేకం అంతే అని బుకాయిస్తుంది గాని, అతని మనసు ఏ సమాధానం చెప్పటం లేదు. ఎందుకంటే అది అతని దగ్గర లేదు. అది ఎప్పుడో శార్వాణి దగ్గరకు వెళ్ళిపోయింది.

డోసియర్ ఆమె ముందు పెట్టి ఒక్కో పేజీ తీసి అందులో వివరాలు వీలైనంత సరళంగా చెప్పడం మొదలుపెట్టాడు.

"మీ అక్కయ్య, ప్రశాంత్ ఆ ఫేట్‌ఫుల్ డే మైసూరు వచ్చి ఒక హోటల్‌లో దిగారు. కర్ణాటకలో ఈ మధ్య వెలుగులోకి వస్తున్న మాఫియా ఒకటి ఉంది. దీని కార్యకలాపాలు గనులు ఉన్నచోట ఎక్కువగా ఉన్నాయి గనుక దీన్ని 'గనుల మాఫియా' అంటున్నాం. వీళ్ళు నిజంగా అండర్ గ్రౌండ్ క్రిమినల్స్ అన్నమాట. వీళ్ళ ముఖ్యనాయకుడు ఎలగప్ప. మోస్ట్ డేంజరస్ క్రిమినల్. ఎన్నో కేసుల్లో అనుమానితుడు. కాని ఒక్క ఆధారం కూడా లేదు. అందుకే ఏంచేయలేకపోతున్నాం. పోలీస్ డిపార్ట్‌మెంట్‌లో కూడా వీళ్ళకు మనుషులు ఎందరో ఉన్నారు.

మీ అక్కవాళ్ళు ఆ హోటల్‌లో దిగిన రోజే ఎలగప్ప కొడుకు పుట్టినరోజు. ఆ పార్టీకి ఎలగప్ప రైట్‌హాండ్ కేశవరెడ్డి కూడా వచ్చాడు. అతను ఒక క్రిమినల్ లాయర్. రెండోపదంకంటే మొదటి దానికి అతని జీవితం సరిపోతుంది. ఇక పోతే రుద్రప్ప. ఇతను ఎలగప్ప కొడుకు. చాలామందికి తెలియని విషయం ఏమంటే అతను డ్రగ్ ఎడిక్ట్. అంతేకాదు పర్వర్ట్ కూడా. అతనిపైన ఎన్నో రేప్ కేసులు, మర్డర్ కేసులు ఉన్నాయి. రేప్ కేసులలో బాధితులు కేసులు వెనక్కి తీసే

# విడాకుల కారణాలెన్నెన్నో!




అమెరికాలో విడాకులు తీసుకునేందుకు అత్యల్ప విషయాలూ కారణాలే. కనెక్టికట్ రాష్ట్రానికి చెందిన ఓ భర్త తన భార్యకి విడాకులు ఇవ్వడానికి కోర్టులో చెప్పిన కారణం, "మా ఆవిడ ఫ్రిజ్ మీద తను బ్రిడ్జిక్లబ్‌కి వెళ్తున్నట్లు, ఛానల్ 2లో రాత్రి డిన్నర్ ఎలా ప్రిపేర్ చేయాలో చెప్తారని, అలా చేసుకుని తినమని నోట్ వదిలి వెళ్లింది" అన్నాడట.




కెంటకీలోని హజార్డ్ గ్రామానికి చెందిన ఓ భర్త విడాకులివ్వడానికి చెప్పిన కారణం, "నా భార్య హేంబర్గర్‌లోని ఉల్లిపాయలని నేను తినకుండా ప్రతీసారి తీసేస్తోంది"

సౌత్ కెరోలినాలోని బెండ్స్‌విల్ ఊరిలోని ఓ బధిరుడు తన భార్యకి విడాకులివ్వడానికి చెప్పిన కారణం, "ఆమె సంజ్ఞల భాష నేర్చుకుని చేతులతో హేళన చేస్తూ తిడుతోంది"

కొలరాడోలోని కేన్ సిటీకి చెందిన ఓ భర్త విడాకులకి చెప్పిన కారణమిది, "నా గర్ల్‌ఫ్రెండ్ ఇంటివైపు నుంచి వెళ్లేటప్పుడు మా ఆవిడ నన్ను కార్లో తలవంచుకొని కూర్చోమని బలవంతం చేస్తోంది"

జార్జియాలో హార్డ్‌విక్ ఊరికి చెందిన ఓ భార్య విడాకులివ్వడానికి కారణం తీవ్రమైన ప్రేమేనని చెబుతోంది- "మా ఆయన ఎక్కువసేపు ఇంట్లో ఉంటాడు. నేను భరించలేనంత ప్రేమని కూడా చూపిస్తాడు"

సుకుంటారు. మర్డర్ కేసుల్లో వేరేవాళ్ళు హత్యాయుధంతో వచ్చి సరెండర్ అయిపోతుంటారు. అతనిపైన ఈగ వాలకుండా చూసుకుంటాడు కేశవరెడ్డి.

రుద్రప్ప బర్త్‌డే రోజు మీ వాళ్ళకు అతనికి మధ్య ఎలాంటి ఘర్షణ జరిగిందో తెలియలేదు. ఏదో జరిగే ఉంటుంది. రుద్రప్ప గ్యాంగ్ ఇన్వాల్వ్ అయ్యారు. ఆధారాలు దొరకకుండా చేయడంలో కేశవరెడ్డి దిట్ట. ఆ రోజు జరిగిన దానిలో అతని హాండ్ కూడా ఉందని మా అనుమానం.

ఈ మధ్య ఒక 'ఐ విట్‌నెస్' సాక్ష్యమివ్వటానికి ముందుకు వచ్చింది. ఆమె ఇచ్చిన సాక్ష్యాన్ని బట్టి ఈ కేసులో ఇద్దర్ని రౌండప్ చేయాలనుకుంటున్నా. ఒకసారి నా చేతికి వాళ్ళు దొరికితే వాళ్ళతో నిజం కక్కిస్తా"

శార్వాణికి వివరంగా చెప్పాడు ప్రవీణ్. కాని ఒకే విషయం దాచాడు. రుద్రప్పకి తాను చేసిన రేప్‌లను వీడియో తీయించే అలవాటు ఉందనే విషయం.. అతని పెర్వెర్షన్‌లో అదొక భాగం అనేది ప్రవీణ్‌కి క్రిమినల్ సైకాలజిస్టులు చెప్పారు.

ఆ సున్నిత విషయం చెప్పటానికి అతనికి నోరు రాలేదు.

అతను చెప్పిన విషయాలన్నీ శ్రద్ధగా వింది శార్వాణి. డోసియర్‌లో అతను చూపిన ఫొటోలన్నీ చూసింది.

ప్రవీణ్, గిరిజ కేసు గురించి బాగా శ్రద్ధ పెట్టినట్లు కనిపించి సంతోషించింది. "చాలా థాంక్స్ ప్రవీణ్, నాకు మా అక్క అంటే చాలా ఇష్టం. ఆమెను దారుణంగా హత్యచేసిన దుర్మార్గులకు తగిన శిక్ష పడుతుందని నాకు నమ్మకం వచ్చింది. మీ మేలు మరిచిపోలేను" అంది.

ఆమె కన్నుల్లో నీటిపొర కదిలింది.

ప్రవీణ్‌కి చాలా బాధ అనిపించింది. ముందుకు వంగి ఆమె చేతులను తన చేతుల్లోకి తీసుకుని, "డోంట్ బి సిల్లీ" అంటూ మృదువుగా నొక్కి వదిలాడు.

ఆర్డర్లీ తెచ్చి ఇచ్చిన బిస్కట్లు తిని, టీ తాగి "ఇక వెళతాను" అంది శార్వాణి.

"అప్పుడేనా?" అన్నాడు అసంకల్పితంగా. ఆశ్చర్యంగా చూసిందామె.

"హైదరాబాద్ వెళ్ళిపోతున్నారా, లేక కొద్ది రోజులు ఉంటారా?" అన్నాడు. తను ఆమె ముందు అప్పుడే బయట పడిపోవడం అతనికిష్టంలేదు.

"నేను వచ్చిన పని మీ చేతుల్లో సేఫ్‌గా ఉంది. ఇక నేను ప్రశాంతంగా ఉండొచ్చు.

కొత్తగాలి... 

**ఊళ్లో**
**బావి ఇంకిపోయింది**
**ఇంట్లో**
**కన్నీళ్లు ఊరుతున్నాయి**

**– ఆలూరి అరుణ్‌కుమార్,**
అభంగపట్నం, నిజామాబాద్ జిల్లా

రేపే ఇంటికి వెళ్ళిపోతాను" అంది లేచి నిలబడుతూ.

ఆమెతోపాటు బయటకి వచ్చాడు. "ఆటో పిలిపించనా?" అంటూ ఆమె సమాధానం కోసం ఎదురు చూడకుండా, దగ్గరలోని కానిస్టేబుల్‌కి సైగ చేశాడు. అటుగా వెళ్తున్న ఆటోను ఆపాడు, కానిస్టేబుల్. ఆటోఎక్కి ప్రవీణ్‌వైపు నవ్వుతూ చూస్తూ "బై" అని చెప్పింది. తనకు చెందినదేదో తన నుంచి దూరంగా పోతున్నట్లు, బాధగా, భారంగా అనిపించింది ప్రవీణ్‌కి.

ఆటో ఎక్కాక గిరిజ దిగిన హోటల్ పేరు చెప్పింది శార్వాణి. ఎందుకో ఒకసారి తన అక్క చనిపోయిన చోటు చూడాలనిపించిందామెకు.

★ ★ ★

జోసెఫ్‌కి సంపత్ ఫోన్‌చేసి ఆటో దిగిన అమ్మాయి డిసిపిని కలవటానికి వెళ్ళింది అని చెప్పాడు. ఆమె బయటకు వచ్చేవరకు ఉండి మళ్ళీ ఫాలో చెయ్యమని చెప్పాడు జోసెఫ్. చాలాసేపటికి శార్వాణితోపాటు డిసిపి కూడా బయటకు వచ్చి ఆటో ఎక్కించిన విషయం జోసెఫ్‌కి చెప్పాడు, సంపత్.

ఆమెను ఫాలో చేయటానికి పక్కనే ఉన్న ఆటోని పిలిచి ఎక్కాడు సంపత్. కొంచెం ముందుకి వెళ్ళేసరికి ట్రాఫిక్ సిగ్నల్ దగ్గర వాళ్లఆటో ట్రబుల్ ఇచ్చింది. శార్వాణి ఆటో వెళ్ళిపోతుంటే తన ఆటోదిగి వేరే ఆటో కోసం ప్రయత్నించాడు గాని ఒక్కఆటో కూడా దొరకలేదు. వెంటనే జోసెఫ్‌కి ఫోన్‌చేసి జరిగింది చెప్పాడు సంపత్.

ఒక మనిషిని ఆ వీధిలో ఉంచి వెహికిల్ తీసుకుని సంపత్ ఉన్న ఏరియాకి వెళ్ళాడు జోసెఫ్. అక్కడ సంపత్‌ని కలుసుకుని ఆమె వెళ్ళిన దిక్కువైపు ఇద్దరూ వెతుక్కుంటూ వెళ్ళారు.

★ ★ ★

బీహార్‌లోని గయ జిల్లాలో ఉన్న 'సిజువా' గ్రామం చాలా చిన్నది. ఇది బుద్ధ గయకు దగ్గరలో పాతిక కిలోమీటర్ల దూరంలో ఉంది. బౌద్ధులు దీన్ని ఒక ముఖ్యమైన పుణ్యక్షేత్రంగా భావిస్తారు. ఊరిలో ఉన్న గుహలు ఆర్కియాలజీ డిపార్ట్‌మెంట్ పరిశోధనలో ఈ మధ్యనే బయటపడ్డాయి. 'సిజువా'లో ఒకే ఒక మందిరం ఉంది. అది శివుని ఆలయం. ఆలయ పూజారికి ఎనభైయేళ్ళు. చేసినంత కాలం శివుని అభిషేకం అర్చనాదులు చేసాడు. ఇక శక్తిలేక తన కొడుకు సోమే

శ్వర్ త్రిపాఠీకి ఆ బాధ్యతలు అప్పగించాడు.

బుద్ధగయలో ఉన్న ఆర్కియాలజీ ఆఫీసరు తన పరిధిలో ఉన్న పూజార్ల అధీనంలో ఉన్న పురాతనవిగ్రహాలతో ఒక ప్రదర్శన ఏర్పాటు చేయాలనుకున్నాడు. ఆసక్తికరమైన విగ్రహాలను బుద్ధగయకు తీసుకురమ్మని అందరికీ కబురంపాడు.

సోమేశ్వర్ త్రిపాఠి తన కొడుకు కాశ్యప్‌ను తనదగ్గర ఉన్న ప్రత్యేకమైన విగ్రహాలను తీసుకుని వెళ్ళమని చెప్పాడు. కాశ్యప్, తన స్నేహితుడు సంతోష్‌ని వెంట బెట్టుకుని విగ్రహాలను ఒక పెద్దట్రంక్‌లో పెట్టి బస్సులో బుద్ధగయకు బయలుదేరాడు. సంతోష్ తనతోపాటు ఒక చిన్న బ్యాగ్ తీసుకుని వచ్చాడు.

"అదేమిటి సంతోష్, బ్యాగ్ బరువుగా ఉన్నట్లుంది" అన్నాడు కాశ్యప్.

"అది ఒక చిన్న విగ్రహం. అది రాజులదో, దేవుడిదో కూడా మా ఇంట్లో ఎవరికీ తెలియదు. మా తాతగారి తాతగారు ఎక్కడెక్కడి విగ్రహాలో సేకరించేవారట. వాటిలో చాలావరకు మా తాతగారి హయాంలో అడిగినవారికి అడిగినట్లు ఇచ్చేసారట. ఇది ఒక్కటి మిగిలింది. మా నాన్నగారు ఆడుకోవడానికి ఈ విగ్రహాన్ని ఉంచేశారట. ఇప్పుడు ఆయన ఆరోగ్యం బాగోడం లేదు. డబ్బుకి ఇబ్బందిగా ఉంది. దీన్ని బుద్ధగయలో టూరిస్టులకు అమ్మితే డబ్బులు వస్తాయని తీసుకు వస్తున్నాను" అని చెప్పాడు సంతోష్.

"ఏదీ చూడనియ్యి" అని బాగ్ తెరిచి చూశాడు కాశ్యప్. అతనికీ ఆ విగ్రహం ఎవరిదో తెలియలేదు. విగ్రహానికి గడ్డం, మీసాలు కూడా చెక్కి ఉన్నాయి. నుంచుని ఉన్న ఆకారం, చేతిలో పెద్దకత్తి! అది చైనీస్ విగ్రహమేమో అనుకున్నాడు కాశ్యప్. ముట్టుకుని చూశాడు. చాలా చల్లగా ఉంది.

'భలే ఉంది' అని బ్యాగ్ మూశాడతను.

వారెక్కిన బస్ బుద్ధగయ వైపు సాగిపోయింది.

★ ★ ★

శార్వాణి ఆటోదిగి హోటల్‌లోకి వెళ్ళింది. హోటల్ ముందు చక్కటి లాండ్‌స్కేపింగ్ ఉంది. హోటల్ ఎలివేషన్ రాజసం ఉట్టిపడుతోంది. ఆమె వెనకే రెండు బైక్స్ వచ్చాయి. వాటి పైనుంచి దిగిన ఇద్దరు దృఢకాయులు బయటే నుంచుని శార్వాణిని గమనిస్తున్నారు.

తిన్నగా లోపలికి వెళ్లిన శార్వాణికి ఎదురుగా వినాయకుడి విగ్రహం కనిపించింది. రంగురంగుల పూలతో, ఆకులతో అలంకరించబడి ఉంది. ఒక పక్కగా రిసెప్షన్, మరోపక్కగా గిఫ్ట్ షాప్, ఇంకొక వైపు పెద్ద పెద్ద సోఫాలతో లాంజ్.. శార్వాణి గిఫ్ట్ షాప్‌లో ఒక మంచి బొకే తీసుకుంది.

మళ్లీ వినాయకుడి మందిరం దగ్గరకు వచ్చి తన హాండ్‌బాగ్‌లో నుంచి ఒక ఫోటోతీసి మందిరంలో వినాయకుని పాదాల దగ్గర పెట్టింది. తర్వాత చేతిలోని బొకేని ఆ ఫోటో దగ్గర ఉంచింది.

తర్వాత చేతులు జోడించి గిరిజ ఫోటోని చూస్తూ మనసులో "అక్కా, ఈ హోటల్‌లోనే నిన్ను కిరాతకంగా చంపిన దుర్మార్గులకు తగినశిక్ష పడేలా చూస్తాను" అని ప్రమాణం చేసింది.

రిసెప్షన్‌లోని సిబ్బంది ఆమెను చూశారు. లాంజ్‌లో కూర్చున్న ఫారినర్స్ కూడా ఆమెను చూశారు. చివరకు ఎండి రూమ్‌లో నుంచి రిసెప్షన్ వైపు వస్తున్న రుద్రప్ప కూడా చూశాడు. మేకపిల్ల పులి గుహలోనే దొరికింది అనుకుంటూ వెంటనే జోసెఫ్‌కి ఫోన్ చేద్దామనుకుంటుండగా అతని ఫోన్ మోగింది. ఎవరికోసమైతే ఫోన్ చేయాలనుకున్నాడో ఆ జోసెఫ్

నుంచే కాల్!

రుద్రప్పని చూసి రిసెప్షన్ సిబ్బంది ఎలర్ట్ అయ్యారు. శార్వాణి ఆ హోటల్ కస్టమర్ కాదని వాళ్ళకు తెలుస్తూనే ఉంది. అందుకే వినాయకుడి దగ్గర ఫోటో ఉంచి, పూలు పెట్టి నమస్కారాలు చేస్తుంటే ఆమెను ప్రశ్నించటానికి ఆ వైపు వెళ్ళారొకరు. శార్వాణిని వెంబడించి వచ్చిన ధృఢకాయుల్లో ఒకడు అతనివైపు కళ్ళురిమి చూసి చూపుడువేలు అడ్డంగా తిప్పాడు. దాంతో ఎక్కడివాడు అక్కడే నిలబడిపోయాడు.

తనపని చూసుకుని శార్వాణి నెమ్మదిగా వెనుదిరిగి హోటల్ బైటకు నడిచింది.

కాస్త వెనకగా ఆ ధృఢకాయులు ఆమెను అనుసరించారు.

రుద్రప్ప ఫోన్ ఆన్‌చేసి "చెప్పు జో" అన్నాడు.

"బాస్, ఆ అమ్మాయిని డిసిపి ఆఫీసు తర్వాత మిస్ అయ్యాం. ఎక్కడికి పోయిందో తెలియటం లేదు."

"ఎక్కడికో పోలేదు. తిన్నగా మన హోటల్‌కే వచ్చింది."

"వాట్ ఎ లక్. మన వాళ్ళకు చెప్పండి పట్టేస్తారు" అన్నాడు అతను ఉత్సాహంగా.

"పిచ్చోడా, దాని వెనక మఫ్టీలో యాంటీ గూండా స్క్వాడ్ మనుషులు ఉన్నారు. దానికి, ఆ పోలీసోడికి ఏదో లింకు ఉందిరా" అన్నాడు రుద్రప్ప, ఏమీ చేయలేక పోతున్నందుకు ప్రవీణ్‌పై కోపంతో రగిలిపోతూ.

★ ★ ★

కేశవరెడ్డికి రాత్రి పది గంటలకు టైమ్ ఇచ్చాడు కురుప్పు.

ఆ రోజు ఏవో పూజలలో ఉన్నాను వీలుపడదు అని చెప్పినా కేశవరెడ్డి చాలా అర్జంట్ విషయం అనేసరికి సణుక్కుంటూ సరేనని ఆ టైమ్ చెప్పాడు.

కేశవరెడ్డి కురుప్పుకి నచ్చే మందు, తిండి సిద్ధంచేసి ఉంచి, అతని కోసం తన ఆఫీసులోనే కూర్చున్నాడు. వాచ్‌మాన్ తప్ప ఇంకెవరూ లేరు. స్టాఫ్ అంతా ఆరు గంటలకే వెళ్ళిపోయారు. ముఖ్యమైన పనులు ఉన్నాయని చేస్తూ కూర్చున్న కొద్దిమందిని ఎనిమిది గంటల వరకు చూసి, 'రేపు చేసుకోవచ్చు వెళ్ళండి' అని పంపించేశాడు కేశవరెడ్డి.

టీవీలో ఇంగ్లీషు సినిమా చూస్తూ కురుప్పు కోసం వెయిట్ చేస్తున్నాడు. కురుప్పు కరెక్టుగా పది గంటలకు వచ్చాడు. వాచ్‌మాన్ అతని వెంట లోపలి వరకు వచ్చి కేశవరెడ్డి కురుప్పుని ఆహ్వానించిన తర్వాత సెల్యూట్ చేసి వెళ్ళిపోయాడు.

అతను వెళ్ళేవరకు ఉండి, తర్వాత కురుప్పుని మాట్లాడించాడు కేశవరెడ్డి.

"నీకోసంగతి చెప్పాలని పిలిపించాను" ఉపోద్ఘాతంగా అన్నాడు.

టేబుల్‌పైన ఉన్న స్నాక్స్ తీసుకుని నోట్లో వేసుకుంటూ తలపైకి ఎత్తి నల్లకళ్ళద్దాలలో నుంచి చూశాడు కురుప్పు.

"ఈ రోజే ఒక సమాచారం తెలిసింది" అతనిలో ఆసక్తి పెంచడానికి కాస్త వ్యవధి ఇచ్చాడు కేశవరెడ్డి.

"ఇద్దరు మనుషులు ఉజ్జయినిలో ఉన్నారు. ఒకడి పేరు మూర్తి, మరొకడు నారాయణ. వాళ్ళిప్పుడు బుద్ధగయ వెళ్ళే దారిలో ఉన్నారు" తన గ్లాసులో విస్కీ పోసుకుంటూ అన్నాడు కురుప్పు.

తెల్లబోయి చూశాడు కేశవరెడ్డి.

ఎక్కడో సిటీ బయట ఉండి ఎంత సమాచారం సేకరిస్తున్నాడో! వీడు మనిషి కాదు అనుకున్నాడు కేశవరెడ్డి.

అతని మనసులో ఆలోచనలు చదువుతున్నట్లు చూసి నవ్వాడు, కురుప్పు. "మరొక విషయం ఉంది. గిరిజ చెల్లెల్ని

నువ్వు కిడ్నాప్ చేయాలి. అది మన దగ్గర ఉంటే మీ ముగ్గురి ప్రాణాలు కాపాడగలుగుతా. ఇప్పటికే మీకోసం నా శక్తినంతా ధారపోస్తున్నాను" అన్నాడు కురుప్పు.

"కిడ్నాపే కదా.. రేపు ఉదయాన్నే మనుషుల్ని దింపుతా పనిలోకి"

"అదంత తేలిక కాదు. ఇంటినుంచి బయటకు వచ్చినప్పుడు ఆమెకు ఫుల్ సెక్యూరిటీ ఉంటుంది. రుద్రప్ప ఆమెను వెంటాడటం ప్రవీణ్ చూశాడు."

రుద్రప్ప ఆమెను చూసిన సంగతి కేశవ రెడ్డికి తెలియదు. కురుప్పు ఎక్కడో కూర్చుని ఇక్కడి విషయాలన్నీ సినిమా చూసినట్లు చూస్తున్నాడు అని తెలిసి విస్తుపోయాడు.

"ఆమె రేపు పదిగంటల ఫ్లైట్‌లో హైదరాబాద్ వెళ్లిపోతుంది"

"పోనీ హైదరాబాద్‌లోనే చేయించమంటావా? " సాలోచనగా అడిగాడు కేశవరెడ్డి.

గట్టిగా నవ్వాడు కురుప్పు. తర్వాత కేశవరెడ్డి వైపు కొంచెం ఒంగి "నేను చెప్పినట్లు చెయ్యి" అన్నాడు.

★ ★ ★

మరునాడు ఉదయం ఎనిమిది గంటలకు కామాక్షి పూజలో ఉండగా కాలింగ్ బెల్ మోగింది. హాల్లో కూర్చుని పేపర్ చదువుతున్న శార్వాణి, పేపర్ టీపాయ్ పైన పడేసి, లేచివెళ్లి తలుపు తీసింది. బయట వైట్ యూనిఫాంలో ఇద్దరు నుంచుని ఉన్నారు. అందులో ఒకరు డాక్టర్‌లా ఉన్నారు. రెండవ వ్యక్తి అసిస్టెంట్‌లా ఉన్నాడు.

"ఎవరు కావాలి? " అంది శార్వాణి.

డాక్టరు నవ్వుతూ జేబులో నుంచి ఏదో తీసి చేతిలో పట్టుకుని, "మీరు హైదరాబాదు నుంచి వచ్చారా? " అన్నాడు.

"అవును, ఎందుకు అడిగారు? " ఆశ్చర్యంగా చూస్తూ అంది.

"ఏం లేదు, మీతో కొంచెం పని ఉంది" అంటూ చేతిలో పట్టుకున్న వస్తువుని ప్రెస్ చేసాడు. శార్వాణి మొఖంపై ఏదో తియ్యని వాసన అలుముకుంది. క్షణాల్లో ఆమె స్పృహ కోల్పోయింది. పట్టుతప్పి జారిపోతున్న ఆమెను చటుక్కున పట్టుకున్నారు ఇద్దరూ. ఇంతలో బయట ఆగి ఉన్న అంబులెన్స్‌లో నుంచి మరో ఇద్దరు స్ట్రెచర్ తీసుకుని దిగి వచ్చారు. శార్వాణిని దానిపై పడుకోబెట్టి చకచకా తీసుకెళ్లి అంబులెన్స్‌లో ఎక్కించారు. మరుక్షణమే అంబులెన్స్ వేగంగా వెళ్లిపోయింది.

"ఎవరమ్మా బెల్ కొట్టింది" అని అడిగిన కామాక్షికి శార్వాణి బదులు ఇవ్వకపోయేసరికి ఆమె హాల్లోకి వచ్చి చూసింది.

## కొత్తగాలి...

**కాకులకి**
**నూకలు**
**'గద్ద'లకి**
**రూకలు**

*– గంపా శ్రీదేవి*, సింహాచలం

తలుపు తెరిచి ఉంది. టీపాయ్ మీద పేపర్ గాలికి కదులుతూ ఉంది. బయటకు వచ్చి 'శార్వాణి, శార్వాణి' అని పిలిస్తే బదులు లేకపోయేసరికి, గట్టిగా అరుస్తూ తెరిచి ఉన్న గేటు దగ్గరికి వచ్చింది. ఆమె అరవడం చూసి పక్కింటి దగ్గర ఉన్న కానిస్టేబుల్ వచ్చాడు.

"ఏమైందమ్మా, అమ్మాయిని హాస్పిటల్‌కి పంపించారు" అన్నాడు.

కామాక్షి గోలగోలగా అరిచేసరికి లోపలి నుంచి ప్రవీణ్ పరిగెత్తుకుంటూ వచ్చాడు. అక్కడ పరిస్థితి చూసి అతనికి జరిగిన

విషయం అర్థమయింది.

శార్వాణి కిడ్నాప్ అయింది.

పళ్లు కొరుకుతూ 'రేయ్ రుద్రప్పా, నీకు మూడింది' అనుకున్నాడు ప్రవీణ్.

★ ★ ★

బుద్ధ గయలో మంచి హోటల్‌లో రూమ్ తీసుకున్నారు ముగ్గురు మిత్రులు.. డ్రైవర్ అనుభవమైనవాడు, ఇన్నోవా కొత్తది కావటంతో వారి ప్రయాణం తొందరగాను, సుఖంగాను జరిగింది. అప్పటికే ముగ్గురూ స్నానాలు చేసి విశ్రాంతిగా కూర్చున్నారు.

నారాయణకు ఏదో తెలియని ఉత్సాహం కలుగుతోంది. అతను ఎక్కువ మాట్లాడటానికి సుముఖంగా లేడు. ప్రయాణంలో కూడా అలాగే ఉన్నాడు. సోఫాలో కూర్చుని మూర్తి, సూర్యం మాట్లాడుతుంటే నవ్వు మొఖంతో చూస్తున్నాడు.

"సూర్యం భోజనం ఆర్డర్ ఇచ్చేవా? " అడిగాడు మూర్తి.

ఇచ్చానన్నట్లు తల ఊపాడు సూర్యం.

"వెజిటేరియనేనా? "

"నీకు కావాలన్నా నాన్ వెజిటేరియన్, బుద్ధగయ హోటళ్లలో పెట్టరు" అన్నాడు.

"బీహార్‌లో అంతా గూండాయిజమ్ ఎక్కువంటారు, అటువంటి చోట సాత్వికంగా కూడా ఉంటారా? " కొంచెం ఆశ్చర్యం, కొంచెం మెచ్చుకోలు ధ్వనిస్తూ అన్నాడు మూర్తి.

"మూర్తీ నీకో విషయం తెలుసా? " నారాయణ మాట్లాడుతూ అన్నాడు.

"బీహార్ పేరు 'విహార' అనే మాట నుంచి వచ్చింది. బౌద్ధ సన్యాసులు నివాసముండే స్థలాలను 'విహార' అంటారు" అన్నాడు తనే మళ్లీ.

"నిజమే. ఇక్కడ ఉన్నన్ని విహారాలు, ఆరామాలు దేశంలో మరెక్కడా లేవు" అన్నాడు సూర్యం.

"అందుకేనా ఈ వెజిటేరియనిజమ్? బాగుంది. కాలం ఎంత విచిత్రమైనది. శాంతి మంత్రం బోధించినచోట హింసా కాండకు ఒడిగడుతున్నాడు మానవుడు"

అంతలో భోజనాలు వచ్చాయి.

"ఈ రోజుకి విశ్రాంతి తీసుకోండి, రేపు ఊరు చూపిస్తాను" అన్నాడు సూర్యం.

అంతా భోజనాలు చేసి నిద్రపోయారు.

వాళ్లు నిద్రపోయిన అయిదు నిముషాలకు హోటల్ మేనేజర్ వచ్చి వాళ్లు ఉన్న రూముకి రెండు వైపులా ఉన్న రెండు రూములను, ఎదురుగా ఉన్న రెండు రూములను బలవంతంగా ఖాళీ చేయించాడు. అందులోని వాళ్లకి వేరే రూములు ఇచ్చాడు. ఖాళీ అయిన రూముల్లో అదే ఊరికి చెందిన మనుషులు కొందరు చేరిపోయారు. వారిలో ఒకడు కారిడార్‌లో కుర్చీ వేసుకుని నైట్ డ్యూటీ చేయసాగాడు.

★ ★ ★

కాశ్యప్, సంతోష్ బుద్ధగయకు చేరారు.

వారిలాగ ఇతర ప్రాంతాలనుంచి విగ్రహాలతో వచ్చిన వారికి వుండటానికి ఒక కాలేజిలో క్లాస్ రూములను కేటాయించారు నిర్వాహకులు. వచ్చిన వాళ్ల పేర్లు, వారు తీసుకువచ్చిన విగ్రహాల వివరాలు రాసుకున్నారు. ఆ విగ్రహాలకు సంబంధించిన సమాచారాన్ని క్లుప్తంగా రాసి చిన్న చిన్నకార్డులు తయారు చేసుకుంటున్నారు. ఆర్కియాలజీ డిపార్ట్‌మెంట్ ఏర్పాటు చేస్తున్న ప్రదర్శన ఆ మరుసటిరోజు ఉంటుంది. ఆదివారం అయితే కాలేజికి సెలవు కాబట్టి విశాలమైన కాలేజి గ్రౌండ్ వాడుకోవడానికి వీలుపడుతుందని అలా ప్లాన్ చేసుకున్నారు.

కాశ్యప్, సంతోష్‌లు భోజనం చేసి పడుకున్నారు. సంతోష్ తన బ్యాగుని తలకింద పెట్టుకున్నాడు. కొంచెంసేపటికి తల అంతా వేడెక్కినట్టనిపించి గబుక్కున లేచి కూర్చున్నాడు. అతను హఠాత్తుగా లేచేస

రికి కాశ్యప్ లేచి "ఏమయింది? " అన్నాడు.

"ఏమో తల బాగా వేడెక్కిపోయింది" అన్నాడు తల తడుముకుంటూ.

"బాగా వేడివేడి ఆలోచనలు వస్తున్నాయా? " మిత్రుణ్ణి ఆట పట్టిస్తూ, అతని తల తడిమాడు కాశ్యప్.

నిజంగానే తల వేడిగా ఉంది.

"జ్వరంగాని వచ్చిందా? "

తల అడ్డంగా ఊపుతూ సంతోష్ తన బాగ్ తడిమి చూసాడు. గబగబా దాన్ని తెరచి లోపల ఉన్న విగ్రహాన్ని బయటకు తీయబోయాడు. ముట్టుకోగానే బాధగా అరిచి చెయ్యి వెనక్కి లాక్కున్నాడు. లోపలి విగ్రహం వేడి సెగలు వదులుతోంది.

మిత్రులిద్దరూ ఆశ్చర్యపోయారు. 'ఎందుకిలా అయింది' అనుకున్నారు. వారికేం చేయాలో తోచలేదు. కొంచెంసేపు తర్వాత మళ్లీ చూస్తే ఆ విగ్రహం ఎప్పటిలాగా చల్లగా ఉంది.

సంతోష్ ఆ బ్యాగుని తలకింద పెట్టుకోకుండానే పడుకున్నాడు.

అతనికేం తెలుసు? నారాయణకు అపకారం తలపెట్టిన మనుషులు అతనికి అతి చేరువగా వచ్చేసరికి మహాభైరవుడికి కోపం వచ్చిందని.

★ ★ ★

బుద్ధగయలోని మహాబోధి వృక్షం బౌద్ధులకు పరమ పవిత్రమైనది. బుద్ధుడికి జ్ఞానోదయం కలిగింది ఆ చెట్టు కిందే. ఆ చెట్టు కింద ఉన్న ఎర్రటి రాతిపైనే బుద్ధ భగవానుడు ధ్యానానికి కూర్చున్నాడు. ప్రపంచంలోని బౌద్ధులందరికీ జీవితంలో ఒక్కసారైనా ఈ ప్రాంతం దర్శించాలనే కోరిక ఉంటుంది.

బుద్ధగయలో చూడాల్సిన ప్రదేశాలను చూసుకుంటూ మెల్లగా తిరగసాగారు నారాయణ, అతని మిత్రులు. వాళ్లకు కాస్త వెనకగానే కాక రెండువైపులా కూడా బీహారుగ్యాంగ్ మనుషులు నడుస్తున్నారు.

## పడవ కార్లంటే పడదు!

పార్లమెంటు సభ్యుల మధ్య ఇంపోర్టెడ్ కార్ల గురించి గందరగోళంగా చర్చ కొనసాగుతోంది. చాలాసేపట్నుంచి, లాల్‌బహదూర్ శాస్త్రి శ్రద్ధగా ఈ హడావిడి చూస్తూ ఊరుకున్నారు. కాస్సేపయ్యాక ఇక ఉండబ



ట్టలేక లేచి 'నా వరకు నేను ఎప్పుడూ పెద్దకార్లలో ప్రయాణం చేయను. ఆ పడవ కార్లలో కూచుంటే నన్నెవరూ చూడలేరు. గుర్తించలేరు. నేను చిన్నమనిషిని కదా' అన్నారు. ఒక్కసారిగా రసాభాసగా వున్న హాల్లో నవ్వుల వాన కురిసింది.

అసలు విషయం ఏమంటే- ఎలగప్ప తన నెట్‌వర్క్ ఉపయోగించి బీహారులోని ముఖ్యమైన గ్యాంగ్‌ని కాంటాక్ట్ చేశాడు. బుద్ధగయలో ఆపరేషన్ చేయాలంటే అక్కడి లోకల్ గ్యాంగ్‌ని ఉపయోగించాలని చెప్పాడు భీమ్‌సింగ్. అతను పాట్నా నుంచి ఆపరేట్ చేస్తాడు. బీహార్‌లో గ్యాంగ్‌లు చాలా ఉన్నాయి. వారి పరిధులు స్పష్టంగా ఉంటాయి. ఒకరి ఏరియాలోకి మరొకరు సాధారణంగా వెళ్లరు.

అందుకే భీమ్‌సింగ్ బుద్ధగయలో పని చేసిపెట్టడానికి గయలో ఉన్న కంచన్ దాదాని కాంటాక్ట్ చేశాడు. బుద్ధగయలో నారాయణ బృందాన్ని ఇప్పుడు కవర్ చేస్తున్నది కంచన్ దాదా మనుషులే.

కంచన్ దాదా తన రైట్ హాండ్ ఖాసిమ్‌ని అక్కడపని చూడమని పంపించాడు.

వాళ్లు ఫాలో చేయవలసిన ముగ్గురు మనుషులలో ఇద్దరి ఫోటోలు వాళ్లకు ఫాక్స్‌లో వచ్చేసాయి. హైదరాబాద్ ప్రైవేట్ డిటెక్టివ్‌లు పంపిన ఫోటోలు బెంగుళూరుకి అక్కడ నుంచి పాట్నాకు, అట్నుంచి గయకు వచ్చాయి. ఖాసిం వాటి సాయంతోనే నారాయణ బృందం దిగిన హోటల్‌ని నిముషాల్లో ఐడెంటిఫై చేశాడు.

ఖాసింకి యాక్షన్ సినిమాలంటే చచ్చేంత ఇష్టం. అటువంటివాడిని థియేటర్‌లో బలవంతంగా కూర్చోబెట్టి ఒక డాక్యుమెంటరీ చూపిస్తే ఎలా ఫీలవుతాడు? ఈ ముగ్గురి వెంట తిరుగుతుంటే అలాగే ఫీలవుతున్నాడు. వాళ్లు ఆగితే ఆగటం, నడిస్తే నడవటం. వాళ్లు ఏ చెట్టునో పుట్టనో విడ్డూరంగా చూస్తుంటే తాము కూడా పక్కనే ఉన్న రాయినో రప్పనో ఆసక్తిగా చూడటం.. చాలా విసుగ్గా ఉంది ఖాసింకి. అతని అనుచరులు కూడా ఇంచుమించుగా అదే పరిస్థితిలో ఉన్నారు.

చూసి చూసి తనే మొబైల్ తీసి కంచన్ దాదాకి రింగ్ చేశాడు.

"భాయ్, ఇప్పుడేం చేయాలి? " అన్నాడు, భోజ్‌పురిలో సాధ్యమైనంత గౌరవంగా.

అవతల నుంచి "ఠు హైర్" అని ఫోన్ కట్ చేసాడు కంచన్ దాదా.

చిర్రెత్తి పోయింది ఖాసింకి. ఫోన్ జీన్స్ బాక్ పాకెట్‌లోకి తోసి తుపుక్కున ఊసాడు కసిగా. అతని అనుచరులకు అతని మూడ్ బాగోలేదని అర్థమయింది. దిక్కులు చూస్తూ తమ రొటీన్ ప్రకారం ముందుకు సాగారు.

కంచన్ దాదాకి కూడా ఖాసిం టెన్షన్ అర్థమయింది. ఎటాక్ చెయ్యమంటే ఫోన్ కట్ చేసేలోపే అటువైపు మనిషి ఖతం అయిపోతాడు ఖాసిం చేతిలో. అలాంటివాడిని పులికి చైన్‌వేసి మేక పైకి దుమకకుండా ఆపుతున్నట్లు ఉంది. ఆపేవాడికే తెలుస్తుంది ఆ కష్టం. అతనికి కూడా విసుగొచ్చింది. మొబైల్ ఎత్తి ఫోన్ చేయబోయి 'ఛత్' అని మళ్లీ పక్కనే పెట్టేశాడు.

తమకు వచ్చిన సూచనల ప్రకారం ఆ ముగ్గురిలో ఎవరైనా ఒక విగ్రహాన్ని కొన్నా మరేవిధంగానన్నా పొందినా వెంటనే ఎటాక్ చేసి ఆ విగ్రహాన్ని తీసుకొని వాళ్లను కుమ్మేయాలి. తర్వాత ఆ విగ్రహాన్ని పాట్నా తీసుకుపోవాలి. అంత క్లియర్‌గా చెప్పిన తర్వాత విసుగ్గా ఉంది అంటే ఎవరేంచేస్తారు? ఒప్పుకున్నాక తప్పుతుందా మరి, వేచి ఉండాల్సిందే అనుకున్నాడు కంచన్ దాదా.

నారాయణ దృష్టిని 'ఆర్కియలాజికల్ ఎగ్జిబిషన్' అనే బానర్ ఆకర్షించింది. లోపలికి బయటకు జనాలు తిరుగుతున్నారు. పెద్ద గ్రౌండ్‌లో ఉంది ఆ ప్రదర్శన. అక్కడే కాశ్యప్, సంతోష్‌లు కూడా ఉన్నారు. కాశ్యప్ తమ విగ్రహాలు ప్రదర్శన కోసం ఉంచినచోట నిలబడి, సందర్శకులకు వివరాలు చెప్తున్నాడు. సంతోష్ అతనికి సహాయంగా ఉన్నాడు. అతని భుజానికి బ్యాగ్ వేలాడుతోంది.

మూర్తి, సూర్యంలను ఆ ప్రదర్శనశాలలోకి తీసుకెళ్ళాడు, నారాయణ.

అక్కడ ఉన్న విగ్రహాలను చూడగానే మూర్తి, సూర్యం ఎలర్ట్ అయిపోయారు. అక్కడ వాళ్లకు ఆ విగ్రహం దొరకవచ్చని అన్పిస్తోంది. నారాయణ కూడా అక్కడ ఏదో శక్తి నిండి ఉన్నట్లు గమనించాడు. అటూ ఇటూ చూస్తూ తిన్నగా కాశ్యప్ ఉన్నచోటుకి వచ్చాడు. అక్కడి విగ్రహాలను చూస్తూ నిలబడ్డాడు. మూర్తి ముందుకి వంగి ఒక విగ్రహాన్ని అందుకుని పరిశీలించసాగాడు. ఆ విగ్రహం వివరాలు చదవడానికి ప్రయత్నిస్తుంటే కాశ్యప్ దాని గురించి చెప్పసాగాడు.

★ ★ ★

ఎలగప్ప తన ఇంట్లో నుంచే బీహార్ లోని విషయాలను ఫోన్‌ద్వారా తెలుసు కుంటున్నాడు. బుద్ధ గయలో నారాయ ణను, అతని మిత్రులను హోటల్ రూమ్‌లో కనుక్కున్నప్పటినుంచి కంచన్ దాదా డైరెక్ట్‌గా ఎలగప్పతో కాంటాక్ట్ అవు తున్నాడు. కంచన్ ఆ విషయం చెప్పిన తర్వాత కురుప్పు సూచనలు అతనికి చెప్పాడు. విగ్రహం వాళచేతికి వెళ్లేవరకు ఆగమని, ఆ తర్వాతే ఎటాక్ చేయమని.

కాని ఆలోచిస్తుంటే అందులోనే ఏదో మెలిక ఉందనిపించింది అతనికి. విగ్రహం ఆ పండితుడికి దొరికితే అతను తమకు మరణశాసనం రాస్తాడని చెప్పాడు కురుప్పు. అతన్ని ముందే చంపుదామంటే అతని ఆచూకి పట్టుకోవడం కష్టం అన్నాడు. అతను గిరిజ వంశస్థుడు కాడని చెప్పాడు. అందుకే అతని ప్లాన్ ప్రకారం తాను ఫాలో అయిపోతున్నాడు. కాని ఇప్పుడు ఓ సందేహం వస్తోంది.

మనుషుల ఆచూకి తెలిసిన తర్వాత విగ్రహంతో తనకి ఏంపని? మరి కురుప్పు ఎందుకు ఆగమంటున్నాడు. అదే మెలిక అనిపించింది.

కురుప్పుకి ఆ విగ్రహంతో పనుండి ఉంటుంది. ఒకవేళ ఆ విగ్రహం ఆ పండి తుడికి దొరికేక అతన్ని ఆపగలిగే శక్తి కురుప్పుకి ఉందో లేదో? ఆలోచిస్తే విగ్రహంకోసం ఆగకుండా మనుషుల్ని లేపేస్తేనే కరెక్ట్ అనిపించింది. వెంటనే ఫోన్‌తీసి కంచన్ దాదాకి రింగ్ చేసాడు. కంచన్ ఫోన్‌తీసి అన్నాడు, "బోలోభాయ్"

"విగ్రహం దొరికే వరకు చూడొద్దు. ప్లాన్ మారింది. వాళ్లను లేపేయండి" అన్నాడు హిందీలో.

"అచ్ఛా" అని ఫోన్ కట్ చేశాడతను. హుషారుగా ఈలవేస్తూ ఖాసిం నెంబరు నొక్కాడు. ఖాసిం హలో అనగానే, "వేసే యాలని తొందరమీద ఉన్నావు కదా వేసేయ్. ముగ్గుర్నీ లేపేయ్"

"ఠీక్" అని ఫోన్ కట్‌చేశాడు ఖాసిం.

★ ★ ★

ముందు నడుస్తున్న తన మనుషులకు సైగ చేశాడు ఖాసిం.

ఖాసిం ముందుకి దూకటానికి సిద్ధంగా ఉన్నాడు. సంతోష్ బ్యాగ్‌లోని మహా భైరవ విగ్రహం మెల్లమెల్లగా వేడెక్కడం ప్రారంభించింది. ఆ సెగకు సంతోష్ బ్యాగ్‌ని తీసి టేబుల్‌మీద పెట్టాడు. మూర్తి తనచేతిలో విగ్రహాన్ని అలాగే పట్టుకుని తన వెనక వస్తున్న టూరిస్టులకు దారి ఇవ్వడానికి కొంచెం జరిగాడు.

> **కొత్తగాలి...**
>
> **'ఫ్లే' స్కూలే...**
> **ఫీజు రాజుకుంది**
> **తండ్రిగా.. నా జీవితంతో**
> **'ఆట' మొదలైంది**
>
> – మరో భారతీయుడు

ఖాసిం సైగందుకుని మూర్తికి ముందున్నవాడు అతని చేతిలోనుంచి విగ్ర హాన్ని లాక్కున్నాడు. ఏం జరిగిందో తెలు సుకునేలోపు ఖాసిం ముందుకి దూకాడు.

మూర్తికి ఏదో ప్రమాదం వాటిల్లబోతోం దని నారాయణ మనసుకి తోచింది. గట్టిగా "మూర్తీ" అని గావుకేక పెట్టాడు. మూర్తికంటే త్వరగా స్పందించిన సూర్యం ఖాసింని అడ్డుకోవడానికి ప్రయత్నించాడు.

వేగంగా ముందుకి కదలిన ఖాసిం చేయి మూర్తి గుండెలకు బదులు సూర్యం పొట్టకు తగిలింది. అతని చేతిలోని చుర కత్తి సూర్యం పొట్టను చీల్చింది. గాయం

లోనుంచి రక్తం బుడబుడ పొంగింది.

నారాయణలో ఆగ్రహం పెల్లుబికింది..

"మహా భైరవా" అంటూ దిక్కులు పిక్క టిల్లేలా అరిచాడు. అతను ఒక ఉన్మత్తుడిగా మారిపోయాడు. సూర్యంపై దాడి జరిగేసరికి తనలో ఉప్పొంగిన అంతులేని ఆవేశంతోను, మహాభైరవుడి మానవాతీత శక్తి తనకు అండగా ఉందన్న విశ్వాసంతోను ఒక్కసారిగా వేయి ఏనుగుల బలం ఆవహించింది.

ఆ అరుపుకి అక్కడివారు క్షణకాలం ఉలిక్కిపడ్డారు.

తర్వాత విషయాలు ఎంత వేగంగా జరిగాయంటే, అక్కడే ఉండి అవి చూసినవారు కూడా వాటిని పూర్తిగా గమనించలేకపోయారు.

ఖాసింని జుత్తు పట్టి గిరగిర తిప్పి గోడకేసి కొట్టాడు నారాయణ ఒంటిచేత్తో. ఒక్క గెంతుతో మూర్తి చేతినుంచి విగ్రహాన్ని లాక్కున్న వాడి ముందుకి దుమికి, పిడికిలి బిగించి, వాడి దవడపై కొట్టాడు. చేతిలోని విగ్రహాన్ని జారవిడిచి పది అడుగుల దూరానికి ఎగిరిపడ్డాడు వాడు.

కింద పడుతున్న విగ్రహాన్ని పువ్వులా ఒకచేత్తో పట్టుకుని గిరుక్కున వెనక్కి తిరిగాడు నారాయణ. శిఖ విడిపడి జుత్తు భుజాలపై వరకూ వేలాడుతూ ఉంది. కళ్లు చింతనిప్పుల్లా మండుతున్నాయి. ఖాసిం మనుషులు అతన్ని చూసి భయంతో బొమ్మల్లా నిలబడిపోయారు.

ఒక్కడినీ వదలకుండా అందరికీ ఒక్కో ప్రహారాన్ని ప్రసాదించాడు నారాయణ.

క్షణాల్లో కుప్పకూలిపోయారు వాళ్లంతా.

చేతిలోని విగ్రహాన్ని టేబుల్ పైన పెట్టి సూర్యం దగ్గరికి వెళ్లాడు నారాయణ.. పొట్టనుంచి రక్తం కారుతోంది. అమాంతంగా అతన్ని ఎత్తుకుని బయటకు పరిగెత్తాడతను. మూర్తి కూడా అనుసరించాడు. టేబుల్ పైన బ్యాగ్‌ను అందుకుని సంతోష్ కూడా వాళ్ల వెంట పరిగెత్తాడు. ఎందుకు పరిగెత్తాడో అతనికి తెలియదు.

దక్షవాటికను తలపించిందా ప్రదర్శనశాల. సతిని భుజాన వేసుకున్న శివుడిలా నారాయణ. అతని మనసులో ఒకే ఆలోచన, ఎలాగైనా సూర్యాన్ని కాపాడాలి.

గ్రౌండ్ నుంచి బయటకు రాగానే ఎదురుగా కనిపించిన సెవెన్ సీటర్‌లోకి దూకి 'హాస్పటల్' అని గర్జించాడు. మూర్తి పరుగున వచ్చి అతని పక్కనే కూర్చున్నాడు. సంతోష్ కూడా వేగంగా వచ్చి వారితో పాటు కూర్చుని, డ్రైవర్‌తో దగ్గరలోని హాస్పటల్ పేరు చెప్పి వెంటనే తీసుకెళ్లమని భోజ్‌పురిలో చెప్పాడు.

★ ★ ★

ప్రవీణ్ పోలీస్ ఫోర్స్‌ని ఎలెర్ట్ చేశాడు. శార్వాణి గురించి అన్ని పోలీసు స్టేషన్లకు సమాచారం వెళ్లిపోయింది. మైసూరు నుంచి బయటకు వెళ్లే అన్ని రోడ్లలో చెక్ పోస్టులు పెట్టించాడు. రుద్రప్ప హోటల్‌ని పోలీసులతో చుట్టుముట్టించాడు. ఒక ఇన్‌స్పెక్టర్‌ని రుద్రప్ప ఎదురుగా కూర్చోమన్నాడు. 'డిసిపి వస్తారు. ఆయనే మాట్లాడుతారు' అని చెప్పమన్నాడు. రుద్రప్ప ఎవరికి ఫోన్‌చేసినా ఆ కాల్ మానిటర్ చేయమన్నాడు.

రుద్రప్పని, మైసూరుని కూడా అష్టదిగ్బంధనం చేసేసాడు ప్రవీణ్.

ప్రవీణ్ ఎలా ఆలోచిస్తాడో ఊహించి దాన్ని ఎదుర్కోవడానికి పకడ్బందీగా ప్రతివ్యూహం పన్నాడు కేశవరెడ్డి.

అంబులెన్స్ రెండు వీధులు దాటగానే అందులోనుంచి శార్వాణిని టాటా సఫారీలోకి మార్చారు. అంబులెన్స్‌ని అక్కడే వదిలేశారు. టాటా సఫారీ పది నిముషాలు ప్రయాణించి ఒక కళ్యాణ మండపం దగ్గర ఆగింది. శార్వాణిని లోపలకి తీసుకె

## ఉద్యోగం ఊడగొట్టిన గాంధీజీ?

నిన్నటి నిజం

గాంధీజీ హరిజన యాత్ర చేపట్టిన రోజులు. అందులో భాగంగా అనంతపురం జిల్లాకు వచ్చారు. స్థానిక నేతలతో కలిసి గ్రామసీమల్లో హరిజనోద్ధరణకు నిధులు వసూలు చేశారు.

అనంతపురం జిల్లా కాంగ్రెస్ నేతలలో కల్లూరు సుబ్బారావు ముఖ్యులు. అనంతలో హరిజన బాలుర వసతిగృహంకోసం జరుగుతున్న కృషిని వివరించారు. కల్లూరివారి కథనంతో తృప్తి చెందిన గాంధీజీ జిల్లాలో హరిజన నిధికి వసూలైన రూ. 1116/- ను వసతిగృహం ఏర్పాటుకు వినియోగించమని సుబ్బారావు చేతిలో ఉంచారు.



గుంతకల్లు దగ్గరలోని కొనకొండ్ల గ్రామంలో కక్షలు, కొట్లాటలు ఎక్కువగా ఉన్నందున ఆ పల్లెటూరిని గాంధీజీ పర్యటన మార్గంలో ఉండకుండా చూడమని పోలీసు అధికారులు చెప్పారు. ఆ పల్లెకు బాపూజీ రాకతో శాంతి నెలకొంటుందని, ప్రజల్లో పరివర్తన వస్తుందని సుబ్బారావు చెప్పారు. నాటి జిల్లా కలెక్టర్, ఎ.ఎం.ఎ.సి. గెలిటీ దొర, చివరికి పోలీసులను వారికి సహకరించాల్సిందిగా ఆదేశించారు.

గాంధీజీని తమ ఇంట్లో ఆతిథ్యం స్వీకరించేందుకు అంగీకరింపజేయమని సుబ్బారావును గెలిటీ దంపతులు కోరారు. హరిజన నిధికి ఓ రూపాయి అయినా విరాళమిస్తే అంగీకరిస్తారని చెప్పారు. దానికి గెలిటీ దంపతులు అంగీకరించి గాంధీజీకి ఆతిథ్యమిచ్చి తలా ఓ రూపాయి విరాళం ఇచ్చారు. బ్రిటిషు ప్రభుత్వం గాంధీజీకి కలెక్టర్ ఆతిథ్యమివ్వడం తప్పుబట్టి ఆయనను ఉద్యోగం నుంచి తొలగించింది.

విచిత్రం ఏమిటంటే ఈ గెలిటీ దొర కుమారుడే 1947 ఆగస్టు 14 రాత్రి బళ్ళారి కలెక్టరుగా బ్రిటీష్ జెండాను దించి, కల్లూరు సుబ్బారావుతో మువ్వన్నెల జెండా ఎగురవేయించారు

నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం..

ళ్లారు. అక్కడ వేచి ఉన్న మేకప్‌మాన్ ఆమెకు మేకప్ చేశాడు. అరగంట తర్వాత ఆమెను చూస్తే ఒక ముసలి ఒగ్గులాగా ఉంది. మొఖం అంతా ముడతలు, కళ్ళ కింద నల్లని వలయాలు, ఆమె భుజాల చుట్టూ ఒక వెలిసిపోయిన షాల్‌ను ఆమె కట్టుకున్న షిఫాన్ చీర కనబడకుండా కప్పారు. తర్వాత బయటకు తీసుకువచ్చి, అక్కడ ఉన్న టూరిస్ట్ బస్‌లో కూర్చోబెట్టారు. పక్కనే మరొక మధ్యవయసు స్త్రీని కూర్చోబెట్టారు. ఆ బస్‌నిండా కేశవరెడ్డి కిరాయికి తెచ్చిన మనుషులే ఉన్నారు.

ఆమె ఇంకా ఆరుగంటలు మత్తులో ఉంటుందని డాక్టరు కేశవరెడ్డికి చెప్పాడు. బస్ చెక్‌పోస్టు దగ్గర ఆపితే ఆమెకు ఒంట్లో బాగాలేదని నిద్ర పోతోందని చెప్పమన్నాడు కేశవరెడ్డి బస్‌లోని తనవారితో.

శార్వాణి కిడ్నాప్ అయిన గంటకి ఆమె ఉన్న టూరిస్ట్ బస్ మైసూరు పొలిమేరలోకి వెళ్లిపోయింది.

ఆ బస్‌ని పోలీసులు ఆపారు. ఫొటో పట్టుకుని బస్‌లోకి ఎక్కిన కానిస్టేబుల్ ఒకసారి అందర్నీ చూసి దిగిపోయాడు. మరొక పోలీస్ పైకి ఎక్కి లగేజి చెక్ చేశాడు. చెకింగ్ అయిపోయాక, బస్‌ని వెళ్లిపోవడానికి అనుమతించారు.

మరొక గంట తర్వాత శార్వాణిని వేరొక వెహికల్‌లోనికి మార్చారు. టూరిస్ట్ బస్ టూరిస్ట్ ప్రదేశాలకు వెళ్లిపోయింది.

శార్వాణిని ఎక్కించిన వెహికల్‌లో కురుప్పు ఉన్నాడు. శార్వాణి అతని రహస్య మందిరానికి చేరిపోయింది.

కేశవరెడ్డి తన మాస్టర్ బ్రెయిన్ ఉపయోగించి వేసిన స్కెచ్ ద్వారా శార్వాణిని తెలివిగా మైసూరు దాటించాడు.

★ ★ ★

హాస్పటల్‌లో డాక్టర్లు సూర్యంకు అత్యవసర చికిత్స చేశారు.

లోపల ట్రీట్‌మెంట్ జరుగుతుంటే బయట వెయిట్ చేస్తున్న నారాయణ ఇంకా కోపంతో రగిలిపోతూ కనిపించాడు. మూర్తికి నారాయణను పలకరించడానికే భయమేసింది. సంతోష్ హాస్పటల్‌లో మూర్తి పక్కనే కూర్చున్నాడు. మూర్తి అతనికి కృతజ్ఞతలు తెలిపాడు. అంతకుమించి మాటలాడటానికి భాషా సమస్య!

బలంగా ఆరోగ్యంగా ఉన్న సూర్యం ఆ కత్తిపోటుని తట్టుకోగలిగాడు. అతనికి కుట్లువేసి డిశ్చార్జి చేశాడు డాక్టరు.

## కొత్తగాలి...

**చేతికర్ర , నడుమున వాచీ**
**అహింసామార్గం.. నాడు**
**చేత తుపాకీ, బెల్టుబాంబు**
**హింసామార్గం.. నేడు**

– ఈ వేమన,
శ్రీకాకుళం

గదిలోనుంచి బయటకు వచ్చిన సూర్యం తమను చూసి నీరసంగా నవ్విన తర్వాత గాని నారాయణ శాంతించలేదు.

హాస్పిటల్ నుంచి త్వరగా బయట పడ్డారు అంతా. తమ హోటల్ దగ్గర నుంచి తమను ఫాలో అవుతున్నవాళ్లే మూర్తిని ఎటాక్ చేయాలనుకున్నారని వారికి తెలిసిపోయింది. శత్రువులు తమను పకడ్బందీ వ్యూహంతో చుట్టుముట్టారని అర్థమయింది. హోటల్‌కి వెళ్లడం మంచిది కాదనిపించింది. మరేదైనా చోటికి వెంటనే షిఫ్ట్ అయితే మంచిది అన్నాడు మూర్తి. ఆ వూరినుంచి వెళ్లిపోవడమే కరెక్ట్ అన్నాడు సూర్యం.

పక్కనే నుంచుని తమను గమనిస్తున్న సంతోష్‌ని చూసి పలకరింపుగా నవ్వాడు నారాయణ.

"మాకు చాలా సహాయం చేశావు. నీ మేలు మరిచిపోలేము. మాకు దగ్గరలో ఉండటానికి వసతి దొరుకుతుందా? " అన్నాడు స్వచ్ఛమైన తెలుగులో.

సూర్యం ఆ మాటలను సంతోష్‌కి అర్థమయ్యేలా చెప్పాడు. "మీరు కొట్టింది చాలా పెద్ద గూండాని. వెంటనే బీహార్ వదిలివెళ్లిపోవడం మంచిది" అన్నాడు సంతోష్. అంతే మళ్ళీ బ్యాగ్‌లోని విగ్రహం సెగలు గక్కింది. ఆ వేడి భరించలేక బ్యాగ్‌ని ఒంటికి తగలకుండా పట్టుకున్నాడతను ఇబ్బందిగా.

"ఏమైంది? " అని అడిగాడు సూర్యం.

"ఈ విగ్రహాన్ని అమ్ముదామని మా ఊరినుంచి తెచ్చాను. ఉన్నట్లుండి వేడెక్కిపోతుంది" అన్నాడు సంతోష్.

"ఏదీ చూపించు" అన్నాడు సూర్యం.

బ్యాగ్ సూర్యం చేతికి అందించి జిప్పు జాగ్రత్తగా తెరిచాడు. అందులో చెయ్యి పెడితే కాలుతుందని అలాగే తెరిచి పట్టుకుని "ఇదిగో చూడండి" అన్నాడు.

బ్యాగ్ పట్టుకున్న సూర్యానికి అది వేడిగా వుందని అనిపించింది. లోపలి విగ్రహం వింతగా ఉంది. మూర్తి కూడా చూసి "వింత బొమ్మ" అన్నాడు.

నారాయణ కూడా చూడడానికి ముందుకి ఒంగాడు. అతని మొఖానికి పరిమళభరితమైన చల్లని గాలి తగిలింది. సూర్యం తనచేతిలోని బ్యాగ్ చల్లగా అయినట్లు గమనించాడు.

నారాయణ ఆ పరిమళాలను నాసికతో ఆఘ్రాణిస్తూ చేతులు చాచి బ్యాగ్‌లో నుంచి ఆ విగ్రహాన్ని అందుకున్నాడు.

ఆ విగ్రహాన్ని అందుకోగానే అతనిలో ఏదో కొత్తశక్తి ప్రవాహంలా కదలినట్ల

యింది. కనులవెంట ధారగా కన్నీరు ప్రవహించింది. ఆశ్చర్యంగా విగ్రహం కళ్ల నుంచి కూడా కన్నీరు ఒలికింది. మహా భైరవ విగ్రహం ఎంతో ప్రసన్నంగా కనిపించింది. ఆ విగ్రహాన్ని కనులకద్దుకుని గుండెలకు హత్తుకున్నాడు నారాయణ. అతని రోమ రోమంలోను వింతైన శక్తి ఉరకలు వేస్తోంది.

మిత్రులిద్దరినీ చూస్తూ "దొరికింది" అన్నాడు సంతోషంగా.

ఆ మాటతో తమ ఎదుట జరుగుతున్న దృశ్యం యొక్క బలీయమైన మాయ నుంచి బయట పడ్డారు మూర్తి, సూర్యం.

సంతోష్ వింతగా చూస్తున్నాడు నారాయణ వైపు.

"ఈ విగ్రహాన్ని ఎంతకు అమ్మాలని తీసుకుని వచ్చావు? " అడిగాడు సూర్యం.

"మా నాన్నగారికి ఇష్టమైన బొమ్మ ఇది. చిన్నతనంలో ఆయన ఈ బొమ్మతో ఆడుకునేవారట. ఇప్పుడు ఆయనకు ఆరోగ్యం బాగాలేదు. ఇది అమ్మితే గాని ఆయనకు వైద్యం చేయించలేము. మీకు ఎంత ఇవ్వాలని ఉంటే అంత ఇవ్వండి" అన్నాడు మొగమాటంగా.

"సూర్యం జేబులోనుంచి డబ్బు తీసి ఇచ్చాడు. ఆ నోట్లకట్టలు చూసి సంతోష్ మొఖం ఆనందంతో వెలిగిపోయింది.

"ఊహించిన దానికన్నా ఎక్కువ ఇచ్చారు. చాలా థాంక్స్" అన్నాడు సంతోష్.

మరొక్కసారి ఆ విగ్రహంవైపు చూసి "బ్యాగ్‌లో ఉంచితే బాగుంటుంది. బ్యాగ్ మీరే ఉంచుకోండి. ఇక నేను వెళతాను" అని సెలవు తీసుకుని అక్కడ నుంచి బయల్దేరాడు సంతోష్.

వెళ్లిపోతున్న అతడిని వెనక్కి పిలిచాడు నారాయణ, "సంతోష్" అని.

మిగిలిన ఇద్దరూ ఆశ్చర్యపోయారు. అతని పేరు నారాయణకు ఎలా తెలిసిందా అని.

"మీ ఇంట్లో వేపచెట్టు కింద రేపు సూర్యోదయ సమయంలో మూడు అడుగుల లోతుకి తవ్వు.. బంగారం దొరుకుతుంది" అన్నాడు భోజ్‌పురిలో.

★ ★ ★

నారాయణ కొట్టిన దెబ్బలనుంచి తేరుకున్న ఖాసింకి జేబులోని మొబైల్ రింగ్ సౌండ్ వినిపించింది. బాధతో మూలుగుతూ ఫోన్ బయటకు తీశాడు. కంచన్ దాదా పేరు కనిపించింది.

"హలో" అన్నాడు ఖాసిం.

"పనైపోయిందా? " అడిగాడు కంచన్.

"లేదు, మమ్మల్ని కొట్టి పారిపోయారు" చెప్పలేక చెప్పలేక చెప్పాడు.

"నీ గ్యాంగ్ మొత్తాన్ని ఆ ముగ్గురు కొట్టారా? " నమ్మలేకపోతూ అడిగాడు కంచన్.

"ముగ్గురు కాదు, ఒక్కడే. వాడికి ఏదో సైతాన్ పట్టినట్లుంది" చెప్పాడు ఖాసిం.

"జరిగిందంతా వివరంగా చెప్పు"

★ ★ ★

శార్వాణి కిడ్నాప్ అయిన సంగతి తెలిసి ఆశ్చర్యపోయాడు రుద్రప్ప. పోలీసులు తనను కదలకుండా చేయడం, అనధికార అరెస్టులా ఉందని కోపం వచ్చింది. కేశవ రెడ్డికి ఫోన్ చేస్తే స్విచ్ఆఫ్!

తండ్రికి ఫోన్‌చేసి "ఏమిటిదంతా? " అని అరిచాడు.

ఎలగప్ప వెంటనే రంగంలోకి దిగాడు. హోమ్‌మినిస్టర్ నుంచి ప్రెజర్ పెట్టించాడు. కంప్లైంట్ కూడా లేని కిడ్నాప్ కేసుని సాకుగా చూపించి ప్రవీణ్ కక్ష సాధింపుకి పాల్పడుతున్నాడని, అధికార దుర్వినియోగం చేస్తున్నాడని డీజీపీతో చెప్పాడు. అంతటితో ఆగకుండా ఎలగప్ప ముఖ్యమంత్రిపైనా ఒత్తిడి తెచ్చాడు. సీఎం

డీజీపీని సంజాయిషీ అడిగాడు.

ప్రవీణ్‌ని సస్పెండ్ చేశాడు డీజీపీ.

జరిగిన విషయం కామాక్షికి తెలిసింది. శార్వాణి విషయంలో ప్రవీణ్ ఆసక్తి చూపడం రాష్ట్రంలోని పెద్ద తలకాయలకు నచ్చలేదంటే, పరిస్థితి చాలా సీరియస్ అని అర్థమయింది. ఇంకా ఈ విషయాన్ని శార్వాణి తల్లిదండ్రులకు తెలియచేయక పోతే బాగుండదని వెంటనే హరితకు ఫోన్‌చేసి జరిగినదంతా చెప్పింది.

హరిత, సదాశివం ఇంటికి వెళ్లి శార్వాణి మైసూరు వెళ్లడం, తర్వాత కిడ్నాప్ గురించి వివరంగా చెప్పింది. అసలే వరస మరణాలతో కుంగిపోయిన ఆ కుటుంబం ఈ వార్తవిని శోక సంద్రమైంది. సావిత్రమ్మ గుండెలు బాదుకుంది. సదాశివంకి ఇదంతా పెద్దకుట్ర అని అర్థమయింది. మూర్తికి ఫోన్‌చేశాడు. శార్వాణిని ఎవరో కిడ్నాప్ చేశారని చెప్పాడు.

భయపడవద్దని చెప్పాడు మూర్తి.

7



శార్వాణికి మెలకువ వచ్చేసరికి ఆమె ఉన్న పాత బంగళాలో చీకట్లు ముసురు కుంటున్నాయి. ఆమె ఉన్న గదికి రెండు చోట్ల ఎత్తైన తలుపులు ఉన్నాయి. రెండూ దగ్గరికి వేసి ఉన్నాయి. మరొకవైపు కిటికీ ఉంది. ఆ కిటికీకి వైర్‌మెస్ ఉంది. అది తెరిచి ఉందో లేదో తెలియటం లేదు. వైర్‌మెస్ బాగా నల్లగా తుప్పు పట్టి ఉంది. నేలపైన పడున్న శార్వాణి లేచి కూర్చుని తను ఎక్కడ ఉన్నానో తెలుసుకోవడానికి ప్రయత్నించింది.

ఆ గదిలో ఆమె తప్ప మరే వస్తువు లేదు. పక్కనే పాత షాల్ కనిపిస్తే జుగుప్సతో దానిని కాలితో దూరంగా తోసింది. లేచి నుంచోవడానికి ప్రయత్నించింది. కాని కళ్లు తిరిగి కూలబడిపోయింది. మళ్లీ ప్రయత్నించి, గోడ ఆసరా తీసుకుని మెల్లగా లేచింది. తలుపుల దగ్గరికి వెళ్లింది. ఒక తలుపు తెరవడానికి ప్రయత్నించింది. అవతలివైపు నుంచి గడియ పెట్టినట్లుంది. రాలేదు. మరొక తలుపు తెరవడానికి ప్రయత్నిస్తే అది తెరుచుకుంది. లోపలికి చూసింది శార్వాణి. అది ఒక బాత్‌రూమ్. వాష్‌బేసిన్ ఉంది. చల్లని నీళ్లతో మొఖం కడుక్కుందామని లోపలికి వెళ్లింది. వాష్‌బేసిన్ అద్దంలోకి ఒకసారి చూసింది. ఒక వృద్ధురాలి మొఖం కనిపించింది. ముడుతలతో, కళ్ల కింద నల్లటి వలయాలతో, తెల్లటి తల వెంట్రుకలతో కనిపించిన ఆ రూపం చూడగానే, అద్దం అవతల నుంచి ఎవరో తనను చూస్తున్న భ్రాంతికి గురై కెవ్వున అరిచి, మళ్లీ గదిలోకి పరిగెత్తింది శార్వాణి.

భయంతో వణికిపోతోంది. ఏ క్షణంలోనైనా బాత్‌రూమ్‌లోని ఆ రాకాసి ముసల్ది వచ్చేస్తుందని అటువైపే చూడసాగింది. ఇంతలో ఆ గదికి ఉన్న మరో తలుపు పెద్ద శబ్దంచేస్తూ తెరుచుకుంది. ఉలిక్కిపడి అటు చూసింది. పద్దెమినిదేళ్ల పడుచు తలుపు తెరిచి గుమ్మంలో నుంచుంది. ఆమెను చూసి కొంచెం స్థిమితపడింది శార్వాణి.

"లేచావా అక్కా" అంటూ చనువుగా పలకరించింది ఆ అమ్మాయి.

"లోపల ఎవరో ఉన్నారు" అని చేతిని

బాత్‌రూమ్ వైపు చూపిస్తూ భయంగా చెప్పింది శార్వాణి.

"ఎవరు" ఆశ్చర్యంగా అడిగి లోపలకి వెళ్లిచూసి, "ఎవరూ లేరక్కా" అందామె.

"లేదు ఎవరో ముసల్ది ఉంది" అంది భయం భయంగా శార్వాణి.

పడిపడి నవ్వింది ఆ అమ్మాయి. "లేదక్కా నీ మొఖానికే అలా మేకప్ చేశారు వాళ్ళు. నువ్విక్కడకు వచ్చినప్పుడే అలా ఉన్నావు. మొఖం కడుక్కో అక్కా, మామూలుగా అయిపోతావు" అంది.

ఆమె మాటలకు ధైర్యం వచ్చి బాత్‌రూమ్‌కి వెళ్ళి మొఖం కడుక్కుని వచ్చింది శార్వాణి. ఆమె చెప్పింది నిజమే. కాని అసలు తనను అక్కడికి ఎవరు తీసుకుని వచ్చారు? ఇప్పుడు తాను ఎక్కడ ఉంది? ఒక్కసారిగా అనేక ప్రశ్నలు..

"నువ్వెవరు? నన్నెందుకు ఇక్కడకు తీసుకువచ్చారు? ఈ ఇల్లు ఎవరిది? ఇది ఎక్కడ ఉంది? " అని ప్రశ్నలు కురిపించింది ఆ అమ్మాయి పైన.

"ఆగు అక్కా, అన్నీ ఒక్కసారే అడిగితే ఎలా చెప్పాలి? నా పేరు షీలా. నిన్ను ఇక్కడకు ఎవరు తెచ్చారో, ఎందుకు తెచ్చారో నాకు తెలియదు. నేనిక్కడ పని చేస్తున్నాను. నా యజమాని ఒక తంత్రగాడు. ఆయన చెప్పిన పని చేయడమే తప్ప అంతకుమించి వివరాలు ఆయన్ని అడగను" అంది నవ్వుతూ.

"షీలా, కనీసం ఇదన్నా చెప్పు. ఇప్పుడు నన్నేం చేయబోతున్నారు? " అడిగింది శార్వాణి.

ఆమెకు రాంబాబు చనిపోయిన తర్వాత, మూర్తి తన తండ్రితో మాట్లాడుతూ ఎవరో తంత్రగాడి కారణంగానే పండు, రాంబాబు కూడా మరణించారని చెప్పడం గుర్తుకు వచ్చింది. ఆ తాంత్రికుడు వీడే అయివుంటాడు అనుకుంది.

"నిన్నేం చేస్తాడు? నాలాగే బంధిస్తాడేమో. అంతకు మించి నాకేమి తెలియదు అక్కా. సరే నీకేమన్నా కావాలంటే నన్ను పిలు, వస్తాను" అని వెళ్ళిపోయింది.

ఆమె వెళ్తుంటే, ఆమె వెనుక విరబోసి ఉన్న జుత్తు చూసి శార్వాణి గుండె ఎందుకో ఝల్లుమంది.

★ ★ ★

మహాభైరవ విగ్రహం దొరికిన తర్వాత, నారాయణ మిత్రబృందంలో అంతకు ముందు కలిగిన భయాందోళనలు తగ్గిపోయాయి. హోటల్‌కి వెళ్ళి తమ సామాను తీసుకుని దర్జాగా మేనేజర్‌ని కూడా పలకరించి తమ ఇన్నోవాలో ఎక్కి తిరుగు ప్రయాణం మొదలుపెట్టారు.

బీహార్ గ్యాంగ్‌లు తమను వెంటాడుతాయనే భయం వాళ్ళకు ఇక కలగలేదు. ఊరు దాటుతుండగా మూర్తికి ఫోన్ వచ్చింది. సదాశివం ఫోన్‌చేసి శార్వాణిని మైసూరులో కిడ్నాప్ చేశారని చెప్పి బావురుమన్నాడు. ఏమీ భయపడవద్దని అతన్ని ఊరడించాడు మూర్తి.

"ఏమైంది? " అడిగాడు నారాయణ.

"ఆ దుర్మార్గులు శార్వాణిని కిడ్నాప్ చేశారట" అంటూ జరిగిన విషయాలన్నీ వివరంగా చెప్పాడు మూర్తి.

డ్రైవర్ పక్క సీట్లో సూర్యం కూర్చున్నాడు. వెనక సీట్లో మూర్తి, నారాయణ కూర్చున్నారు. నారాయణకు, మూర్తికి మధ్యలో మహాభైరవ విగ్రహం ఉన్న బ్యాగ్ ఉంది.

మూర్తి చెప్పింది విన్నాడు నారాయణ. బ్యాగ్‌తెరిచి మహాభైరవ విగ్రహాన్ని బయటకు తీశాడు. విండోలో నుంచి నీరెండ పడి అపరంజి బొమ్మలా మెరుస్తోంది ఆ విగ్రహం. రెండు చేతులతో దాన్ని పట్టుకుని తదేకంగా చూస్తూ ఏవో మంత్రాలు ఉచ్ఛరించసాగాడు నారాయణ.

ఆ ప్రకంపనలు, ముందు గులాబి రేకులు కదిలినంత సవ్వడి చేస్తూ క్రమేపీ పెరుగుతూ కందిరీగల గుంపు దాడికి బయలుదేరిన శబ్దంలా పరిణమించాయి. ఇన్నోవా డ్రైవర్ ఆ శబ్దానికి భయపడి కారుని ఒక పక్కగా తీసి నిలబెట్టాడు.

మహాభైరవ విగ్రహం కళ్ళు ఒక్కసారి ఎర్ర రంగుకి తిరిగి మళ్ళీ మామూలుగా అయిపోయాయి.

నారాయణ కనులు మూసుకుని ధ్యానంలో ఉన్నట్లు కనిపించాడు. కొంచెం సేపటికి కళ్ళు తెరిచి "ఈ దారుణాల వెనక ఉన్న వాడి అంతు చూస్తాడు మహాభైరవుడు ఈ రోజు" అన్నాడు.

మూర్తికి గిరిజ మరణం తర్వాత మొట్ట మొదటిసారిగా మనసు తృప్తిగా అనిపించింది. తమకు ఎందుకు ఇన్ని కష్టాలో అర్థంకాక తమ కర్మను నిందించుకొని కూర్చోవటం తప్ప వేరే ఏమీ చేయలేకపోయాడు. తర్వాత ఆ కష్టాల వెనుక కొందరు దుష్టుల స్వార్థపూరిత పన్నాగాలు ఉన్నాయని తెలిసి కడుపు మండిపోయింది. ఇప్పుడు మహాభైరవుడి అండతో నారాయణ పొందిన అద్భుత శక్తుల వలన ఆ దుష్టుల ఆట కట్టించబోతున్నామనుకుంటే ఎంతో తృప్తిగా ఉంది.

ఆ దుష్టుడు ఎవడో, వాడికి మహాభైరవుడు ఎలాంటి శిక్ష విధిస్తాడో చూడాలని ఉంది మూర్తికి. అందుకే-

"నారాయణా నిన్ను ఒకటి అడగాలని ఉంది" అన్నాడు మూర్తి.

"అడుగు" అన్నాడు నారాయణ.

తను అడగబోయేది నారాయణకు ముందే తెలుసు అనే భావన కలిగింది మూర్తికి.

"ఏమీ లేదు. ఆ దుష్టుడికి ఎటువంటి శిక్ష పడుతుందో చూడాలని ఉంది" అన్నాడు మూర్తి. అన్నాక తనకే నవ్వు వచ్చింది. అందుకే నారాయణ పకపక నవ్వుతుంటే తనూ గొంతు కలిపాడు.

"అలాగే చూద్దువుగాని" అన్నాడు నారాయణ.

నారాయణ జోక్ చేస్తున్నాడనుకుని మళ్ళీ నవ్వాడు మూర్తి.

ఇన్నోవా వేగంగా వెళ్తోంది. కాసేపటికి మెల్ల మెల్లగా చీకటి పడసాగింది.

అలిసిపోయిన కనులకు నిద్ర పిలవకుండా వచ్చేస్తుంది. మూర్తి కిటికీలో నుంచి బయటకు చూస్తూనే నిద్రలోకి జారుకున్నాడు.

★ ★ ★

కేశవరెడ్డికి ప్రవీణ్ సస్పెండ్ అయిన వార్త చెప్పాడు ఎలగప్ప.



"చూడు బామ్మర్దీ, గోవర్ధన్ ఏమైనా సమాచారం చెప్తాడేమో కొంచెం టచ్‌లో ఉండు" అని సలహా ఇచ్చాడు.

గోవర్ధన్‌కి ఒక మిస్డ్ కాల్ ఇచ్చాడు కేశవరెడ్డి. గోవర్ధన్ నుంచి కరెక్ట్‌గా ఒక నిముషంలో మిస్డ్ కాల్ వచ్చింది. అప్పుడు కేశవరెడ్డి మళ్ళీ కాల్ చేశాడు.

"హలో నేను" అన్నాడు గోవర్ధన్.

"చెప్పు గోవర్ధన్, బాగుండావా?" అన్నాడు కేశవరెడ్డి.

"నేను బాగానే ఉన్నా. సారు చాలా కోపం మీద ఉన్నాడు. రుద్రప్పకి

మూడింది అంటున్నాడు".

"ఇప్పుడు ఎక్కడ ఉన్నాడు? ఏం చేస్తు న్నాడు? " ఆరా తీశాడు కేశవరెడ్డి.

"నిన్ను కూడా అనుమానిస్తున్నాడు. నువ్వు ఒంటరిగా దొరికితే డేంజర్" అన్నాడు గోవర్ధన్.

"వాడు కోరలు పెరికిన పాములే. వాడేం చేస్తాడు" ఈసడింపుగా అన్నాడు కేశవరెడ్డి.

"అదే నేనూ చెప్పేది. వాడిలా అవడా నికి నువ్వే కారణమని నీపైన పీకలదాకా కోపం ఉంది".

"సరేలే, ఇంకా ఏమిటి విశేషాలు? " అన్నాడు కేశవరెడ్డి.

"ఏముంది. సారు అంటే ప్రాణం పెట్టే వాళ్ళు ఉన్నారు" అన్నాడు గోవర్ధన్.

"ప్రాణం ఏముంది ఇచ్చేస్తారు. ఉద్యోగం పోతుందంటేనే వెనకడుగు వేస్తారు" తన జోకుకి తనే నవ్వుతూ అన్నాడు కేశవరెడ్డి.

"ఏడ్చినట్లుంది నీ జోకు. వాళ్ళకి ఉద్యో గాలు లేవు. నిరుద్యోగులు. ఇంతకు ముందు ఆఫీసరు దొంగ కేసులు బనా యించి వాళ్ళను కొట్లో వేస్తే, సారు ఎంతో కష్టపడి విడిపించాడు. వాళ్ళకి సారు ఎంత చెబితే అంత. వాళ్ళు వచ్చి సారుని ఇంటి దగ్గర కలిశారు" అన్నాడు గోవర్ధన్.

"సరేలే అప్పా, మంచి విషయం చెప్పావు. రేపు వచ్చి కలువు" అన్నాడు అతనికి ఇచ్చే పారితోషికాన్ని సూచిస్తూ.

"సరే" అని ఫోన్ పెట్టేశాడు గోవర్ధన్.

గోవర్ధన్‌తో మాట్లాడేక ఎలగప్పకి ఫోన్ చేశాడు కేశవరెడ్డి.

"ఏంది బామ్మర్దీ ఎట్టున్నాడు ఆ పోలీ సోడు? " హేళనగా అడిగాడు ఎలగప్ప.

గోవర్ధన్ చెప్పిన విషయాలన్నీ వివ రంగా చెప్పాడు కేశవరెడ్డి.

"ఏమి చేద్దాం అనుకుంటున్నావు" అడి గాడు ఎలగప్ప. అతనికి తన కొడుకు రుద్రప్పతో మాట్లాడిన విషయాలు గుర్తుకు వచ్చాయి.

ఎందుకో రుద్రప్పకి ప్రవీణ్ అంటే విప రీతమైన కోపం వచ్చింది. అది హోట ల్‌లో రుద్రప్పని నిర్బంధించినందుకు కలి గింది మాత్రం కాదు అనిపిస్తుంది ఎలగ ప్పకు. అంత ఆవేశం దానివలన కలగదు. శార్వాణిని రుద్రప్ప నుంచి రక్షించడానికి ప్రవీణ్ తీసుకున్న జాగ్రత్తలు రుద్రప్పకు కోపాన్ని తెప్పించిన విషయం ఎలగప్పకు తెలియదు. తను కోరుకుంటున్న శార్వా ణిని ప్రవీణ్ ప్రేమిస్తున్నాడనే విషయాన్ని సహించలేకపోతున్నాడు రుద్రప్ప.

శార్వాణిని కిడ్నాప్ చేసింది ఎవరో రుద్రప్ప కరెక్ట్‌గానే ఊహించాడు. ఆ రాత్రికే ఆమెను అప్పగించమని అల్టిమేటం ఇచ్చాడు ఎలగప్పకు. అంతేకాదు ప్రవీణ్‌ని లేపేయమని కూడా చెప్పాడు. లేదంటే తనే ఆ పని చేస్తానన్నాడు.

కొడుకు అసలే ఆవేశపరుడు, అన్నంత పని చేయబోయి చిక్కులు కొని తెచ్చుకుం టాడేమో అని ఎలగప్ప భయపడుతు న్నాడు. ఇప్పుడు కేశవరెడ్డిని ఆ ప్రశ్న అడి గినప్పుడు అతని క్రిమినల్ బ్రెయిన్‌లో ఏదో పథకాన్ని సిద్ధం చేస్తున్నాడు.

"ఆc, ఏముంది.. వాడేం చేయగలడు? వదిలేయడమే" అన్నాడు కేశవరెడ్డి. ప్రవీణ్ ఏదో చేస్తాడని తనేమీ భయప డటం లేదు అని ఎలగప్పకు తెలిసేలా.

"బామ్మర్దీ, నువ్వు చెప్పింది నిజం. వాడేమీ చేయలేడు. కాని మనం బలవం తులం. మనమేమన్నా చేయొచ్చు. వాడు పదవిలో ఉంటే సెక్యూరిటీ ఉంటాది. ఇప్పుడు వాడు ఒక్కడు. పోనీ ఆ పిలకా యలు కూడా వస్తే వాడితోపాటు వాళ్ళను కూడా లేపేద్దాం. ఏమంటావు? " అడిగాడు కాలిక్యులేటెడ్‌గా. మామూలు పరిస్థితుల్లో పులిని పట్టడానికి మేకను ఎరగా వేసేట

ప్పుడు మేక ఇష్టాయిష్టాలు కనుక్కోరు. కాని కేశవరెడ్డిని ఎరగా వేసి ప్రవీణ్‌ని మట్టుపెట్టాలని అనుకున్నప్పుడు అతని సహకారం తప్పనిసరి.

"ఎందుకులే బావా రిస్కు? "

"నీకు భయమైతే వద్దులే"

మనుషుల సైకాలజీని అవసరానికి ఎలా వాడుకోవాలో బాగా తెలుసు ఎలగప్పకి.

"నాకు భయమేంది బావా, అందులోను నువ్వు చెప్పాక. సరే నన్నేం చేయమంటావో చెప్పు? " అన్నాడు కేశవరెడ్డి.

వివరంగా చెప్పాడు ఎలగప్ప. అంతా టైమ్ ప్రకారం జరగాలని చెప్పాడు. పక్కాగా ప్లానింగ్ జరిగిపోయింది.

★ ★ ★

మూర్తి ఉలిక్కిపడి లేచాడు.

"ఏమైంది? " అడిగాడు నారాయణ.

"ఇద్దరు దుర్మార్గులు ఎవరినో చూస్తున్నట్లు కల వచ్చింది" అన్నాడు మూర్తి.

సూర్యం ప్లాన్ ప్రకారం ఇన్నోవా పాట్నావైపు కాక, కోల్కాతవైపు సాగుతోంది. అనవసరంగా సమస్యలు తెచ్చుకుంటే మైసూరు చేరడం ఆలస్యం అవుతుందని దారి మార్చాడు సూర్యం.

శార్వాణిని రక్షించడానికి, ఆ దుష్టులను శిక్షించడానికి మైసూర్ వెళ్ళాలని నారాయణ నిర్ణయించడంవల్లే ఆ మార్పు. మధ్యదారిలో ఆగి చపాతీలు తిని బయలుదేరారు. నారాయణ విగ్రహం ఉన్న బ్యాగ్‌ని పొరపాటున కూడా విడిచి ఉండటంలేదు.

ఇన్నోవా మళ్ళీ ప్రయాణం మొదలెట్టింది.

ఏవో కబుర్లు చెప్తున్న మూర్తి ఉన్నట్లుండి నిద్రలోకి జారిపోయాడు. నారాయణ అతన్ని చూసి నవ్వుకున్నాడు. బ్యాగ్‌లోని మహాభైరవుడి కళ్ళు మళ్ళీ ఎర్రగా అయ్యాయి.

★ ★ ★

ప్రవీణ్ కోసం పనిచేస్తున్న కుర్రాళ్ళు నలుగురూ చాకుల్లాంటివాళ్ళు. యూనిఫాం ఒకటి తక్కువ కావడంతో వారు మఫ్టీలో పోలీసులు అనిపిస్తారు. వారి పర్సనాలిటీ చూసినా, నేరపరిశోధనలో వారి నైపుణ్యం చూసినా ఆ విషయం నిజమనిపిస్తుంది. శశిధర్ వాళ్ళందరికీ నాయకుడు. రాజు, రవి, రమేష్ అతని సూచనల ప్రకారం నడుచుకుంటారు. నలుగురూ తైక్వాండో యుద్ధకళలో నిష్ణాతులు.

గోవర్ధన్‌పైన మొదట అనుమానం వచ్చింది రాజుకి. అతను శశిధర్‌కు చెప్పాడు. శార్వాణి కిడ్నాప్ అంత పకడ్బందీగా జరిగిందంటే డిపార్ట్‌మెంటల్ మనుషులు తప్పనిసరిగా ఇన్వాల్వ్ అయి ఉంటారు అన్నాడు శశి. అయితే ఆ వ్యక్తులలో ప్రవీణ్ పర్సనల్ స్టాఫ్ ఉంటారని వారు ఊహించలేదు. ప్రవీణ్ అంటే పడనివాళ్ళుగాని, లేదా మాఫియా దగ్గర డబ్బు తింటున్న అవినీతిపరులుగాని ఉండవచ్చుని మాత్రం అనుమానించారు.

గోవర్ధన్ ఇన్వాల్వ్‌మెంట్ విషయంలో కచ్చితంగా నిర్ధారణ జరిగితే గాని ప్రవీణ్ సార్‌కి ఏమీ చెప్పకూడదని అనుకున్నారు. రవిని కేశవరెడ్డి మూమెంట్స్‌ని అబ్జర్వ్ చేయడానికి, రమేష్‌ని రుద్రప్ప

## కొత్తగాలి...

**మావాడూ క్రికెట్ ప్లేయరే..**
**సచిన్ బ్యాటింగ్‌లో దిట్టయితే**
**వీడు బెట్టింగ్‌లో!**

– గరిమెళ్ల నాగేశ్వరరావు,
కొమ్మాది, విశాఖపట్నం జిల్లా

మూమెంట్స్ గమనించడానికి నియోగించాడు శశి. రాజుని ప్రవీణ్‌కి దగ్గరలో ఉండమని తాను అంబులెన్స్ ఆధారంగా ఏమైనా క్లూ దొరుకుతుందేమోనని పరిశోధించడానికి వెళ్ళాడు. రాజు గోవర్ధన్ గురించి తన అనుమానం చెప్పగానే దాన్ని నిర్ధారించుకోవడానికి పూనుకున్నాడు.

★ ★ ★

గోవర్ధన్ సెల్ మోగింది.

ఫోన్ ఎత్తి మాట్లాడిన గోవర్ధన్‌ని వెంటనే ఒక నెంబర్‌కి కాల్‌చేసి మాట్లాడమని, కేశవరెడ్డి అర్జెంట్‌గా మాట్లాడాలన్నాడని ఎవరో చెప్పారు.

కేశవరెడ్డి కంగారుపడుతూ ఉంటాడు.

**కొత్తగాలి...**

**మత్తులో**
**మునుగుతూ**
**ప్రభుత్వాన్ని**
**తేల్చండి**

– *బద్ధి నాగేశ్వరరావు*, అనకాపల్లి

అందుకే తనను వేరే నెంబర్‌కి కాల్ చేయమన్నాడని అనుకున్నాడు గోవర్ధన్. చాలా సులభమైన ట్రిక్ అది. రాటుదేలిన గూఢచారి కాకపోవడం వలన గోవర్ధన్ ఆ మాట నమ్మాడు. వెంటనే ఆ నెంబర్‌కి కాల్ చేశాడు. అవతలి వ్యక్తి కాల్ కట్ చేశాడు. అతనే తిరిగి చేస్తాడనుకున్న గోవర్ధన్ దగ్గరకి రాజు వెళ్ళి ప్రవీణ్ సారు ఏదో అర్జెంట్ పనిమీద రమ్మన్నారని పిలిచాడు. గోవర్ధన్‌కి వెళ్ళక తప్పలేదు. వచ్చిన వ్యక్తి ప్రవీణ్‌కి చెందిన మనిషి అని గోవర్ధన్‌కి తెలుసు.

అలా గోవర్ధన్ ఇన్‌వాల్వ్‌మెంట్ ఉందన్న విషయం రూఢి చేసుకుని అతన్ని వెంటనే అదుపులోకి తీసుకున్నారు. రాజు అతన్ని ప్రవీణ్ ఇంటికి తీసుకెళ్ళలేదు. వాళ్ళు తాత్కాలికంగా ఏర్పాటు చేసుకున్న రహస్య అడ్డాకి తీసుకెళ్ళాడు. అది డి.సి.పి. ఆఫీసుకి వంద మీటర్ల దూరంలోనే ఉంది.

★ ★ ★

కేశవరెడ్డి తన ఇంటినుంచి బయల్దేరేటప్పుడు ఎలగప్పకు ఫోన్‌చేసి చెప్పాడు. అతనికి కావలసిన విధంగా అన్ని ఏర్పాట్లు చేసిన ఎలగప్ప అతనికి గ్రీన్ సిగ్నల్ ఇచ్చాడు. ఆపరేషన్ హంటింగ్ మొదలయింది. దాని టార్గెట్ ప్రవీణ్ హత్యే!

ప్రవీణ్‌కి ఫోన్ వచ్చింది. శార్వాణిని కిడ్నాప్ చేయించింది కేశవరెడ్డి మనుషులని, ఆమెను ఊరవతల ఉన్న కేశవరెడ్డి ఫామ్‌హౌస్‌లో నిర్బంధించారని, ఈ రాత్రికి ఆమెను అక్కడ నుంచి వేరే ప్రాంతానికి తరలించబోతున్నారని ఎవరో చెప్పారు. పేరు అడిగితే కేశవరెడ్డికి శత్రువుని అని చెప్పాడంతే. ఆ వార్త నిజమా, లేక ఏదన్నా ట్రాపా అనే విషయాన్ని పక్కన పెడితే, కేశవరెడ్డికి తనకు శత్రుత్వం ఉందని క్రిమినల్ సర్కిల్‌లో అనుకుంటున్నారనే విషయం రూఢీగా తెల్సింది. అంతేగాక, శార్వాణి విషయం తనకు చాలా ఇంట్రస్ట్ కలిగిస్తుందని కూడా తెలుసుకున్నారంటే, తప్పనిసరిగా వాళ్ళను సీరియస్‌గా తీసుకోవలసిందే.

అన్నీ ఆలోచించుకుంటే ఆ వార్త ప్రకారం తనేమి చేస్తాడని వాళ్ళు ఊహిస్తారో అది చేయడం మధ్యమం, ఏమీ చేయకుండా మిన్నకుండడం అధమం అనిపించింది. అయితే ఉత్తమమైనదేమంటే, వాళ్ళు ఊహించినట్లు చేస్తూనే మరోపక్క వాళ్ళు ఊహించలేనట్లుగా పథకం వేయగలగటం. అదంత సులభం కాదు. అందుకే

శశిని రమ్మంటూ కాల్ చేశాడు ప్రవీణ్.

శశి అరగంటలో ప్రవీణ్ దగ్గరికొచ్చాడు.

"రా శశీ, కూర్చో ఎనీ ప్రోగ్రెస్?" అడిగాడు ప్రవీణ్.

"ప్రోగ్రెస్ ఉంది సర్. కాని మేడం ఆచూకి ఇంకా తెలియాల్సి ఉంది" అన్నాడు ప్రవీణ్ పక్కన ఉన్న సోఫా అంచున కూర్చుంటూ. ప్రవీణ్ ఎదురుగా కూర్చోవడమే పెద్ద గౌరవం. రిలాక్సయి కూర్చోవడానికి ప్రవీణ్‌పై అతనికి ఉన్న గౌరవం అడ్డువచ్చింది.

"వివరాలు చెప్పు" అన్నాడు ప్రవీణ్.

గోవర్ధన్ గురించి చెప్పాడు శశి. 'ప్రెజర్' పెడితే అతను 'పాడిన పాటలన్నీ' డిజిటల్ వాయిస్ రికార్డర్‌లో రికార్డ్ చేసి తెచ్చాడు. అవి వినిపించాడు.

అంతా శ్రద్ధగా విన్నాడు ప్రవీణ్.

"శశీ, నాకు ఒక కాల్ వచ్చింది" అని తనకు వచ్చిన కాల్ గురించి చెప్పి దానిపై తన ఆలోచనలను వివరించాడు.

శశి శ్రద్ధగా విన్నాడు.

"శశీ, మనం ఇప్పుడు ప్లాన్ చేయాలి. నేను పోలీసుని. క్రిమినల్స్‌కి, పోలీసుల ఆలోచనా విధానాలు బాగా అలవాటు. అందువలన వాళ్ళు వాటికి ప్రతివ్యూహాలు సిద్ధం చేసుకుంటారు. మీరు నాకు సపోర్ట్ ఉన్న విషయం వాళ్ళకు తెలుసు కాని, మీ శక్తి సామర్థ్యాలు తెలియవు. అది మన స్ట్రాంగ్ పాయింట్. అందుకే మన వ్యూహం నువ్వు రచించాలి. ఇంకో విషయం, వాళ్ళు తమ శక్తిని తక్కువ ఉపయోగించే అవకాశం ఉంది. మానవాతీత శక్తులను వాడేటప్పుడు మానవ శక్తులను ఎక్కువగా వాడక్కర్లేదు కదా."

శశి తల ఊపాడు అర్థమయినట్లు. కాని చిన్నగా ఒక మాట అన్నాడు.

"సార్ మనం మంత్రాలను నమ్మకపోవడం వలన వాటి శక్తి క్షీణిస్తుందా?"

"నేను వాటి శక్తి గురించి మాట్లాడటం లేదు. అవి ఉన్నాయా లేదా మీమాంసను పక్కన పెట్టు. అవి ఉన్నాయి, వాటిని వాడాలి అనుకునే వాడు, తన రెగ్యులర్ బలాన్ని పెద్దగా వాడకపోవచ్చు అంటున్నాను. ఎందుకంటే అది అవసరం అని వాడికి అనిపించకపోవచ్చు. కాని అది మనకు అవసరం అంటున్నాను. ఎనీవే, ఈ ఇష్యూని ఎదుర్కోవడానికి పోలీసులా ఆలోచించకుండా కొంత డిఫరెంట్‌గా ఆలోచిస్తే మంచిది. అందుకే ఆ ప్లానింగ్ నీకు అప్పచెబ్తున్నాను. మనకు ఇంకా నాలుగు గంటల సమయం ఉంది. బాగా ప్లాన్ చెయ్యి" అన్నాడు ప్రవీణ్.

అతను తమపైన అంత విశ్వాసం ఉంచినందుకు సంతోషించినా, ఆ బాధ్యత ఎంత క్లిష్టమో తలచుకుని కాస్తంత భయపడ్డాడు శశి. కాని ఛాలెంజ్‌గా స్వీకరించాడు, ప్రవీణ్‌తో శభాష్ అనిపించుకోవాలని.

"ఒకే సర్. మేము డిస్కస్ చేసుకుని ప్లాన్ చేస్తాం. కాని ఒక్క విషయం చెప్పండి సర్, మేడం ఈ మంత్రశక్తులను నమ్ముతారా?" అన్నాడు శశి.

ఒక్క క్షణం ఆలోచించాడు ప్రవీణ్. ఆమె గురించి అతనికి తెలిసింది చాలా తక్కువ. కొన్ని గంటల పరిచయం మాత్రమే. కాని ఆమె ఎప్పటినుంచో తెలి

## కొత్తగాలి...

**చితికి పోయినవాడు**
**'చితి'కి పోయాడు**
**మరో దారేదీ లేక**

– చక్కా చెన్న కేశవరావు,
కావలి

సిన ఆత్మీయురాలిలా అనిపిస్తోంది. అమ్మాయిలలో అరుదుగా కనిపించే తెగువ, నిర్భీతి ఆమెలో విలక్షణంగా మెరుస్తున్నాయి. అంతేకాదు ఆమె ఎంతో ఉన్నత సంస్కారాలు ప్రదర్శిస్తుంటే మహిళా సమాజాన్ని కొత్తదారిలో నడిపించడానికే పుట్టిందా అనిపిస్తుంది.

"నమ్మదు" దృఢంగా అన్నాడు ప్రవీణ్.

రాత్రి ఎనిమిది గంటలకు కేశవరెడ్డి తన కారులో బయల్దేరాడు ఒంటరిగా. తనను ప్రవీణ్ ఫాలో చేస్తున్నాడో లేడో అని అప్పుడప్పుడు రియల్ వ్యూ మిర్రర్‌లో చూస్తున్నాడు. యెల్లో కలర్ జెన్ ఒకటి వదలకుండా కేశవరెడ్డి కారు వెంటబడింది. అతను సిటీ లిమిట్స్ దాటుతుండగా కార్పొరేషన్ వాన్ ఒకటి కేశవరెడ్డిని ఓవర్‌టేక్ చేసుకుని ముందుకి పోయింది. దాని వెనకే జెన్ కూడా వెళ్ళిపోయింది. ఆ కారులో ఎర్రటి బట్టలు, నుదుటికి గంధం పూసుకుని ఉన్న వ్యక్తి ఒకడు కేశవరెడ్డిని చూసుకుంటూ వెళ్ళాడు. ఆ కారులో ప్రవీణ్ కనిపించలేదు.

కేశవరెడ్డికి ఆశ్చర్యం వేసింది. ప్రవీణ్ భయపడి ఉంటాడా అనుకున్నాడు. అతని ఆలోచనలు యెల్లో కలర్ జెన్‌వైపుకి వెళ్ళేలోపు వెనక ప్రవీణ్ తెల్లటి షివర్లే కారు కనిపించింది. వేరే ఎవరినో చూసి తను అనవసరంగా కంగారు పడుతున్నందుకు నవ్వుకున్నాడు కేశవరెడ్డి. మొబైల్ తీసి ఎలగప్పకు ఫోన్ చేశాడు.

"బావా వాడు వస్తున్నాడు.. వాడి కారులోనే" అన్నాడు.

"బామ్మర్దీ అంతా సిద్ధంగా ఉంది. వాడు ఎట్లైనా కారు దిగేలా చేయి. రోడ్డు పక్కనే ఒకచోట నల్ల కారొకటి ఆగి ఉంటుంది. దాని బ్లింకర్లు వెలుగుతూ మలుగుతూ ఉంటాయి. నువ్వు దాన్ని దాటాక కారు ఆపి కిందకు దిగు. మన మనుషులు ఆ చుట్టుపక్కల వాడి కోసం మాటు వేశారు. నువ్వు కారు దిగి రోడ్డు పక్కన ఉన్న కాలి బాటలోకి వచ్చేయి చాలు. వాడు కారు ఆపి దిగేవరకు మాత్రం వెయిట్ చెయ్యి" అని వివరంగా చెప్పాడు ఎలగప్ప.

ఫోన్ పెట్టేసాక ధైర్యం వచ్చింది.

ఎలగప్ప తనను ఎరగా వేస్తున్నాడని తెలుసు. అందుకే మనసులో కొంచెం పిరికితనం వచ్చింది. ప్రవీణ్ పోలీసువాడు. సస్పెండ్ అయ్యాడు గనుక సర్వీస్ రివాల్వర్ ఉండదేమో కాని ప్రైవేట్ గన్ ఉండొచ్చు ఆవేశంలో ఉన్నాడు గనుక దేనికన్నా తెగిస్తాడు. ఒక్క బుల్లెట్ తగిలితే చాలదా.. ప్రాణం పోవడానికి. అది వాడికైనా, తనకైనా.

యెల్లో జెన్ కారు గుర్తుకి వచ్చి మళ్ళీ భయం వేసింది. అందులో ఎర్రటి బట్టలు కట్టుకుని వెళ్తున్న వ్యక్తి తనవైపు ఎందుకు చూశాడు? నిజంగా చూశాడా లేక అది తన భ్రమా? భైరవుడి గురించి వింటే వెన్నులోనుంచి చలి పుడుతున్నది. ఇంతకీ ఆ పండితుడికి విగ్రహం దొరికిందా? ఎందుకన్నా మంచిది కురుప్పుతో మాట్లాడితే అనుకున్నాడు. కాని కురుప్పు స్వీయ రక్షణ కోసం దీక్షలో ఉన్నాడు. అతని మొబైల్ ఆఫ్ చేసుంది.

★ ★ ★

షీలా వెళ్ళిన తర్వాత నెమ్మదిగా శార్వాణి భయం ఉపశమించింది. భయం వలన బుద్ధి ఎలా మసకబారుతుందో ఆమెకు అనుభవం అయ్యింది. తను ఉన్న పరిస్థితిని అంచనా వేసుకుంది. భూత్ బంగళాలో ఉండటం వలన కొంత, క్షుద్ర దేవతోపాసన చేసే తంత్రగాడి నెలవు కావడం వలన కొంత తనలో భయం కలుగుతోందని తెలుసుకుంది.

నిర్హేతుకమైన భయాన్ని జయించాలంటే అంతే దృఢమైన ఓ మహాశక్తి కావాలి. దానికోసం ఆమె తను చిన్నప్పటి నుంచి చేస్తున్న మెడిటేషన్‌లోకి వెళ్ళింది. ఎటువంటి భయాన్ని దరిచేరనీయని శక్తి తనలో వికసించేలా ఆమె ధ్యానమగ్నురాలయింది. ఆమె మొఖంలో మెల్లమెల్లగా అలసట మాయమయింది. దాని స్థానంలో నిశ్చలమైన ప్రశాంతత నెలకొంది.

8



కేశవరెడ్డి సిటీ లిమిట్స్ దాటి చాలా దూరం ప్రయాణం చేశాక అతనికి దూరంగా రోడ్ పక్కన పార్క్ చేసివున్న కారొకటి కనిపించింది. దాని బ్లింకర్స్ ఆరుతూ వెలుగుతూ ఉన్నాయి. తన వెనక ప్రవీణ్ కారు వస్తున్నదో లేదో చెక్ చేసుకున్నాడు. రియల్ వ్యూ మిర్రర్‌లో ప్రవీణ్ కారు కనిపించింది. ఆగివున్న కారుని దాటి ముందుకి వెళ్ళి తన కారుని పక్కకు తీసి ఆపాడు కేశవరెడ్డి. కారు లైట్లు అలాగే ఉంచి డోరు తెరుచుకుని దిగాడు. ప్రవీణ్ కారు కొంచెం ముందుకి వెళ్ళి మలుపు తిరిగింది. తిరగగానే కారు

ఆపి ప్రవీణ్ మెల్లగా వెనక్కి వస్తాడని అత నికి తెలుసు. ఎలగప్ప పంపిన గూండాలు అక్కడ మాటువేసి ఉన్నారనీ తెలుసు. తీరిగ్గా రోడ్డుదాటి మెల్లగా రోడ్డుపక్కనే నడవడం మొదలుపెట్టాడు.

అతను ఊహించినట్లే కొంచెం సేపటికి ప్రవీణ్ అతన్ని అనుసరించడం కనుకొసల నుంచి గమనించాడు. ప్రవీణ్ ఆగి ఉన్న కారుని సమీపించగానే గూండాలు తాము దాగివున్న చోట్ల నుంచి వెలుతురులోనికి వచ్చారు. అందరి చేతుల్లో కత్తులు, కటార్లు ఉన్నాయి. పెద్దగా శబ్దాలు చేసి అందరి దృష్టి ఆకర్షించకుండా పని చేయ డంలో కత్తిని మించిన ఆయుధం లేదు.

కేశవరెడ్డి నడవడం ఆపి వెనక్కి తిరిగి ప్రవీణ్‌ని చూసి బిగ్గరగా నవ్వాడు. ప్రవీణ్ భయంతో తన దగ్గర ఉన్న ఆయుధం తీస్తాడని ఊహించాడు. కాని అతను ఊహించని విధంగా ఒక వాన్ వేగంగా వచ్చి వారి మధ్యగా రోడ్‌పై ఆగింది. క్షణ కాలం బిత్తరపోయిన గూండాలు తిరిగి తేరుకునేలోపు డ్రైవింగ్ సీటులో నుంచి రాజు, రమేష్ కిందకు దుమికి ఆ వాన్ వెనక తలుపులు తెరిచారు. బిలబిల మంటూ బయటకు దుమికాయి గ్రామ సింహాలు. ఆ రోజు ఉదయం నుంచి వీధి వీధి తిరిగి వాటిని పట్టి ఉంచారు కార్పొరే షన్‌వాళ్ళు. వారి కో-ఆపరేషన్ తీసుకుని ఆ కుక్కలను తెప్పించాడు శశి. ఇంతలో యెల్లో కలర్ జెన్ కూడా వచ్చింది. దానిలో నుంచి ఎర్ర బట్టలు ధరించిన స్వామీజి, రవి కిందకు దిగారు.

కుక్కలు బాగా కోపంలో ఉన్నాయి. కన బడిన వాళ్ళను కనబడినట్టు చీల్చేసేలా ఉన్నాయి. ఎర్ర బట్టల స్వామీజీని చూడ గానే, కేశవరెడ్డికి ఎందుకో కురుప్పు గుర్తుకు వచ్చాడు. విగ్రహం ఆ పండితు డికి దొరికితే తమకు చావు తప్పదని అతను చెప్పడం గుర్తుకు వచ్చింది. వెంటనే భయంతో పరుగు పెట్టాడు. అతను అలా పరిగెత్తేసరికి ఆ గూండాలు కూడా పరిగెత్తారు. వాళ్ళ వెనక పరిగెత్తిన వీధికుక్కలు వాళ్ళ పిరికితనంతో మరింత రెచ్చిపోయాయి. దొరికిన వాళ్ళను దొరికి నట్లు కండలు ఊడపెరికాయి.

కేశవరెడ్డి మనసునిండా భైరవుడు తన వెంట పడుతున్నాడనే భయం నిండిపోవ డంతో, తన జేబులోని రివాల్వర్ తీయా లని కూడా అనిపించలేదు.

గూండాలు తమ చేతిలోని కత్తులతో కొంత ఆత్మరక్షణ చేసుకున్నారు. కాని కేశ వరెడ్డి ప్రాణాలు అనంత విశ్వంలో కలిసి పోయాయి.

రాజు, తన వాళ్ళందరితో ప్రవీణ్ దగ్గ రకు వచ్చాడు.

"విచిత్రంగా ఉంది. ఇది ఎలా సాధ్యం? అయినా శశి ఏడి? " అన్నాడు ప్రవీణ్. హఠాత్తుగా జరిగిన సంఘటనతో అతనికి కూడా ఆశ్చర్యం కలిగింది.

ఎర్రబట్టల స్వామీజీ వచ్చి తన విగ్గు, గడ్డం తీసి ప్రవీణ్‌కి సెల్యూట్ చేశాడు. అతన్ని చూసి మరికాస్త ఆశ్చర్యపోయాడు ప్రవీణ్. "ఏమిటిది శశీ. నువ్వు స్వామీజీ వేషంలో. భలే పథకం వేశావే. ఎలా సాధ్యమయింది" అన్నాడు ప్రవీణ్.

"మీ మాటల ప్రేరణ వల్ల, మంత్రశక్తు లతో ఇతరులపై దాడికిదిగేవాళ్ళు, మంత్ర శక్తులకు భయపడతారు అని అర్థమ యింది. అందుకే వాళ్ళను భయపెట్టడా నికి ఈ సెటప్ ప్లాన్ చేశాం" అన్నాడు.

"అది సరే. ఆ కుక్కలు మన వెంటప డితే ప్రమాదం కదా? " అన్నాడు ప్రవీణ్.

"అలా పడవు సార్" అన్నాడు రాజు.

"ఏం.. ఎందుకని? శశికి ఏమైనా శక్తులు ఉన్నాయా? " తమాషాగా అన్నాడు ప్రవీణ్.

"ఉన్నాయి సార్. ఇవిగో చూడండి" అని తమ చేతుల్లోంచి రిమోట్ ఆకారంలో ఉన్న పరికరాలు చూపించారు అంతా.

"ఇవేమిటి? " ఆశ్చర్యంగా వాటిని చూస్తూ అన్నాడు ప్రవీణ్.

"కుక్కలకు తక్కువ ఫ్రీక్వెన్సీలోని ధ్వనులను గ్రహించే శక్తి ఉందని అందరికీ తెలుసు. అయితే కొన్ని రకాల ఫ్రీక్వెన్సీ శబ్దాలు వాటిలో కోపాన్ని, భయాన్ని రెచ్చగొడతాయి అని పరిశోధనలలో తెలుసుకున్నారు. ఈ పరికరాలు అటువంటి శబ్దాలను సృష్టిస్తాయి. శశి వీటిపై పరిశోధనలు చేస్తున్నాడు. అందుకే అవి మన వైపు రాకుండా ముందు బెదరగొట్టి తర్వాత వాటికి కోపాన్ని తెప్పించాం" అన్నాడు రాజు.

ఎవరు తీసిన గోతిలో వారు పడడం అంటే ఇదేనేమో అనుకున్నాడు ప్రవీణ్. మంత్రశక్తులను ఉపయోగించి ఇతరులను చంపాలనుకున్నవారు, ఉన్నాయో లేవో తెలియని ఆ మంత్రశక్తుల భయంవలన ప్రాణాలు కోల్పోయారు. ఎంత విచిత్రం అనుకున్నాడు.

తన గ్రూప్ కుర్రాళ్ళను అభినందించాడు. శశి భుజం చరిచి, "శభాష్ శశీ, యు మేడ్ మి ప్రౌడ్" అన్నాడు.

★ ★ ★

మొఖమంతా చెమటలు పట్టి, ఒక్క ఉదుటున లేచాడు మూర్తి.

"నారాయణా" అని ఏదో చెప్పబోతున్న మూర్తిని చూసి నవ్వుతూ-

"నువ్వు కోరుకున్నది చూశావా? " అని అడిగాడు నారాయణ.

★ ★ ★

అంతవరకూ ఇతరులను భయపెట్టడం తప్ప భయమంటే ఎరగని కురుప్పుకి ఆ రోజు జీవితంలో మొదటిసారి విపరీతమైన భయం కలిగింది. విగ్రహం నారాయణ చేతికి అందగానే అతనికి సంకేతం అందిపోయింది. అప్పటి నుంచి వడివడిగా నడుచుకుంటూ తన గదిలోనుంచి పూజా మందిరంలోకి వెళ్ళిపోయాడు.

కురుప్పు ఆక్రమించిన భవనం ఒకప్పుడు రాజనర్తకి నివాసం. కాలక్రమేణా అది శిథిలావస్థకు చేరుకుంది. బయట నుంచి చూస్తే పాడుపడి దెయ్యాల కొంపలా కనిపిస్తుంది. దానిలోనే కురుప్పు నివాసం. తన శక్తితో కొందరిని వశపరుచుకుని తనకు బానిసలుగా చేసుకుని ఆ కొంపనే తన భవనంగా తీర్చిదిద్దుకున్నాడతను. అందుకే లోపలినుంచి చూస్తే ఆ భవనంలోని గదులు అన్నీ నివాసయోగ్యంగానే కనిపిస్తాయి.

పూజా మందిరంలో తను ఉపాసించే శక్తి ముందు కూర్చుని ధ్యానంలో మునిగిపోయాడు కురుప్పు.

"హ్రీం... క్లీం..." అని మంత్రోచ్చాటనం చేస్తూ తన ఉపాసనా దేవతను ఆవాహన చేశాడు.

షీలా వచ్చి కురుప్పు ఎదురుగా అతను ఆరాధిస్తున్న దేవివిగ్రహం పక్కన కూర్చుంది. ఆమె జుత్తు, భుజాలను, వీపును కప్పుతూ విస్తరించి ఉంది. కళ్ళు తెరిచి ఆమెను చూశాడు కురుప్పు. అతనికి

## కొత్తగాలి...

**వయసు**
**పరుగు**
**జీవితం**
**తరుగు**

– శ్రీకాళహస్తి వెంకటశేషగిరిరావు, వాకాడు



ఇరువైపులా ఇద్దరు యువతులు వచ్చి పళ్ళాలలో పసుపు కుంకుమలు, పూజాద్ర వ్యాలు ఉంచారు.

కురుప్పు షీలా పైకి పూజా ద్రవ్యాలు విసురుతూ గంభీరంగా మంత్రోచ్చాటనం చేస్తున్నాడు.

ఏదో పరవశత్వంలో ఉన్నదానిలా షీలా కళ్ళు మూసుకుని తల ఊపుతోంది.

కురుప్పు పలికే మంత్రాలు మూల మూలల్లో ఉన్న దుష్టశక్తులను తట్టి లేపు తున్నట్లు ఉన్నాయి.

ఆ మందిరంలో ఒక రకమైన మైకం కలిగించే వాతావరణం నిండిపోయింది.

కురుప్పుకి ఎదురుగా ఉన్న షీలా కళ్ళు తెరిచింది. అవి పైకి చూస్తూన్నాయి.

"ఏమి కావాలిరా? " అంది.

కురుప్పు ఏమీ మాట్లాడకుండా ఆమె ముందు నైవేద్యం పళ్ళాలను పెట్టించాడు. చేతికి అందినంత నైవేద్యాన్ని అందుకుని నోట్లో వేసుకుంది. కరకర నమిలి మింగింది. పక్కనే ముంతలాంటి గిన్నె ఎత్తి అందులోని పానీయాన్ని తాగింది.

"చెప్పరా, ఏమి కావాలి? " అంది మళ్ళీ.

"జైకపాలినీ! నాకు మహాభైరవుడు ఆధీనం కావాలి" అన్నాడు కురుప్పు.

"మహాభైరవుడు ఇప్పుడు వేరేవాడి ఆధీ నంలో ఉన్నాడు. వాడు విగ్రహం నీ చేతిలో పెట్టి 'తీసుకో' అంటేనే మహాభైర వుడు నీ వశమవుతాడు. ఇదివినా వేరే మార్గంలేదు" అంది.



"అలా అయితే మహాభైరవుడు నాకు హాని చేయకుండా నన్ను కాపాడు" అభ్యర్థించాడు కురుప్పు.

"అసాధ్యం" అంది. చేతితో మరి కాస్త నైవేద్యాన్ని నోట్లో వేసుకుంది.

"నువ్వు తప్ప వేరే దిక్కులేదు మాతా, నన్ను కాపాడాల్సింది నువ్వే" అన్నాడు కురుప్పు వినయంగా.

"కవచ విద్యను ప్రయోగించరా మందబుద్ధీ" అని ముంత ఎత్తి మళ్ళీ పానం చేసిందామె.

"ఆజ్ఞ మాతా" అన్నాడు కురుప్పు.

తర్వాత తన పక్కనున్న యువతులకు "దాన్ని తీసుకురండీ" అని చెప్పాడు. మరబొమ్మల్లా గిరుక్కున వెనుతిరిగి శార్వాణి ఉన్న గదివైపు వెళ్ళారు వాళ్ళు .

శార్వాణి తన గదిలో నేలపైన విచారంగా కూర్చుని ఉంది. ఒకే ఒక చిన్న బల్బు వెలుగుతూ ఉంది ఆ గదిలో. శార్వాణి ఎదురుగా ఉన్న పళ్ళెంలోని ఆహారాన్ని ఆమె తాకనైనా లేదు.

కురుప్పు పంపిన యువతులు వచ్చి శార్వాణిని తమతో రమ్మన్నారు. శార్వాణి లేచి వారి వెంట నడిచింది.

ఆమెలో భయాతీతమైన ఒకానొక స్తబ్ధత ఆవరించి ఉంది.

శార్వాణిని కురుప్పు దగ్గరకు తీసుకుని వచ్చారు ఆ యువతులు. క్షుద్రోపాసన జరుగుతున్న ఆ వాతావరణం చూసి శార్వాణి ఒళ్ళు గగుర్పొడిచింది. మనసు

గట్టిపరుచుకుని ఎటువంటి వికారం కలగ కుండా జాగ్రత్తపడింది.

శార్వాణిని తన ఎదురుగా కూర్చోపెట్ట మన్నాడు కురుప్పు.

పళ్ళెంలో నుంచి కుంకుమ తీసి ఆమె నుదుట పెద్దబొట్టు పెట్టాడు.

మంత్రాలు పెద్దస్వరంతో ఉచ్చరిస్తూ ఆమెపై పసుపు కుంకుమలు జల్లాడు.

అప్పుడు షీలా లేచి చిన్న చురకత్తి తీసు కుని కురుప్పు కుడిచేతి బొటనవేలు కోసింది. అలాగే శార్వాణి చేయి పట్టుకుని ఆమె ఎడమచేయి బొటన వేలుకి గాటు పెట్టింది. షీలా ప్రయత్నాన్ని శార్వాణి ప్రతిఘటించలేదు.

తర్వాత వారిద్దరి బొటనవేళ్ళు కలిపి పట్టుకుంది షీలా.

కురుప్పు నోట మంత్రాలు ప్రవాహంలా వెలువడ్డాయి. కురుప్పుని, శార్వాణిని కలు పుతూ కవచం ఏర్పడిపోయింది. ఇకపై కురుప్పుపై ఎటువంటి మంత్ర ప్రయోగం జరిగినా మొదట దాని ప్రభావం శార్వా ణిపై పడుతుంది. అటుతర్వాతే ఆ ప్రభావం కురుప్పుని బాధిస్తుంది.

ఒకవేళ మహాభైరవుడు కురుప్పు ప్రాణాలు తీయదలిస్తే, మొదట శార్వాణి ప్రాణాలు పోతాయి.

తాను తలపెట్టిన కవచ ప్రయోగం విజ యవంతం అయినందుకు కురుప్పు సంతో షించాడు. "జై కపాలినీ" అని బిగ్గరగా అరిచి దేవికి నమస్కరించాడు. శార్వాణి కూడా శిరసు వంచి నమస్కరించింది.

★ ★ ★

ఎలగప్ప ఎన్నిసార్లు కేశవరెడ్డి మొబై ల్‌కి ఫోన్ చేసినా అట్నుంచి సమాధానం లేదు. ఏమి జరిగిందో తెలియక కంగారు పడుతున్న ఎలగప్పకు డేవిడ్ నుంచి ఫోన్ వచ్చింది. ప్రవీణ్‌ని చంపించడానికి ఎల గప్ప పంపిన గూండాల లీడర్ డేవిడ్.

డేవిడ్ చెప్పిన విషయం విన్న ఎలగప్ప కేశవరెడ్డి కుక్కల దాడిలో చనిపో యాడంటే నమ్మలేకపోయాడు. అందు లోను ఆ కుక్కలు సామాన్యమైన కుక్కలు కావేమో అనే అనుమానాన్ని డేవిడ్ వెలి బుచ్చాడు. అవి కేశవరెడ్డిని మాత్రమే టార్గెట్ చేసుకోవడం, తక్కిన వాళ్ళను అతనినుంచి వేరుచేయడం చూస్తుంటే వాటి వెనక పెద్ద రహస్యమే ఉండి ఉండా లని ఎలగప్ప అనుకున్నాడు. వెంటనే కంచన్ దాదాని కాంటాక్ట్ చేశాడు. బుద్ధగ యలోని ముగ్గురి విషయం ఏమైంది కను క్కుందాం అని.

"సాబ్, మేము ఫెయిల్ అయ్యాం. ఇంతవరకూ మా చరిత్రలో ఎప్పుడూ ఇట్లా జరగలేదు" అన్నాడు కంచన్.

"ఏమైంది, వివరంగా చెప్పు" అన్నాడు ఎలగప్ప కోపాన్ని అణుచుకుంటూ.

"ఒక్కడి చేతిలో ఖాసిం, అతని మను షులు చావుదెబ్బ తిన్నారు" చెప్పాడు కంచన్ బాధగా.

"వారికి ఏమైనా విగ్రహం దొరికిందా?" అనుమానంగా అడిగాడు ఎలగప్ప. వాళ్ళ చేతికి విగ్రహం దొరికితే తాము ముగ్గురూ చనిపోతారని కురుప్పు చెప్పిన విషయం గుర్తుకు వచ్చి భయమేసింది ఎలగప్పకు.

"మా వాళ్ళు అది చూడలేదు. ఎందుకో అతనివైపు చూడాలంటేనే మా వాళ్ళకు ధైర్యం సరిపోలేదు. ఇప్పుడు వాళ్ళున్న స్థితిలో చిన్న కుర్రాడిని కూడా బెదిరించ లేరు. వాళ్ళందరికి ట్రీట్‌మెంట్ ఇప్పిస్తు న్నాను. వాళ్ళు ఎప్పుడు మామూలుగా అవుతారో, మళ్ళీ మా దందా ఎప్పుడు మొదలుపెడతామో నాకే తెలియదు" అన్నాడు కంచన్‌దాదా.

"ఒక్కమనిషికి ఇంత భయపడతారా?" అవహేళనగా అన్నాడు ఎలగప్ప.

"వాడు మనిషి కాదు సాబ్. వాడో శక్తి.

వాడేమిటో తెలియకుండా వాడి ఎదుటకు పోవద్దు సాబ్. మీ మంచికోరి చెబుతున్నా.. వద్దు. వాడి జోలికి పోవద్దు. ఖతమ్ అయిపోతారు" అని ఫోన్ కట్ చేశాడు కంచన్.

అనవసరంగా కురుప్పు మాట దాటానేమో అని మొదటిసారి భయపడ్డాడు ఎలగప్ప. కేశవరెడ్డి పోవటం అతని శక్తిని, ధైర్యాన్ని సగానికి తగ్గించింది.

★ ★ ★

నారాయణ ఎందుకో చాలా ఉద్వేగంగా ఉన్నాడు. మహాభైరవుడి విగ్రహాన్ని తదేకంగా చూస్తూ నిట్టూర్పులు విడుస్తున్నాడు. తన చేతినుంచి మహాభైరవుడు వెళ్ళిపోయే తరుణం వచ్చిందనిపించి అతని మనసు తీవ్రమైన అలజడికి గురవుతోంది. అతనికి గత జన్మ వృత్తాంతం గుర్తుకి వచ్చింది.

తన గురువు చేతుల మీదుగా మహాభైరవ విగ్రహాన్ని పొందినప్పుడు తన భుజాలపై పెట్టిన బాధ్యతను నెరవేర్చగలనో లేదో అని ఎంతో సందేహించాడు తను.

అప్పుడు గురువుగారు, "నాయనా ఈ బాధ్యత నీ ఒక్కడిది అనుకుంటున్నావా? కాదు నాయనా! భోగనాథుడు లోక కళ్యాణం కోసం తన దివ్యశక్తులను నిక్షిప్తం చేసి ఈ మహాభైరవ విగ్రహాన్ని సృష్టించాడు. లోకంలో చీకటి వెలుగులు ఎలా ఉంటాయో అలాగే మంచి చెడులు కూడా ఉంటాయి. తనది కానిది పొందాలనుకోవడం, కష్టపడి సాధించవలసిన వాటిని శ్రమపడకుండా పొందాలనే దురాశలు వంటివి మనిషిని పతనం చేస్తాయి. తనలో కలిగిన భావపరంపర యొక్క పర్యవసానాలు మనిషిని సంస్కార రూపంలో వెంటాడుతాయి.

తన సుఖం కోసం ఇతరులకు దుఃఖం కలిగినా లెక్కచేయనివారు ఉన్నట్లే, ఇతరుల కష్టాలు తీర్చడానికి తమ సుఖాలను సైతం త్యాగం చేసేవారూ ఉంటారు. మనిషి అంచెలంచెలుగా ఉన్నతుడు కావాలనేది భగవంతుడి ఇచ్ఛ. అది నెరవేరాలంటే, చెడుని ఆశ్రయించడం మంచిదికాదని మనిషి తెలుసుకోవాలి. దుష్టశక్తులను ఆశ్రయించి తాత్కాలికంగా లాభపడినా అది చివరికి వారి వినాశనానికి దారితీస్తుందని మనిషికి తెలియాలి.

ఈ దుష్ట శక్తులంటే మరేమిటో కావు. అవి మనిషికి కలిగే దుస్సంకల్పాలే. భగవంతుడు శిష్టులను రక్షించి దుష్టులను శిక్షించడం వెనక రహస్యం ఇదే. ఆయన అణచివేసేది దుస్సంకల్పాలనే గాని ఈ జీవులను కాదు. భగవద్భక్తులైన భోగనాథుడిలాంటి దివ్య పురుషులు ఆ భగవంతుని ఇచ్ఛను నిరూపించడానికే తమ శక్తిని ధారపోస్తారు.

నీ అదృష్టంకొద్దీ ఈ పరంపరను కొనసాగించే అవకాశం నీకు వచ్చింది. ఈ బాధ్యత నువ్వు అనుకున్నట్లు భారం కాదు. నీ వెంట భోగనాథుడి శక్తి, నీ గురువుల ఆశీస్సులు ఉంటాయి. నిమిత్త మాత్రుడిగా నీ కర్తవ్యం నెరవేర్చు నాయనా" అని బోధించాడు.

అప్పటినుంచి మహాభైరవుడితో అనుబంధం మొదలైంది. దానివలన తనకు నిరంతరం గురుదేవుల సన్నిధిలో ఉన్నట్లు అనుభూతి కలిగేది. అందులో నిక్షిప్తమైన భోగనాథుని శక్తి ఎన్నో క్లిష్ట సమయాలలో తనను సరైన నిర్ణయాలు తీసుకునేలాగా దిశానిర్దేశం చేసేది. ఇప్పుడు తనకు ఎదురుకాబోయే సమస్య మనోనేత్రానికి కనిపిస్తూనే ఉంది. అదే తనకు ఆందోళనను కలిగిస్తూ ఉంది.

ఆ దుష్టుడు శార్వాణిని తన కవచంగా ధరించాడు. వాడిని ఉపేక్షించాలా, శిక్షించాలా, దుష్టుడిని శిక్షించేటప్పుడు శిష్టులను

రక్షించడం వీలుపడకపోయినా ఫరవా లేదా? తన గురువులు ఎలాంటి దిశానిర్దేశం చేస్తారో అనే ఆలోచనలతో సతమతమయ్యాడు.

మూర్తి నారాయణనే గమనిస్తున్నాడు. వాళ్ళు కోల్‌కతా చేరుకున్నాక సూర్యం మిత్రులు వారికి మైసూరు వెళ్ళడానికి ఫ్లైట్ టికెట్‌లు తీసి ఉంచారు. ఏర్‌పోర్ట్‌లో వారికోసం ఎదురుచూస్తూ ఉన్నారు. వాళ్ళు ఏర్‌పోర్ట్‌కి చేరిన తర్వాత దగ్గర ఉండి ఫ్లైట్ ఎక్కించారు.

నారాయణలో ఫ్లైట్ ఎక్కినప్పటినుంచి ఏదో దిగులు... మాటిమాటికి మహాభైరవ విగ్రహాన్ని తడిమి చూసుకుంటున్నాడు.

"నారాయణా, మనం వచ్చిన పని అవ్వాలంటే మైసూరు వెళ్ళి ఇన్ని ఘోరాలకు, ఇందరి మరణాలకు కారకులైన వారిని శిక్షించాలన్నావు. మన పండు చనిపోయినది నీకు గుర్తు చేయక్కరలేదు కదా. అలాగే గిరిజ గాని రాంబాబు గాని చేసిన నేరం ఏమిటి? అమాయకులను కిరాతకంగా చంపించిన వారిపైన నీకేమైనా జాలి కలుగుతోందా అని అనుమానం వస్తున్నది నాకు" అని అడిగాడు మూర్తి.

నారాయణ ఏమీ మాట్లాడలేదు. కాని మూర్తివైపు తలతిప్పి చూశాడు. నారాయణ కన్నులలోని కన్నీటిపొర చూసి చలించిపోయాడు మూర్తి.

"నీ మనసు కష్టపెట్టినట్లున్నాను. క్షమించు నారాయణా. పండు మరణం గురించి నీకు నేను గుర్తు చేయాలనుకోవడం ఎంత అసంబద్ధంగా ఉంది" అని మధనపడ్డాడు.

కొంచెంసేపు ఆగి "నారాయణా, మహాభైరవుడు ఆ దుర్మార్గుణ్ణి శిక్షించిన తీరుకి నీ సున్నితమైన మనసు జాలితో నిండిపోయిందనుకున్నాను. మైసూరు వెళ్ళి ఏమి చేయాల్సివస్తుందో అని వేదన పడుతున్నావని అనుకున్నాను. అందుకే నీ నిర్ణయాన్ని మరోసారి గట్టిపరుద్దామని అలా అన్నాను. ఇంతకీ నువ్వు ఎందుకు అలా ఉన్నావో చెప్పు నారాయణా" అని అడిగాడు మూర్తి.

సూర్యం జోక్యం చేసుకుని "మూర్తీ, మహాభైరవుడు చేతికి అందాక అతనికి పూర్వం ఉన్న శక్తులు అన్నీ వస్తాయని గురువుగారు చెప్పారు. నారాయణ సామాన్యుడు కాదు. ఆ జన్మలో దుష్టశిక్షణలో రాటు దేలినవాడు. అతని కర్తవ్యం మనం గుర్తు చేయవలసిన అవసరం లేదు. నారాయణను ఏ విషయంలోను మనం ఒత్తిడి చేయకుండా ఉంటేనే మంచిది" అన్నాడు.

"మూర్తీ, సూర్యం నేనిలా ఉండటానికి ఓ కారణం ఉంది. నా మౌనం మీలో అలజడి కలిగిస్తున్నది కనుక విషయం చెప్తాను. శార్వాణిని కిడ్నాప్ చేశారన్నది తెలుసు కదా. ఆమెను కురుప్పు అనే ఆ తాంత్రికుడు, తన రహస్య భవనంలో బంధించాడు. కేశవరెడ్డిని మహాభైరవుడు మట్టుపెట్టడంతో ఆత్మరక్షణకోసం వాడు శార్వాణిని తన కవచంగా మార్చుకున్నాడు. ఇప్పుడు మహాభైరవుడు ఆ కురుప్పుని ఏంచేసినా ముందు బలయ్యేది శార్వాణి. ఆమెను రక్షించడం ఎలా అని ఆలోచిస్తున్నాను. అంతేకాదు, ఆ దుర్మార్గుడు నా

## కొత్తగాలి... 

**సప్తపది**
**నడుస్తుంటే జోరీగలు**
**అతని ఆస్తి గురించి**
**ఆమె అంతస్తు గురించి..**

– *గుడిమెట్ల గోపాలకృష్ణ*, అరసవిల్లి

మహాభైరవుడిని ఎలా పొందాలో కూడా తెలుసుకున్నాడు. ఇక ఈ సమస్యను ఎలా పరిష్కరించాలో ఏమో? మహాభైరవుడే పరిష్కారం చూపాలి" అన్నాడు నారాయణ..

నారాయణ చెప్పింది విన్న మిత్రులు, సమస్య గంభీరమైనదని గ్రహించారు. నారాయణ చెప్పినట్లు ఈ సమస్యను ఆ మహాభైరవుడే పరిష్కరించాలితప్ప మరి ఎవరి వల్లా కాదనుకున్నారు. ఇద్దరూ మహాభైరవ విగ్రహాన్ని తాకి "జై మహాభైరవా!" అన్నారు. నారాయణ కూడ ఆ విగ్రహాన్ని గుండెలకు హత్తుకుని "జై మహాభైరవా!" అన్నాడు భక్తిగా.

బ్యాగ్‌లో నిశ్చలంగా ఉన్న మహాభైరవుడి కళ్ళు ఎర్రగా మారాయి.

9



ఎలగప్ప బాగా ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చాడు. వెంటనే కురుప్పుకి ఫోన్ చేశాడు. కేశవరెడ్డి చనిపోయిన విషయం చెప్పి శత్రువులు దగ్గరకు వచ్చేస్తున్నారని చెప్పాడు. అందుకు కురుప్పు కూడా బాధపడ్డాడు. తప్పకుండా పగ తీర్చుకుంటానని చెప్పాడు. ఎలగప్పను, అతని కొడుకుని తనకు చెప్పకుండా ఏపనీ చేయవద్దని చెప్పాడు. శత్రువులు మైసూరుకి రాబోతున్నారని చెప్పాడు.

ఎలగప్పకి ఆ విషయం విన్నాక ఇంకా భయం వేసింది. కురుప్పుని వెంటనే తన దగ్గరికి రమ్మని కోరాడు. కురుప్పు శార్వాణిని వెంట తీసుకుని ఎలగప్ప ఉంటున్న ఫాంహౌస్‌కి వెళ్ళాడు.

ఎలగప్ప, రుద్రప్పలు ఫాంహౌస్‌లో ఉన్నారు. బెంగుళూరుకి, మైసూరుకి మధ్య హైవేకి మూడు కిలో మీటర్ల దూరంలో ఉంది ఆ ఫామ్‌హౌస్. దాని చుట్టూ పెద్ద ఎత్తున్న ప్రహరీగోడ, ఆ గోడపైన మూడు అడుగుల ఎత్తున ఫెన్సింగ్. అది మామూలు ఫెన్సింగ్ కాదు. దానిలో కొన్ని కిలోవోల్టుల విద్యుత్ ఉంటుంది. దానిలో నిరంతరం విద్యుత్ ప్రవహించడానికి వీలుగా ప్రత్యేకమైన జనరేటర్ కూడా ఆ ఫాంహౌస్‌లో ఉంది.

కురుప్పు సొంతంగా డ్రైవ్ చేసుకుంటూ వచ్చాడు. అతని వెహికల్ గేటు దగ్గరకు రాగానే సెక్యూరిటీవాడు వచ్చి చెక్ చేశాడు. ఎలగప్పకు ఫోన్‌చేసి కురుప్పుతో మాట్లాడించిన తర్వాతే గేటు తెరిచాడు. గేటు లోపల తమ వెహికల్ వదిలేయాలని సూచించాడు సెక్యూరిటీవాడు. లోపల మరోగేటు కనిపించింది. కురుప్పుని శార్వాణిని వేరే వెహికల్ ఎక్కించి ఆ గేటు తెరిపించి పంపించాడు. అక్కడి ఏర్పాట్లు పూర్వకాలంలో రాజుల కోటలకు ఉండే రక్షణ వ్యవస్థలను గుర్తుకు తెస్తున్నాయి.

లోపలి కాంపౌండ్ దాటాక చుట్టూ పండ్ల తోటలు, మధ్యలో బంగళా కనిపించింది. అది ఫామ్‌హౌస్‌లా కాదు.. ఒక కోటలా ఉంది.

ఎలగప్ప బయటకు వచ్చి కురుప్పుని రిసీవ్ చేసుకున్నాడు. చుట్టూ సాయుధులు పహారా కాస్తున్నారు. ఒక డజన్ వేటకుక్కలను పట్టుకుని కొందరు సెక్యూరిటీ సిబ్బంది వచ్చారు. వాటి మెడలకు ఉన్న బలమైన గొలుసులను గుంజుకుంటూ భయంకరంగా అరుస్తున్నాయి. వాటిని చూసి కురుప్పు ఉలిక్కిపడ్డాడు.

అదిచూసి ఎలగప్ప "భయపడ్డావా? అవి పెంపుడు కుక్కలు. మనల్నేమీ చేయవు" అన్నాడు.

కురుప్పు తన నల్లకళ్ళద్దాలలో నుంచి అతన్ని చూస్తూ "నీకు కుక్కలంటే భయం లేదా? " అని అదోలా నవ్వాడు.

ఆ నవ్వు చూసి ఎలగప్పకు ఒళ్ళంతా తేళ్ళు, జెర్రులు పాకినట్లయింది.

కురుప్పుని, శార్వాణిని లోపలికి తీసుకు వెళ్ళాడు ఎలగప్ప. శార్వాణి పాత షాల్ ని ఒంటిపై కప్పుకుని ఉంది. ఆమె ముఖం నిండా పసుపు కుంకుమలు చిందరవంద రగా ఉన్నాయి. నుదుట పెద్దబొట్టు ఉంది. ఆమె మొఖంలో స్త్రీ సహజమైన మార్దవం స్థానే ఒకరకమైన కరకుతనం

## కొత్తగాలి...

**ఆకాశం నుంచి**
**దిగి వచ్చి**
**అమ్మ ప్రేమలా చల్లగా**
**ఒళ్లు నిమిరింది వెన్నెల**

– మాధవీ సనారా,
అనకాపల్లి

కొట్టొచ్చినట్లు కనిపిస్తోంది.

రుద్రప్ప ఆమెను వెంటనే గుర్తు పట్టలే కపోయాడు. గుర్తుపట్టిన తర్వాత ఆమెపై ఉన్న వ్యామోహం తాలూకు ఛాయలు కూడా అతని మనసులో మెదలలేదు.

కురుప్పుతో మంతనాలు చేశాడు ఎల గప్ప. రాబోయే పెనుముప్పుని ఎలా తప్పు కోవాలని సలహా అడిగాడు. కురుప్పు కొంచెంసేపు ఆలోచించి "వాళ్ళు మరికాసే పట్లో ఏర్‌పోర్ట్‌లో దిగుతారు. నువ్వు ఫోన్‌చేయించి వాళ్లను ఇక్కడకు పిలి పించు. వాళ్ళు నీ అడ్డాలోకి వచ్చాక నేను చెప్పినట్లు చేయి" అన్నాడు.

## 10



**కే**శవరెడ్డి చనిపోయిన తర్వాత ప్రవీణ్ తన అనుచరులతో శార్వాణిని ఎక్కడ బంధించి ఉంచారో వెతకటం ప్రారంభిం చాడు. కేశవరెడ్డి తమపైన ఎటాక్ ప్లాన్ చేసిన చోటుకి దగ్గరలోనే వాళ్ళు శార్వాణిని దాచి ఉంటారని అతని నమ్మకం. క్రిమి నల్ సైకాలజీ ప్రకారం ఏ క్రిమినల్ అయినా ఇన్‌స్టింక్టివ్‌గా తాను నేరం చేసిన చోటుకి దగ్గరలోనే తిరుగుతుంటాడని అత నికి తెలుసు. అందుకే వాళ్ళు ఆ రాత్రంతా అక్కడ వెతుకుతూనే ఉన్నారు. తెలతెల వారుతుండగా కురుప్పు వెహికల్ వారి దృష్టిలోకి వచ్చింది.

ఆ వెహికల్ తమ వెహికల్‌కు వ్యతిరేక దిశనుంచి వచ్చి వేగంగా వెళ్ళిపోయింది. డ్రైవర్ పక్కన ముందుసీటులో షాల్ కప్పుకుని కూర్చుని ఉన్న స్త్రీ క్షణమాత్రమే కనిపించింది ప్రవీణ్‌కి. అయినా ఆమె శార్వాణి అని బలంగా అనిపించింది అత నికి. తమ వెహికల్స్ వెనక్కి తిప్పి కొంచెం దూరంలో ఫాలో చేశారు ప్రవీణ్, అతని అనుచరులు.

కురుప్పు వెహికల్‌ని లోపలికి పంపడా నికి ఉన్న సెక్యూరిటీ సెటప్ చూసి నీరసం వచ్చింది ప్రవీణ్‌కి. సెక్యూరిటీ వాళ్ళ కళ్ళు కప్పి లోపలికి ఎలా వెళ్ళటం

అని ఆలోచనలో పడ్డారు అందరూ. కొంచెం సేపటికి దూరంగా ఒక ట్రాన్స్‌పోర్ట్ వెహికల్ వస్తూ కనిపించింది. దానిలో వెళ్ళగలిగితే బాగుంటుందేమో అనిపించింది. కాని అప్పటికే అది వారిని దాటి వెళ్ళిపోయింది. మంచిఛాన్స్ మిస్ అయ్యామని తిట్టుకున్నాడు ప్రవీణ్.

కాని సరిగ్గా అప్పుడే ఒక పెద్దకుక్క ఆ వెహికల్‌కి అడ్డం వచ్చింది. సడన్ బ్రేక్ వేశాడు డ్రైవర్. దాన్ని అదిలించడానికి హారన్ కొట్టాడు, కాని అది గుర్ర్‌మంటూ అతన్ని చూపులతోనే భయపెట్టింది.

అనుకోకుండా దొరికిన అవకాశాన్ని ఉపయోగించుకోవడానికి పరిగెత్తాడు ప్రవీణ్. తాను వెహికల్‌ని అందుకొనే వరకు అది కదలకూడదు అని మనసులో కోరుకుంటూ పరిగెత్తాడు. ప్రవీణ్ వెళ్ళి ఆ వెహికల్ ఎక్కి దాని వెనక లోడ్ చేసిన సామాన్ల మధ్య నక్కి కూర్చున్న తర్వాత కదిలింది ఆ కుక్క. అప్పుడు కదిలింది వెహికల్. సెక్యూరిటీవాడు ఆ వెహికల్ డ్రైవర్‌ని గుర్తుపట్టి లోపలికి పంపించాడు. అది ప్రతివారం ఆ ఫాంహౌస్‌కి సరుకులు తెచ్చే ఒకే ఒక్క వాహనం.

★ ★ ★

బెంగళూరు ఏర్‌పోర్ట్‌లో చెకప్ లాంఛనాలన్నీ ముగిసిన తర్వాత నారాయణ పేరు రాసి ఉన్న ప్లకార్డ్ పట్టుకుని యూని

# మనసున ఉన్నదీ...

★ రాజేష్‌కుమార్ నవల 'ఓ వర్షం కురిసిన రాత్రి' ఉత్కంఠభరితంగా ఏకబిగిన చదివించింది. కథను నడిపించడంలో రచయిత కృతకృత్యులయ్యారు. చక్కని థ్రిల్లర్‌ను అందించినందుకు ధన్యవాదాలు

– *జి.జి.కె.రావు,* శ్రీకాకుళం

★ 'ఓ వర్షం కురిసిన రాత్రి' బాగుంది. యర్రంశెట్టి శాయి వీధి కుక్కలవల్ల కలిగేబాధల్ని హాస్యస్ఫోరకంగా బాగా రాశారు. కొత్తగాలి కవితలన్నీ బాగున్నాయి. అల్పాక్షరాలలో అనల్పమైన భావాల్ని వెలిబుచ్చిన ఆ కవులకు అభినందనలు.

– *మంచాళ శ్రీలక్ష్మి,* విశాఖపట్నం

★ 'ఓ వర్షం కురిసిన రాత్రి' ఉత్కంఠగా సాగింది. రచయిత కొనసాగించిన సస్పెన్స్ అభినందనీయం. డిటెక్టివ్ నవలలు తగ్గిపోతున్న సమయంలో ఇటువంటి నవల రాయడం సంతోషంగా ఉంది.

–*గౌరీశంకర్ కన్నెగంటి,*
హైదరాబాద్

★ 'మర్రిమాను సాక్షిగా' నవల చదివి, ఆ ఆనందంనుంచి తేరుకోకముందే జూన్‌లో 'ఓ వర్షం కురిసిన రాత్రి'ని అందించారు. ఈ నవలను చదివాక నిజంగానే వర్షంలో తడిసి ఆనందాన్ని పొందిన అనుభూతి కలిగింది. ఇది ఇతరుల కుట్రలను ప్రతిబింబించే అపురూపమైన సస్పెన్సుతో కూడిన నవల.

– *బి.చంద్రమొగిలి,* దొనబండ, ఆదిలాబాద్

★ ఆద్యంతం సస్పెన్సుతో ఏకబిగిన చదివించిన నవల 'ఓ వర్షం కురిసిన రాత్రి'. రాజేష్‌కుమార్‌కు తమిళనాట ఎందుకంత నీరాజనం పడుతున్నారో దీన్ని చదివిన తర్వాత అర్థమయింది.

–*ఎన్.విజయలక్ష్మి,* ఒంగోలు, ప్రకాశం జిల్లా

★ 'ఓ వర్షం కురిసిన రాత్రి' నవల భారంగా ఉంది. అనువాదంలో నిపుణులైన జిల్లేళ్ళ బాలాజీ మరో మంచి నవలను ఎన్నుకొనింటే బాగుండేది.

–*కరణం బాలసుబ్రహ్మణ్యం పిళ్ళై,*
మదనపల్లె

చిరునామా : మనసున ఉన్నదీ... సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్–500 082
ఈ మెయిల్ : vipula.chatura@gmail.com

ఫాంలో ఉన్న డ్రైవర్ కనిపించాడు. అతన్ని చూసి మిత్రులు మొఖాలు చూసుకున్నారు. అది తన ఏర్పాటు కాదన్నట్లు సూర్యం పెదవి విరిచి భుజాలు ఎగరవేశాడు. అంతలో మూర్తి ఫోన్ రింగయింది.

"హలో" అన్నాడు మూర్తి. అవతలి మాటలు విని "ఒక్క నిముషం" అని, "నీకే" అంటూ నారాయణ చేతికి అందించాడు ఆ ఫోన్.

"హలో" అన్నాడు నారాయణ.

"నేనెవరో నీకు తెలియదు. నీకు కావలసిన అమ్మాయి నా దగ్గరుంది. డ్రైవర్ని పంపించాను. అతని వెంట వస్తే అన్ని విషయాలు మాట్లాడుకుందాం" అన్నాడు ఎలగప్ప.

"సరే" అన్నాడు నారాయణ.

"ఎవరు? " అడిగాడు మూర్తి.

"శార్వాణి వాళ్ళ దగ్గరే ఉంది. మనం వెళ్ళాల్సిన చోటు వెతుక్కోనవసరం లేదు. వాళ్ళే బండి పంపించారు" అన్నాడు నారాయణ నవ్వుతూ.

డ్రైవర్ దగ్గరకు వెళ్ళి అతను ఎదురు చూస్తున్నది తమకోసమే అని చెప్పి ఆ వెహికల్‌లో ప్రయాణమయ్యారు మిత్రులు ముగ్గురూ.

ప్రయాణంలో ముగ్గురూ మాట్లాడుకోలేదు. తాము వస్తున్న విషయం తెలుసుకోగలిగాడంటే ఆ తాంత్రికుడు సామాన్యుడు కాదని అర్థమయింది అందరికీ. గత జన్మలో అతను కూడా తమ సహ విద్యార్థిగా ఉన్నాడని తెలిసి అతనంటే మనసులో ఒక మూల సానుభూతి కలుగుతున్నా, వాళ్ళ వలన కలిగిన దారుణాలు గుర్తుకి రాగానే అంతులేని కోపం తప్ప మరో భావం కలగటం లేదు.

వారు ప్రయాణిస్తున్న వెహికల్ ఎలగప్ప ఫాంహౌస్ లోనికి ప్రవేశించింది.

బంగళా ముందున్న లాన్‌లో ఎలగప్ప రుద్రప్పలు ఒకపక్క, కురుప్పు ఒకపక్క నిలబడి ఉన్నారు. దూరంగా శార్వాణి ట్రాన్స్‌లో ఉన్నట్లు నిలబడి ఉంది. ఆమె పక్కన ఇద్దరు సాయుధులు తుపాకులు ఆమెకు గురిపెట్టి ఉన్నారు.

నారాయణ మిత్రులతోపాటు వెహికల్ దిగి నడుచుకుంటూ వారి దగ్గరకు వచ్చాడు. వాళ్ళచుట్టూ అర్థచంద్రాకారంలో సాయుధులు తుపాకులు వారికి గురిపెట్టి నడిచారు.

సెక్యూరిటీవాళ్ళను దూరంగా పంపించమని ఎలగప్పతో చెప్పాడు కురుప్పు. వాళ్ళను దూరంగా ఉండమని ఎలగప్ప సైగ చేశాడు. సెక్యూరిటీ వాళ్ళు దూరంగా జరిగి అక్కడనుంచే గన్స్ ఎయిమ్‌చేసి పట్టుకున్నారు.

కురుప్పు తన కళ్ళజోడు తీసి ముగ్గురి మిత్రులను తీక్షణంగా చూశాడు.

మూర్తి, సూర్యంలు నారాయణకు చెరో వైపు నుంచుని ఉన్నారు. కురుప్పు చూపు తమను తాకగానే ఒళ్ళు జలదరించి నారాయణకు దగ్గరగా జరిగారు వాళ్ళు.

"నారాయణా, మనం చాలా ఏళ్లకు కలిసాము. గుర్తుపట్టావా? ప్రాణమిత్రుడిని పలకరించినట్లు అన్నాడు కురుప్పు. నారాయణ మౌనంగా తల ఊపాడు. కురుప్పు తేనె పూసినట్లు మాట్లాడుతుంటే అతని ఒళ్ళు మండిపోతోంది.

"నేను గురువుగార్ని ఎంతో భక్తితో సేవించాను. అయినా మోసగించారు. నన్ను కాదని మహాభైరవుడిని నీకప్పగించారు" తనకు అన్యాయం జరిగినట్లు, ఇప్పుడు ఆ అన్యాయాన్ని తాను సరిచేయబోతున్నట్లు మాట్లాడాడు.

"ఏదీ ఓసారి ఆ విగ్రహాన్ని చూపించు" అని అడిగాడు కురుప్పు.

బ్యాగ్‌లో నుంచి విగ్రహాన్ని తీసి చేతిలో

పట్టుకున్నాడు నారాయణ.

సెక్యూరిటీ గార్డుల చేతులలోని చైన్లు ఊడలాక్కుని ఆ కుక్కలన్నీ నారాయణ వాళ్ళ దగ్గరికి గట్టిగా అరుచుకుంటూ వచ్చాయి. నారాయణ చేతి సైగతో ఒక్కసారిగా నిశ్శబ్దంగా నారాయణ చుట్టూ కూర్చున్నాయి. అవి అరచినప్పుడు కంటే నిశ్శబ్దంగా ఉన్నప్పుడే ఎలగప్పకు, రుద్రప్పకి ఎక్కువ భయం వేసింది.

ఇద్దరూ తమ జేబులలోని పిస్తోళ్లు తడిమి చూసుకున్నారు.

"నారాయణా శభాష్, ఎన్నో ఏళ్ళ నుంచీ ఎదురుచూస్తున్న భైరవుడిని నా దగ్గరకు తెచ్చావు. ఆ విగ్రహాన్ని నా చేతికిచ్చి శార్వాణిని తీసుకుపో" అన్నాడు కురుప్పు.

"కురుప్పూ, మహాభైరవుడిని నీ చేతికి ఇస్తానని ఎలా అనుకున్నావు? దుష్టశిక్షణ చేస్తానని కంకణం కట్టుకున్నాను నేను" అన్నాడు నారాయణ.

"దుష్టశిక్షణ చేసేముందు శార్వాణిని రక్షించడం కూడా నీ బాధ్యతే అని మరచి పోయావా? " హేళనగా నవ్వుతూ అడిగాడు కురుప్పు.

మహాభైరవుడి విగ్రహాన్ని తన వైపుకి తిప్పుకుని తదేకంగా చూశాడు నారాయణ.

"మంత్ర ప్రయోగాలు చేయవద్దు నారాయణా. తర్వాత నువ్వే చింతిస్తావు" అన్నాడు కురుప్పు కోపంగా.

"నువ్వు శార్వాణిని నీ కవచంగా మార్చుకున్నావని నాకు తెలుసు. కాని ఎలగప్పను, రుద్రప్పను వదిలిపెట్టడానికి మహాభైరవుడు అంగీకరించటంలేదు" అన్నాడు నారాయణ, తన చూపుని విగ్రహం నుంచి ఎలగప్ప వైపు తిప్పుతూ.

ఉలిక్కిపడ్డాడు ఎలగప్ప.

"కురుప్పు, వాడితో మాటలేమిటి? నా సెక్యూరిటీ ఆ విగ్రహాన్ని క్షణంలో లాక్కుంటారు. నువ్వు ఊం అను" అన్నాడు కోపంతో ఊగిపోతూ.

కుక్కలన్నీ ఒక్కసారిగా ఎలగప్పను చూసి భయంకరంగా మొరిగాయి.

కురుప్పు, ఎలగప్ప మాటలు పట్టించుకోలేదు. "నాకు అభ్యంతరం లేదు నారాయణా, కాని ఆ తర్వాత మహాభైరవుడిని నువ్వు స్వయంగా నా పరం చేయాలి. నీకు సమ్మతమేనా? " అడిగాడు.

రుద్రప్పకి పిచ్చి కోపం వచ్చింది.

చుట్టూ ఉన్న సెక్యూరిటీ తమది. వారి చేతిలో ఉన్న అత్యంత ఆధునికమైన ఆయుధాలు తమవి. అంతెందుకు? ఆ చోటు కూడా తమది. అట్లాంటిది తమ ప్రాణాలు తీయడానికి వాళ్ళు తమ ఎదురుగా నిలబడి కూల్‌గా మాట్లాడుకుంటుంటే తిక్కరేగిపోయింది.

"ఇదేమైనా జోకా? మమ్మల్ని చంపడానికి వంతులు వేసుకుంటున్నారే! అసలు మీరు ఉంటే కదా? " అంటూ జేబులో నుంచి ఒక బాంబును బయటకు తీశాడు.

ఇదంతా పొంచి గమనిస్తున్న ప్రవీణ్ తనకు శశి ఇచ్చిన రిమోట్‌ని తీసి ఒత్తాడు. కుక్కలన్నీ ఒక్కసారి బిగ్గరగా అరిచి వారిద్దరివైపు దుమికాయి. వాటి భయానికి రుద్రప్ప, ఎలగప్ప వెనక్కి తిరిగి పరుగు అందుకున్నారు.

## కొత్తగాలి...



**ఆత్మీయతకు కాగిలి**
**అర్థింపునకు దోసిలి**
**అంతుచూడ్డానికి పిడికిలి**
**అంతా చేతి చలవే**

– అయినాల కనకరత్నాచారి,
కొరిశపాడు, ప్రకాశం జిల్లా

"రేయ్ బాంబు వాటిపైకి విసరరా" అన్నాడు ఎలగప్ప.

బాంబు ఫ్యూజ్ తీశాడు రుద్రప్ప. దాన్ని విసిరేలోపే అతని చేతిని పట్టుకుంది ఒక కుక్క. అదే క్షణంలో ఆ బాంబు పేలడం... తండ్రీ కొడుకులిద్దరూ కుక్కతో సహా చిన్నాభిన్నం కావడం క్షణాల్లో జరిగిపోయింది.

"నారాయణా, ఆ విగ్రహాన్ని ఇటు తీసుకురా" ఆజ్ఞాపించాడు కురుప్ప.

"వద్దు నారాయణా.. శార్వాణి ప్రాణాలు పోయినా ఈ దుష్టుడికి మహాభైరవుడిని అప్పగించకు" అన్నాడు మూర్తి ఆవేశంగా.

కురుప్ప కుపితుడై మంత్రదండాన్ని ఎత్తాడు.

"తొందరపడకు కురుప్ప" అన్నాడు నారాయణ. తర్వాత మూర్తివైపు తిరిగి-

"నువ్వు నాపనికి అడ్డు రావద్దు" అంటూ చేతిలోని విగ్రహాన్ని కనులకద్దుకుని కురుప్పువైపు నడిచాడు.

ప్రవీణ్ తన జేబులోని రివాల్వర్‌ని బయటకు తీసి గుళ్ళు చెక్ చేసుకున్నాడు.

మొఖమంతా ఆనందంతో వెలిగిపోతూ ఉండగా కురుప్ప రెండు చేతులు చాచాడు విగ్రహాన్ని అందుకోవడానికి. మహాభైరవుడి కళ్ళు ఎరుపురంగు పులుముకున్నాయి. నారాయణ చుట్టూ ఉన్న కుక్కలన్నీ హృదయవిదారకంగా రోదించాయి.

చెట్టుచాటున ఉన్న ప్రవీణ్ రివాల్వర్ ఎయిమ్ తీసుకున్నాడు. ఇంకో క్షణంలో కురుప్ప చేతులు మహాభైరవుడి విగ్రహాన్ని తాకుతాయనగా, ప్రవీణ్ రివాల్వర్ నుంచి వెలువడిన బుల్లెట్ కురుప్ప తల వెనుక తగిలింది. నుంచున్నవాడు నుంచున్నట్లు నేలకూలాడు. అంతే శార్వాణిపై ఉన్న కవచ ప్రభావం పోయి తెలివిలోకి వచ్చింది. కురుప్పకి శార్వాణి మంత్రాలనుంచి రక్షణ ఇచ్చింది గాని యంత్రశక్తి నుంచి ఇవ్వలేకపోయింది.

జరుగుతున్నదంతా సెక్యూరిటీ సిబ్బంది బిక్కమొఖాలతో చూస్తూ నుంచున్నారు. ప్రవీణ్ చేతిలో రివాల్వర్ పట్టుకుని శార్వాణి దగ్గర దగ్గరకు నడిచి ఆమెను ప్రేమగా దగ్గరకు తీసుకున్నాడు.

నారాయణ మహాభైరవ విగ్రహాన్ని గుండెలకు హత్తుకున్నాడు.

మూర్తి, సూర్యం పరుగున వచ్చి నారాయణను అభినందించారు.

ప్రవీణ్, శార్వాణి చేయి పట్టుకుని నారాయణ దగ్గరకు వచ్చి, "మీరెవరో తెలియదు గాని, చాలా చాలా థాంక్స్" అన్నాడు.

మూర్తిని అప్పుడే చూసిన శార్వాణి "బాబాయ్" అని ఆనందంగా అరిచింది.

"మీరంతా ఒకరికొకరు ముందే తెలుసా? " అన్నాడు ప్రవీణ్ ఆశ్చర్యంగా.

మూర్తి, నారాయణల దగ్గర సెలవు తీసుకుని ఉజ్జయిని బయల్దేరాడు సూర్యం.

శార్వాణిని ఇంటికి చేర్చాక నారాయణను, మూర్తిని అందరూ ఎంతో అభినందించారు.

శార్వాణి, ప్రవీణ్‌లు ఒకరినొకరు ఇష్టపడటంతో వారి వివాహానికి పెద్దలు అంగీకరించారు.

ఎలగప్ప మరణంతో గనుల మాఫియా నడుము విరిగినట్లయింది. కన్నడ రాజకీయాలపై మాఫియా ప్రభావం పోవడంతో మంత్రులూ సంతోషించారు.

ప్రవీణ్‌పై సస్పెన్షన్ ఎత్తివేశారు.

మహాభైరవుడి విషయం తెలిసినవారు దాన్ని గోప్యంగా ఉంచుతామని నారాయణకు మాట ఇచ్చారు. ఆ మాటకు వారు కట్టుబడి ఉన్నారు.

నారాయణ మహాభైరవుడి పూజా కార్యక్రమాలు ఏకాంతంగానే చేస్తూ ఇప్పటికీ దుష్ట శిక్షణకు, శిష్టరక్షణకు పాటుపడుతూనే ఉన్నాడు.



# సిమ్‌కార్డు

పనిమీద అబిడ్స్‌కు బయలుదేరిన అభి బైక్ ట్యాంక్‌బండ్ చేరేసరికి పేవ్‌మెంట్ మీద మొక్క జొన్న పొత్తులు వేడివేడిగా దర్శనమిచ్చాయి. ఆ బండి పక్కనే తన వాహనం ఆపి తనకొకటి ఆర్డర్ చేశాడు. మొక్కజొన్న పొత్తులు కాల్చు తుంటే బండిమీదే కూర్చుని దిక్కులుచూస్తున్న అతనికి పేవ్‌మెంట్ పక్కన గడ్డిలో తళుక్కున మెరుస్తూ కన్పించిందొకటి...

చటుక్కున ఒంగి తీసుకున్నాడు. శుభ్రంగా తుడిచి జేబులో వేసుకున్నాడు. ఇంతకీ అదో సిమ్‌కార్డు!

ఆ సాయంత్రం ఆఫీసయ్యాక సిమ్‌కార్డు విషయం గుర్తొచ్చింది అభిజిత్‌కు. ఎక్కడైనా సిమ్‌కార్డు దొరికితే దాన్ని ఫోన్‌లోవేసి ఎవరైనా దానికి ఫోన్‌చేస్తారేమో అని ఎదురుచూడడం అతనికో సరదా! గతంలో ఎవరివో సిమ్‌కార్డులు అలావేసి గుర్తుతెలియని అప్పులవాళ్లు బండబూతులు తిడుతుంటే పొట్టచెక్కలయ్యేలా నవ్వుకున్నాడు. అదో థ్రిల్లింగ్! ఆ తర్వాత ఆ సిమ్ తీసి పారేసేవాడు. కొన్ని పనిచేసేవీ కావు. అందుకే ఎక్కడ ఏ సిమ్ దొరికినా తీసి దాచుకోవడం అల వాటైంది. ఈసారి ఎలాంటి థ్రిల్ తనకోసం కాచుక్కూర్చుందో అనుకుంటూ ఉదయం దొరికిన సిమ్‌కార్డును ఫోన్‌లో వేశాడు అభిజిత్.

అతను అలా వేశాడో లేదో వెంటనే రింగైందా ఫోన్!

వెంటనే ఆన్‌చేశాడు కానీ మాట్లాడలేదు..

'డాడీ.. డాడీ.. హలో.. మాట్లాడవేం డాడీ..' అంటోందో చిన్నారి పాప అవతల్నించి ఏడుపు గొంతుతో.

'హలో..' అన్నాడు అభిజిత్.

పాప ఏడ్చేసింది. 'పొద్దుననగా టిఫిన్ తెస్తానని వెళ్లావ్! ఇంతవరకూ రాలేదు. తర్వాత ఫోన్ చేస్తే స్విచ్ఛాఫ్ అని వచ్చింది.. ఎక్కడికి పోయావ్ డాడీ? అమ్మ పడుకునే ఉంది.. ఎంత లేపినా లేవడంలేదు.. నాకు చాలా ఆకలిగా ఉంది డాడీ.. చాలా భయంగా కూడా ఉంది డాడీ.. కరెంటు కూడా లేదు.. ఇల్లంతా చీకటిగా ఉంది డాడీ' అంది బెక్కుతూ.

అభిజిత్ గుండె నీరైంది.. పాపం ఎవరి పాపో? వాళ్ల డాడీ కోసం ఓ పక్క ఆకలితో మరోపక్క భయంతో అలమటిస్తోంది.. ఇప్పుడెలా? ఏంచేయాలి? ఏం చెప్పాలి?

అవతల నుంచి 'డాడీ డాడీ! ప్లీజ్ ఇంటికి రా డాడీ' ఏడుస్తూనే అడుగుతోందాపాప.

'హలో పాపా నీ పేరేంటమ్మా?' సాధ్యమైనంత మార్దవంగా అన్నాడు అభి.

పాప ఉలిక్కిపడ్డట్టుంది.

కొన్నిసెకన్లలోనే తేరుకుని- 'హలో మీరు మీరు.. డాడీ కాదా?' అంది.

ఆమె గొంతులో కొండంత దిగులు.

అభికి చాలా బాధ అన్పించింది.

'కాదమ్మా మీ డాడీ ఫ్రెండ్‌ని! డాడీ ఫోన్ నాదగ్గర ఉంచి ఇప్పుడే బయటకు వెళ్లారమ్మా..' అన్నాడు ఏమనాలో తోచక.

'సరే అంకుల్! డాడీ రాగానే తొందరగా ఇంటికి రమ్మని చెప్పండంకుల్..'

'అలాగేనమ్మా! సరేగానీ నీపేరేంటి?' అడిగాడు అభి.

ఆకలితో నకనకలాడుతున్న ఆ చిన్నారికి ఏదైనా తిన్పించాలని అతనికి ఒకటే తహతహగా ఉంది.

'రోజా అంకుల్.. డాడీ నిజంగా వస్తాడా అంకుల్?'

'ఎందుకు రాడమ్మా? తప్పకుండా వస్తాడు.. నేను పంపిస్తాగా డాడీని. ఇంతకీ మీరుండేది ఎక్కడమ్మా?' ఆరా తీశాడు అభి.

పాప తనకు తోచిందేదో చెప్పింది. అతనికి అది ఏ ఏరియానో సరిగా అర్థంకాలేదు.. తన తండ్రి బైక్ నెంబరు కంఠోపాఠం అనుకుంటా. అడిగితే రకీమని చెప్పింది. నోట్ చేసుకున్నాడు.. ఆర్టీఏ సహాయంతో చిరునామా తెలుసుకోవచ్చు. అదీ అతను రిజిస్ట్రేషన్‌వేళ ఇంటి అడ్రసు ఇచ్చుంటే! కానీ ఇప్పటికే చీకటిపడింది. రేపు ఉదయాన్నే ఆర్టీఏకి వెళ్లి అడ్రస్ పట్టుకోవాలి.. మరి అందాకా పాప? శోషవచ్చి పడిపోతుందేమో?

దేవుడా పాపకు ఈ రాత్రి ఏమీ జరక్కుండా కాపాడు స్వామీ అని మనసులోనే దణ్ణం పెట్టు కున్నాడు. ఇంతకీ ఆ తండ్రి ఎక్కడికి వెళ్లినట్టు? ట్యాంక్‌బండ్‌పై అతని సిమ్ తనకు దొరకడ మేంటి? అక్కడ అతనేమన్నా ఆత్మహత్యకు పూనుకున్నాడా? ఛ తనెందుకంత ఓవర్‌గా ఆలో చిస్తున్నాడు.. అయితే టిఫిన్ తెస్తానని ఉదయం అనగా వెళ్లినవాడు సాయంత్రమైనా ఇంటికి రాక పోవడం ఏంటి?

ఆ రాత్రంతా అభిజిత్‌కు నిద్రపట్టలేదు.. పాప ఏ నెంబరునుంచి చేసిందో ఆ నెంబరుకు ఒకటి రెండు సార్లు కాల్ చేసినా ఎవరూ తీయలేదు.. ఒకవేళ నిద్రపోయిందేమో? నిజంగా నిద్రపో యిందా లేక ఆకలితో.. అసలు వాళ్లమ్మ పడు కుని లేవకపోవడం ఏమిటి? ఏమైందావిడకి? ఆపైన ఆలోచించడానికే బాధన్పించింది. ఇ ల్లెక్కడ అంటే ఫ్లైవోవర్ దగ్గర అంది. సిటీలో ఎన్నో ఫ్లైవోవర్లు.. ఎక్కడని వెదకాలి? అయ్యో పాపంపుణ్యం తెలియని ఓ చిన్నారి ఆకలిచావుకు గురవుతుంటే తనేం చేయలేకపోతున్నాడే? అంతలో మెరుపులాంటి ఆలోచన వచ్చింది. ఎస్సార్‌నగర్ ట్రాఫిక్ ఇన్‌స్పెక్టర్ తనకి చుట్టమే! వెంటనే అతనికి ఫోన్‌చేసి విషయం చెప్పి, ఆ వ్యక్తి బైక్ నెంబరు ఇచ్చాడు.. అదెక్కడన్నా ట్రేస్ అయితే దాని ద్వారా అతని ఆచూకీ తెలుసుకోవ చ్చని చెప్పాడు.

'సరే నా ప్రయత్నం నేను చేస్తా. బట్ నాకైతే ఈ రాత్రి మనమేం చేయలేమనిపిస్తోంది అభీ! ఏది చేసినా రేపే' అన్నాడు సుధాకర్.

తెల్లవారు ఝామున మూడింటివరకూ నాలు గైదుసార్లు సుధాకర్‌కు చేసినా ఆశించిన జవాబు రాలేదు.. నిజానికి అతనూ చాలా ప్రయత్నం చేశాడు.

తెల్లారింది.. ఒకట్రెండుసార్లు పాపకు ఫోన్‌చేసినా మోగుతోంది కానీ ఎత్తలేదు.. దాంతో ఆమెకు ఏమైందోనని టెన్షన్! ఉరుకులు పరుగులు మీద పనులన్నీ కానిచ్చు కుని సుధాకర్‌తో కలిసి ఆర్టీఏకి వెళ్లాడు అభి.




పోలీసు ఇన్‌స్పెక్టర్ రావడంతో ఆర్టీఏవాళ్లు కాస్త కనికరించారు. ఆ బండి యజమానిపేరు లోహిత్‌కుమారనీ, కూకట్‌పల్లిలో ఉంటాడనీ అడ్రస్ చెప్పారు. ఫోన్ నెంబరు ఇచ్చారు.. అది



తనదగ్గరున్న నెంబరూ కాదు.. పాపదగ్గరున్నదీ కాదు. దానికిచేస్తే నో రెస్పాన్స్!

అప్పటికే సమయం పదకొండైంది.

అంతలోనే సుధాకర్ ఫోన్ మోగింది. అఫ్జల్ గంజ్ ఇన్‌స్పెక్టర్ చేశాడు. సుధాకర్ చెప్పిన వెహికల్ తమ స్టేషన్‌లో ఉందని చెప్పాడు. నిన్న ఉదయం పురానాపూల్ దగ్గర బైక్ యాక్సి డెంట్ జరిగిందనీ, డ్రైవర్ తీవ్రంగా గాయపడి, స్పృహకోల్పోయాడనీ ఉస్మాని యాలో ఉన్నాడనీ, కండిషన్ క్రిటి కల్ అనీ చెప్పాడు.

అంతే! అభీ సుధాకర్ ఆఘమేఘా లమీద ఉస్మానియాకు పరుగెత్తారు. ఆ వ్యక్తి పేరు లోహిత్‌కుమార్ కాదనీ, జేబులో ఉన్న గుర్తింపు కార్డును బట్టి ప్రభాకర్ అనీ, మలక్ పేట గవర్నమెంటాస్పత్రిలో ఉద్యోగి అనీ తేలింది. ఫొటో కూడా టాలీ అయింది.. సో ఇప్పుడు అభీ సుధాకర్‌లకు కొద్దిగా క్లారిటీ వచ్చింది. ఫ్లైవోవర్ అంటే డౌటేముంది? మలక్ పేట ఫ్లైవోవరే! ఆ సమీపంలోనే అతనిల్లు ఉంటుంది. ఇద్దరూ మలక్‌పేట ఆస్పత్రికి పరు




గుతీశారు. ప్రభాకర్ ఆచూకీ తీస్తే.. మలక్‌పేట రేస్‌కోర్సు రోడ్‌లో మసీదు సమీపంలో ఉంటా డని అతని కొలీగ్ చెప్పాడు.. అతను కూడా వెంటరావడంతో పాపను కాపాడడానికి వాళ్లింటికి పరుగుతీశారు మిత్రులిద్దరూ.

ఆ ఇంటికి చేరేసరికి అక్కడ జనం గుమికూడి ఉన్నారు. అభి గుండెల్లో రైళ్లు పరుగుతీశాయి. దుర్వాసన కొడుతున్న ఓ యువతి మృతదేహాన్ని ఆ ఇంట్లోంచి అప్పుడే బయటకు తీసుకొస్తున్నారు పోలీసులు. బహుశ ఆమె పాపతల్లి కాబోలు.. ఇంతకీ ఆమెకి ఏమైంది? అయ్యో మరిపాప? అంతలోనే పాపకు సెలైన్ ఎక్కిస్తూ ఓ స్ట్రెచర్ మీద తీసుకొచ్చారు 108 డాక్టర్, ఇద్దరు నర్సులు..

పాపను చూసి బావురుమన్నాడు అభి. అంతా ఆశ్చర్యంగా అతనివంక చూశారు. సుధాకర్ అభిని అనునయించాడు.

★ ★ ★

రెండునెలలు గడిచాయి. పాపను అభి అల్లారుముద్దుగా పెంచుకుంటున్నాడు.

అప్పటికి అతనికి ఇంకా చాలా విషయాలు తెలిశాయి ప్రభాకర్ మరణవాంగ్మూలం ద్వారా. ప్రభాకర్ అనుమానం మనిషి. ఆ రాత్రి భార్యాభర్తల నడుమ హోరాహోరీగా యుద్ధం జరిగింది. ఆ బాధ భరించలేక జీవితం మీద విరక్తితో అతని భార్య సుభద్ర అదేరోజు రాత్రి ఎలుకల మందు తిని చనిపోయింది.. అది తెలియని ప్రభాకర్ ఆమె నిద్రలో ఉందనుకున్నాడు. టిఫిన్ తెస్తానని పాపకు చెప్పి బండిమీద వెళ్లి పురానాపూల్ వద్ద యాక్సిడెంట్‌కు గురయ్యాడు. లోహిత్‌కుమార్‌వద్ద బండికొన్నా తన పేరుతో బదిలీ చేయించలేదు..

అయితే అతని సిమ్‌కార్డు ట్యాంక్‌బండ్‌మీదకు ఎలా చేరిందనేది సస్పెన్స్! మరికొన్నాళ్లకు సుధాకర్‌ద్వారా అదీ తెలిసిపోయింది.

ఆరోజు యాక్సిడెంట్ తర్వాత రోడ్డుమీద స్పృహలేకుండా పడున్న ప్రభాకర్ సెల్‌ఫోన్‌ను ఓ దొంగ కొట్టేశాడు. నేరుగా అఫ్జల్‌గంజ్‌కి వచ్చి, వాడు సికింద్రాబాద్ బస్సెక్కాడు. బస్ ట్యాంక్ బండ్ చేరాక అందులోని సిమ్ తీసిపారేశాడు. అలా అది అభికి దొరికింది. రోజాకు ఓ మంచి నాన్నను సంపాదించిపెట్టింది..

–చంద్రప్రతాప్

1980 సంవత్సరానికి 'ఒరుదేశ త్తింటె కథ' నవలకు జ్ఞానపీఠ పురస్కారం స్వీకరించిన మలయాళ సాహితీ మేరునగం ఎస్.కె. పొట్టెక్కాట్ అర్ధశతాబ్దికి పైగా సృజించిన రచనలు, సాధించిన విజయాలు అసాధారణం. ఉన్నతాశయాలు, ఉదాత్త వ్యక్తిత్వం, ఉత్తమ రచనలు భారతీయ సాహిత్య జగత్తులో ఆయనకు అపూర్వ పేరు ప్రతిష్టలు సమకూర్చాయి.



# మలయాళ సాహితీ మేరునగం పొట్టెక్కాట్

శంకరన్‌కుట్టి పొట్టెక్కాట్ 1913 మార్చి 14న కేరళ రాష్ట్రం కాలికట్‌లో జన్మించాడు. తండ్రి కుంజిరామన్ ఉపాధ్యాయుడుగా అందరి మన్నన లందుకున్నాడు. పొట్టెక్కాట్ ఓనమాలు దిద్దుకుంది కాలికట్‌లోనే. హిందూ పాఠశాల, జామొరిన్ ఉన్నత పాఠశాలలో చదువుకున్నాడు. తర్వాత జామొరిన్ కళాశాలలో చేరి మద్రాసు విశ్వవిద్యాలయం నుంచి గ్రాడ్యుయేషన్ సాధించాడు. విస్తారంగా గ్రంథాలు పఠించే అలవాటున్న పొట్టెక్కాట్ భారతీయ సాహిత్యంతోపాటు పాశ్చాత్య సాహిత్యమూ అధ్యయనం చేశాడు. సహజ ప్రతిభ, పరిశీలనాసక్తి, సాహిత్యాభిమానం రచయితగా ఎదిగేందుకు దోహదం చేశాయి. ప్రజల పరిస్థితులు, వివిధ ప్రదేశాల విశేషాలు ప్రత్యేకంగా తెలుసుకునేవాడు. పర్యటనలంటే మక్కువ. దేశభక్తి అలవడింది. కాలికట్‌లో ఉన్న గుజరాతీ పాఠశాలలో ఉపాధ్యాయుడిగా పనిచేశాడు. త్రిపుర కాంగ్రెస్ మహాసభలకు హాజరై, తర్వాత ముంబయి వెళ్ళి అక్కడ కొంత కాలం ఉద్యోగం చేశాడు. స్వరాజ్యోద్యమంలో పాల్గొన్నాడు. సృజనాత్మక రచననే జీవికగా చేసుకోవాలని నిశ్చయించుకుని స్వస్థలం తిరిగి వచ్చాడు. అనతి కాలంలోనే సాహితీరంగంలో ప్రసిద్ధుడయ్యాడు. యాత్రాభిలాషతో ఆఫ్రికా, ఐరోపా దేశాలు పర్యటించాడు. జయవల్లితో వివాహానంతరం ఆగ్నేయాసియా దేశాలు సందర్శించాడు. 1957లో తెల్లిచెర్రి నియోజకవర్గం నుంచి పార్లమెంట్‌కు పోటీచేసి ఓడిపోయినా తర్వాత 1962లో వెంట్రుకవాసిలో విజయం సాధించారు.

రచయితగా పొట్టెక్కాట్ విలక్షణ మార్గం ఎంచుకున్నాడు. స్పష్టత ఆయన రచనల్లో ముఖ్యలక్షణం. కథ, నవల, యాత్రాచరిత్ర రచనలో పొట్టెక్కాట్ తనకు తానే సాటి అనిపించుకున్నాడు. కథానాయకుణ్ణి కేంద్ర బిందువుగా చేసుకుని అప్పటివరకు నవలా రచన చేసే పద్ధతికి స్వస్తి చెప్పి, సమాజాన్ని ప్రధాన భూమికగా చేసుకున్నాడు. మానవ సంబంధాలకు, మానవీ




యతకు పట్టం కట్టాడు. ప్రేమకు కొత్త అర్థం చెప్పాడు. మలయాళీ కథా ప్రక్రియకు, యాత్రానుభవ రచనకు ఆయన ఉన్నత స్థానం చేకూర్చాడు. కవితలు, నాటకాలు, గేయాలు, వ్యాసాలు కూడా ఆయన లేఖిని నుంచి విస్తారంగా వెలువడ్డాయి. పొట్టెక్కాట్ మొత్తం 11 నవలలు, 23 కథాసంపుటాలు, 17 యాత్రానుభవ గ్రంథాలు, 3 కవితాసంపుటాలు, 4 నాటకాలు, 5 వ్యాససంపుటాలతో మలయాళ సాహిత్యాన్ని పరిపుష్టం చేశా

డు. పొట్టెక్కాట్ కథా కథనం అద్వితీయం. తొలి కథ 'రాజనీతి'తోనే తన సొంతగొంతు వినిపించాడు. 'కలోచా' కథలో మనస్తత్వ చిత్రణ అబ్బుర పరుస్తుంది. 'పుల్లిమన్' కథలో పురుష ప్రేమలోని చాంచల్యాన్ని దుయ్యబట్టాడు. విధివైపరీత్యం చూపే కథ 'వధు'. కాశ్మీరు నేపథ్యం ఉన్న సంపుటి 'హిమవాహిని'. ఇక ప్రేమౌన్నత్యాని చిత్రించే 'కాట్టు చంపకం' కథలో ఒక యువతి తన ప్రియుడి కోసం సంవత్సరాలపాటు అడవి సంపెంగ చెట్టు కింద నిరీక్షించడాన్ని ఆర్ద్రంగా చిత్రించాడు. దేశభక్తి చూపే కథ 'ఒజ్జింజ కాట్టిల్' విదేశంలో సాటి మలయాళీలపై అభిమానం 'మలయాళ తివాటె ఛోరం' చిత్రిస్తుంది. తొలిదశలో రచించిన కవితలు 'ప్రభాతకాంతి', 'సంచారియుడె గీతంగళ్', 'ప్రేమశిల్పి' సంపుటాలుగా వచ్చాయి. 'అచన్', 'అచనుమ్-మకనుమ్', 'అల్తారా', 'తీరండి ఒటున్ను' నాటక రచయితగా పొట్టెక్కాట్‌కు పేరు తెచ్చాయి. ఆయన ప్రయాణానుభవాలు కూడా చక్కటి కథల్లాగా సాగుతాయి. ప్రతి కథనంలోనూ ప్రత్యేకత ఉంటుంది. సన్నివేశాలు ఉత్సుకతతో నిండి ఉంటాయి. విస్తృత పరిశీలనతో రాసినవివి. మలయాళ సాహిత్యంలో ఇవి కొత్తబాటలు వేశాయి. పొట్టెక్కాట్ నవలలు కొత్త ఒరవడి దిద్దాయి. విశాల సామాజిక నేపథ్యం, ఉదాత్త ప్రేమోదంతం ఈ రెండింటి సమ్మిశ్రణం- మూడు వర్గాల ఇతివృత్తాలున్న రచనలివి. 'నాటన్ ప్రేమమ్' ఆయన ఆవిష్కరిస్తారు. పల్లె వనితను వంచించిన పట్నం యువకుని కథ ఇది. మలయాళీ సాహితీ విమర్శకులు దీనిని అభినవ శాకుంతలంగా ప్రస్తుతిస్తారు. ఎన్నో మలుపులతో నిండిన 'ప్రేమశిక్ష'లో పాత్రల అంతరంగ ఘర్షణను రచయిత ఎంతో నేర్పుతో చిత్రించారు. కులమతాల అడ్డుగోడలు కూలిపోయి స్వచ్ఛమైన ప్రేమకు స్వాగతం పలికే రోజులొస్తాయనే ఆశాభావం 'మూటుపటమ్' నవలకు ఆధారం. వలసదార్ల జీవితాలు ఎంత యాతనామయంగా ఉంటాయో 'విషకన్యక' నవల వెల్లడిస్తుంది. 'ఒరుతెరువింటి కథ' పట్నంలోని ఒక వీధిలో నివసించేవారి జీవితాల చుట్టూ అల్లిన నవల. స్త్రీని విలాసవస్తువుగా వాడుకునే ఒక యువకుడు ఒక స్త్రీ పాత్రలో తన చెల్లెల్ని దర్శించి, ఆమె చూపిన అనురాగంతో ప్రభావితుడవుతాడు. ఇది పాఠకుల్ని చాలా ఆకట్టుకుంటుంది. 'కరంబు', 'కబీనా', 'ఒరుదేశత్తింటె కథ', 'కురుములుకు' మొదలైన ఇతర నవలలు కూడా పొట్టెక్కాట్ నవలా నిర్మాణ దీక్షతకు తార్కాణాలు.

జ్ఞాన పీఠపురస్కారం అందుకున్న నవల 'ఒరుదేశత్తింటె కథ' 1971లో వెలువడింది. ఒక విధంగా ఇది రచయిత ఆత్మకథ అని చెప్పవచ్చు. శ్రీధరన్ ఈ నవలలో ప్రధానపాత్ర. 'అతిరాణిపాదమ్' అనే పల్లెలో అతని నివాసం. తండ్రి కృష్ణన్ ఉపాధ్యాయుడు. శ్రీధరన్ కవితలు, కథలు రాస్తుంటాడు. పొట్టెక్కాట్ ప్రతిబింబమే ఈ శ్రీధరన్ అని స్పష్టమవుతుంది. దొంగదస్తావేజులు సృష్టించే ఆండీ, డంబాలు పలికే కులూజ్ వంటి ఎన్నో పాత్రలు ఈ నవలలో కన్పిస్తాయి. పాత్రల మనోభావాలు, వ్యవహార సరళి అద్భుతంగా చిత్రించాడు. మనస్సాక్షికి, అంతరాత్మ ప్రబోధానికి విలువ ఇవ్వాలని రచయిత ఈ నవలలో ఉద్బోధిస్తాడు. ఆత్మద్రోహం పతనానికి హేతువని నిరూపిస్తాడు. ఉత్తమ సామాజిక వ్యవస్థ అవతరణకోసం తపిస్తాడు. అందుకే ఇది గొప్ప నవలగా భాసించింది.

పొట్టెక్కాట్ అన్ని వర్గాల అభిమానాన్ని గౌరవాన్ని అందుకున్నాడు. మద్రాసు ప్రభుత్వ పురస్కారం, కేరళ సాహిత్య అకాడెమీ, కేంద్ర సాహిత్య అకాడెమీ పురస్కారాలు లభించాయి. కాలికట్ విశ్వవిద్యాలయం గౌరవ డాక్టరేటుతో సత్కరించింది. ఆయన కథ 'బ్రతనేయ' ప్రపంచంలోని ఉత్తమ కథల్లో ఒకటిగా మిలాన్ నుంచి వెలువడిన ఒక ఇటాలియన్ సంకలనంలో చేరింది. పొట్టెక్కాట్ కథలు ఇంగ్లీష్, రష్యన్, జర్మన్, చెక్ వంటి విదేశీ భాషల్లోకి, పెక్కు భారతీయ భాషల్లోకి అనువాదమయ్యాయి. ఆయన మలబారు కేంద్ర కళాసమితి, సాహిత్య ప్రవర్తన సహకార సంఘం అధ్యక్షుడిగా, కేరళ సాహిత్య అకాడెమీ ఉపాధ్యక్షుడిగా, కేంద్ర సాహిత్య అకాడెమీ కార్యవర్గ సభ్యుడిగా సేవలందించాడు. 1982 ఆగస్టు ఆరో తేదీన స్వర్గస్థుడయ్యాడు.

ఎస్.కె.పొట్టెక్కాట్ పేరు సాహిత్య రంగంలో చిరస్థాయిగా నిలుస్తుంది. ప్రజల హృదయాలలో ఆయన ప్రత్యేక స్థానం సముపార్జించుకున్నాడు. కాలికట్‌లోని ఒక వీధికి ఆయన పేరు పెట్టారు. ఒక పార్కు ఏర్పాటయింది. పొట్టెక్కాట్ స్మారక సంఘం ఎన్నో కార్యక్రమాలు నిర్వహిస్తోంది. భారత ప్రభుత్వం ఆయన గౌరవార్థం 2003లో తపాలాబిళ్ళను విడుదల చేసింది.

**– గోవిందరాజు రామకృష్ణారావు**



# చతుర ప్రవేశిక



జులై - 2010

జులై 'చతుర' చదివారా? అయితే ఈ ప్రశ్నలకు ఒకేఒక్క మాటలో జవాబు రాయగలరేమో ప్రయత్నించండి. ఎక్కువమంది సరైన సమాధానాలు రాస్తే డ్రాతీసి విజేతలను ఎంపికచేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

1. 'పండు' అసలు పేరు?
2. ఎలగప్పకు సహకరించే క్రిమినల్ లాయర్?
3. నారాయణకు పూర్వజన్మ వృత్తాంతాన్ని వివరించిన యోగి?
4. శర్వాణితో కవచం ఏర్పాటు చేసుకున్న తాంత్రికుడెవరు?
5. డి.సి.పి. ప్రవీణ్ ఎవరిని ప్రేమించాడు?
6. ఎస్.కె.పొట్టెక్కాట్ ఏ రచనకు జ్ఞానపీఠం లభించింది?
7. అభిజిత్‌కు టాంక్‌బండ్‌పై ఏందొరికింది?
8. ఎలగప్ప కొడుకు పేరేంటి?
9. ఆంధ్రప్రదేశ్ అంతా నీలోఫర్లతో హౌస్‌ఫుల్ అన్నదెవరు?
10. నయాపైసాతో తన ఎత్తును పోల్చుకున్న భారత ప్రధాని?

పంపినవారి పేరు: -------------------------- వయసు (   )

చిరునామా: ------------------------------------

------------------------------------

పిన్‌కోడ్: ఫోన్ నెం:

ప్రవేశికలు పంపాల్సిన చిరునామా : సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 082

ప్రవేశికలకు చివరి తేదీ 19

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

నోట్ : చతుర ప్రవేశిక, విపుల వినోదిని ఒకే కవరులో పంపవచ్చు.

Printed, Published, Edited & Owned, by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, D.No.7-134/1&2, Moosapet Village, Balanagar Mandal, Kukatpally-500 072, Ranga Reddy District. Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 2223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Kadapa: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982818; Chennai: 28232390; Bangalore: 25583804. & www.eenadu.net.






## ప్రతి ఉతుకులో మెగా తెల్లదనం

# సన్‌ఫ్లవర్




## డిటర్జంట్ సోప్ & పౌడర్










మీ అందరి ఆదరాభిమానాలతో మెప్పుపొందిన

సన్ ఫ్లవర్ డిటర్జంట్ సోప్ & పౌడర్‌నే

# ఎల్లప్పుడూ వాడండి

## శివశక్తి సోప్ వర్క్స్

డోర్ నెం. 4-23, కొవ్వూరు రోడ్, జగన్నాధపురం, కాకినాడ - 533 002.

ఫోన్ : 0884 - 2300384

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd No. HD/965/2009-2011 RNI/32186/78